

భారతి–ఫిబ్రవరి 1958

కన్నె తలపులు

—చిత్రకారుడు : శ్రీ. జోగి జగన్నాథ రాజుగారు






నందన
మాఘము

# భారతి

సంపుటము 30
సంచిక 2

## అజంతా

★

శ్రీ అప్పల వీర వెంకట జోగయ్యశాస్త్రి



ఎవ్వడో హో! నభస్సున, కెగిరిపోయి
ప్రాగ్ హరిత్తున నింద్రచాపంబులోని
రంగులన్నియు గుండెలో, రంగరించి
పుక్కిలించిన యీశిల్పి, పుంగవుండు!

ఆదట రెల్లుపూల బరి, యాచకమాడుచు, సాంధ్యరాగ పుం
జాదుల బెల్లగించుచు, జ, పాకుసుమాల సువర్ణ దీప్తిలో
నీదుచు గుంచె పట్టి రమ, ణీయ కమాకృపి నల్పు నీరసో
న్మాది-యనంతసృష్టిపరి, ణామ రహస్యము లెట్లు నేర్చెనో!

ఆ నితంబ వ్యాప్త, మైన చక్కనిదివ్య
        కామినీ కేశనం, స్కారకాండ
బుద్ధదేవుని కేత్తు, ముత్యాల గొడుగులో
        వ్రేలిలోలాడు వ, జ్రాల సొగసు,

పూర్ణకుంభము జంక, బూని పాదుల ప్రోది
      సల్పు కన్నెల విలా, సంపు ప్రకృతి,
లోకాల మురిపించు, లోలాక్షి తనువున
      వొంగి విరిసెడి నాట్య, భంగిమంబు,
నగము విచ్చినలేత పు, ష్పాలలోన
జాలువారెడి మందహా, సాల బిగువు,
ఎవ్వరూహించి యిటు రచి, యింప గలరు?
ఆత్మహృదయంబు రససిద్ధి, నందకుండ

వెలిగించు కొన్నాడొ, వెడద కన్నులలోన
      నారని సందీప్త, మైన జ్యోతి
జీర్ణించుకొన్నాడొ, జిలుగు సంస్పృష్టిలో
      దోచు మర్మాల హృ, త్కోశమందు,
మఱి త్రేన్చుకొన్నాడొ, మధురాతి మధురమా
      పలుకు చెప్పగలేని, భావములను,
కల్పించుకొన్నాడొ, కవనాల కుంచెలో
      నారాధ్య విశ్వవి, శ్వాంతరములు,
తడవి కొన్నాడొ దశదిశాం, తాల వెదకి
యూహకందని ప్రకృతిలో, నున్న సొగసు,
వెల్గునీడల పరిధిలో, విభ్రమించు
జీవితాలోల్కజోసె నీ, శిల్పియిచట!

* * * * *

రాజుల్ పోయిరి, రాజ్యముల్ పనివె, జీ, ర్ణంబౌచు నేతత్కళల్
బూజుల్ గట్టె; పరిభ్రమించినవి శి, ల్పుల్ లోక సన్మాన్యులౌ
రోజుల్; కాని సజీవమై వినుచు నీ, లో భారతీదేవి పెన్
గాజుల్ మ్రోతలు, పైడి గజ్జియల సం, ఘర్షానుకర్ష ధ్వనుల్.

* * * * *

తారుమారయ్యె నెన్ని మ, తాల బ్రతుకొ,
ఆరి నశియించె నెన్నిరా, జ్యములొ; కాని
యమరమై భూమి నే విప, ర్యయము లేక
చిరము జీవించె నీశిల్ప, చిత్రసృష్టి.

లేముల్ కల్మలు; రాగయోగములు; వి, శ్లేషాను సంశ్లేషముల్;
బాముల్ స్వర్గ సుఖానుభూతు; లిటునీ, ప్రజ్ఞావిశేషాన, నా
గాముల్ మిశ్రమమై స్ఫురించు నెచటన్, గన్గొన్న—నీశిల్పమం
దేహాయల్ మర్మము లున్నవో తెలుపుమా, యీ, భావవాచస్పతీ!

ఇది చలివేంద్రజేసి రస, హృజ్జన జన్యతృషా విషాదపుం
బదటు నశింపజేసెడియు, పావృత విశ్వ దిగంతకీర్తి నీ
యదె, భవదీయ హస్తకల, శామిల దివ్య కళాసుధాంబువుల్
ముదమున, గ్రోలినంత తను, వుల్ పులకింపవె యెంతవారికిన్!

ముందుకు బోవలేక, మును, ముందటి రాగరసాబ్ధి గాలితో
జిందగలేక, నాత్మపరి, శీలనచాలక, త్యాగదీక్షకై
డెందము వేగిరింప నొక, టే పరితాపమునందు శాక్యరా
ణ్ణందను మోముతీరు నయు, నంబుల కెట్లు స్ఫురించె నీకిటన్?

అలరించునొక లేమ, యద్దాలనీడలో
 సుకుమార దీర్ఘక, స్తూరి రేఖ,
లాలించునొక కాంత, లజ్జామనోజ్ఞ దృ
 జ్మాలికాడోలి నం, దాల నిసుగు,
సవరించునొకయోష, నవనవోజ్వల తార
 హారముల్ మెడనలం, కారములుగ,
వీక్షించునొక బాల, విరహ విక్లేశార్ద్ర
 తారకంబుల నిమ, ద్వర నభంబు,
అంగవిక్షేప మొనరించు, నబల యొకతె
యాంగికాహార్య సాత్త్విక, భంగిమముల,
హాస మొనరించు నర్తన, గ్నాంగి యగుచు,
పడతి యొక్కతె కుడ్య శి, ల్పాల జగతి.

* * * * *

జైనమతాభిమానుల క, శాంతికరంబుగ గండకత్తెరల్
బూనిన వీరశైవుల న, ముద్ధతి వెచ్చని పచ్చి నెత్తురుల్
దానము సేయు విప్లవ క, థల్ వినిపించు యుగాన - నెట్లు లో
కానికి తూలికల్ రసజ, గద్వ్యవహారము బోధచేసెరా?




———

వచ్చుటకు రెవ్వరికి శక్యముగాదు; ఇఁక నావల్ల మాకయేఁడ నదిదాటు టేడయని తలపోసెను. కాని అతఁడనుకొనినట్లు కృష్ణరాయలు తొరపిల్లలేదు; మఱియు దనస్కంధావారమునందు నిశ్చలుఁడై యతని మార్కొన నెట్టి ప్రయత్నమునుజేయక మిన్నకుండెను; వేగరులను బిలిచి శత్రువునడవడికను నెత్తుగడలను నతని దళసంచారణను జక్కఁగ బరిశీలించి తన కనుక్షణమును తెలియజేయవలయునని యాజ్ఞాపించి యుండెను.

ఇస్మాయీలు ఆదిలుఖాను కనుమానము గల్గినది. తా ననుకొనినట్లు కృష్ణరాయలు దన్ను మార్కొన రాకుండుటకు గారణమేమి? మర్మమేద్దియో నిగూఢమై యుండవలయును; దానిని గనిపెట్టి తగినశాస్తి చేయుట యుక్తమని యెంచి హితులను దండనాయకులను బిల్పించి సభగూర్చి వారిని సలహో యడిగెను. వారియందొక్కొక్కరును కృష్ణరాయల విరాగమనమునకు గారణము నొక్కొక్క విధమున నూహించుటచే, వారియభిప్రాయములు భిన్నములైయుండెను. అంకుశఖాను ప్రభృతులు కొందఱు, కృష్ణరాయలాదిల్ఖానుని పరకు గొనక నిజబలాధిక్యమును నతని యెడ దన నిర్లక్ష్యభావమును వెల్లడిచేయుటకొఱకచలుఁడై, స్కంధావారమందె సుస్థిరుఁడై యున్నాఁడనియును, దాము నదిని దాటినంతటనె వచ్చి తమపై బడునని యుం జెప్పిరి. మఱికొంద ఱది సరి కాదనిరి. పూర్వము మహమ్మదీయులచే హిందువులకు గల్గిన పరాజయములను స్మరించి భీతచేతస్కుఁడై కృష్ణరాయ లున్నాఁడనియు, దాము జంకక ముందునకు నడచి నదినిదాటుట మంచిదనియు, నాదిల్ఖానుఁడు సత్వహీనత జూపుట యుక్తముగాదనియు, నతఁడవు డున్నచోట నెంతికాల మాగియుండిన నతనికి కీడును శత్రువుకు మేలునునంతగ హెచ్చుచుండుననియు, దమకు హిందువులంతటి గొప్పసేన లేకపోయినను బూర్వ విజయములవలన గలిగిన ప్రతిష్ఠయె తమ కిప్పటికిని జయము చేకూర్చునని యు విన్నవించిరి.

అందుమీఁదట నాదిల్ఖానుఁడు తన సైన్యములకు గణుతి పెట్టించెను. విలుకాండ్రుగాని బందూకులవారుగాని ఖేటకధరులుగాని గడలవారుగాని మొత్తము కాల్బల మొకలక్ష యిరువదివేలును, పదునెనిమిదివేల గుఱ్ఱపు రౌతులును, నాటయేబది యేనుగులును సైన్యమందున్నట్లు తేలినది; దీనికి దోడు ప్రబలమైన ఫిరంగులచా రాతనికడనుండెను. తత్సహాయమున శత్రువును సులభముగ సాధింపవచ్చునని నిశ్చయించి సేనల నేఱు దాటుట కనుజ్ఞ యొసఁగెను.

శత్రువు నేఱుదాటనీయక మార్గము నరికట్టవలయునను నుద్దేశము కృష్ణరాయలకు లేదు; కావున ఆదిల్ఖాను నిర్భయముగ గృష్ణనుదాటి రాయచూరు కించుక వాయవ్యమున బదునెనిమిది మైళ్ళ దూరమున నుండు గొబ్బూరు గ్రామముకడ విడిసెను.[1] అచటినుండి రాయచూరు ముందుండు కృష్ణరాయల స్కంధావారముపై దళములనంపినతనకు జయము గలుగదనియు నా దుర్గము దనచేతినుండి జాఱిపోదనియు నతఁడు తలంచెను. మొట్టమొదట తన శిబిరమును సురక్షితము జేసికొనుట మేలని యెంచి దాని చుట్టును కందకము ద్రవ్వించి కరగోడ నెత్తించి ఫిరంగుల నన్నిటిని ముంగలిభాగమున బారుదీర్పించి, దళములను దత్తదర్హస్థానముల నెలకొల్పి, శత్రువుదైకొనినపుడు కార్యము నడపవలసిన తెఱఁగును బోధించెను. మఱియు గృష్ణరాయ లొకవేళ తన యావత్సైన్యముతో గదలి వచ్చి యొక్క హుమ్మత్తున దన శిబిరముపై బడవచ్చునని యెంచి యట్టి సందర్భమున శత్రుసంహారమునకు దగిన యేర్పాటులను గావించెను; శత్రువులపై బేల్చుటకు ఫిరంగులను బాణసంచును సిద్ధము చేసియుంచెను. సాహసముజూపి హిందువుల దండు పైకొన్నప్పుడు, దనయోధులు వారిని గసిమసగుట తప్పదనియు, నంతవఱకు వేచియుండి యప్పుడు ఫిరంగుల నన్నిటి నొక్కుమ్మడి పేల్చిన వారిని రూపుమాపవచ్చుననియు దీర్మానించుకొనెను.

కాని గృష్ణరాయలు యుద్ధమునకు ఆదిల్ఖాను తలచినవిధమున దొరపిల్లలేదు. అతఁడసామాన్య ప్రతిభ గల దళనాయకుఁడు; తురకలతో బోరాటములం దారితేరిన యోధుఁడు; యుద్ధకార్యములందు చక్కని యనుభవముగలవాఁడు; ప్రణిధిబలము గల ప్రభువు. ఆదిల్ఖానుని యేర్పాటులన్నియు వేగరులమూలమున నతనికి దెలిసియుండిన నుండవచ్చును. ఎట్లయిన నేమి? అతఁడదిల్ఖాను డూహించినట్లు గాక వేఱువిధమున వ్యూహమును రచించి కయ్యమునేయ బయలువెడలెను.

కృష్ణరాయలు దన సైన్యమునంతటిని యేడు వాహినులుగ విభజించి, యందు రెంటిని యేలుగోలు బలముగ నేర్పాటుచేసి, వాని యాధిపత్యమును దనకు పిల్లనిచ్చిన మామయు, శ్రీరంగపట్టణరాజ్య

1. *Further Sources. I. 116 (a).*

పాలకుఁడును నైన కుమారవీరయ కిచ్చి, సైన్యముతో గదలిపోయిన యాదిల్ఖాను స్కంధావారమున కొక పరుగుదూరమున విడిసియుండు నట్లాజ్ఞాపించెను. తరువాత కృష్ణరాయలు దక్కిన యైదువాహినులు వెంటరా నతని వెనుకఁ గూచిచేసి పోయెను. అరుణోదయసమయమున నాయుధములను ధరించి యుద్ధమునకు సంసిద్ధముగ నుండవలసిన దని, సైనికుల కందరి కాజ్ఞఁ జేసెను. వెంటనె కొల్లలుసేయవలయునని రాయల యుద్దేశమైనను శుక్రవారమగుటవలన నాదినము కయ్యమారంభించిన మేలొడఁగూడదని యాంతరంగికులు విన్నవించుటచేత వారి వేడికో లంగీకరించి యుద్ధోద్యోగమును మానుకొనెను. ఉభయసైన్యము లొండొంటికి గడు సమీపమందు విడిసి యుండుటవలన నిరువాగులందును సైనికులెల్ల నాపగలును రాత్రి యంతయు నాయుధముల నూడ్చక జాగరూకతతో గాఁచి యుండిరి.

శనివారమునాడు ఉషఃకాలమున గృష్ణరాయల విడిదియందు రణభేరిపటహాది వాద్యములు మెలగినవి; సైనికుల కలకలము ప్రబలినది; ఆయారవమునకు బ్రాళక మిన్ను విఱిగి నెత్తిపైఁబడునట్లు తోఁచినది; దానికిదోడు హయహేషలును గజ ఘీంకారములును దిక్కుల దిక్కుటిల్లినవి. ఆ మహాసంకులారావమును వర్ణించుట కలవిగాదు. విన్నవారికే కాదు, తత్కర్తలకు సయిత మది యెంతటి భయోత్పాదకముగనుండెనో యథాతథముగ జెప్పినను నమ్ముటకు సాధ్యమనిపించదు. శత్రులును వీరికి తీసిపోలేదు; ధ్వానభరితాంతరాళములు నిండిన యా సెనుఘోషయం దెవ్వరికిని వారి నోటి నుండి వెలువడు మాటలుసయితము వినరావాయెను; సంజ్ఞలమూలమునదప్ప నొండొరులతో మాటలాడు మార్గము వేఱొక్కటియు గానరాదాయెను.

రణరంగమున కంతయును బోయి చేరునప్పటి కుదయమై జాము ప్రొద్దెక్కినది. అప్పుడు కృష్ణరాయలు తన యేలగోలు బలము రెండు వాహినులను శత్రువులపై గవిసి వారియం దొక్కనినైన జీవముతో నుండనీయక సంహరింపవలసిన దని యాజ్ఞాపించెను. రాయల యుత్తరవుప్రకారము కుమార వీరయ ఖోజాలతో శత్రుసైన్యముపై నుఱికి తలిమి నులుమాడుచు ముందునకు సాగి, వారి స్కంధావారము చుట్టునుండు కందకపు కరగోడ పైకెక్కెను. అప్పుడు తెలియవచ్చినది ఆదిల్ఖానునకు గృష్ణరాయలు దా ననుకొనినట్లు గాక వేఱు రణవిధానము నవలంబించినవాడని; తా పున నతఁడు తన మొదటియేర్పాటులను త్యజించి, రాయల

యుద్ధరంగము.



సైన్యములపై దనభటులు లటిక్కి యుద్ధముసేయుతఱి వారి మీద బ్రయోగింప నుద్యమించి యుండిన ఫిరంగులను, దన స్కంధావారమును జొచ్చుట కుంకించుచున్న ఎలగోలుఫౌజులపై ద్రిప్పి కాల్పించెను: పిడుగుల వర్షమువలె నా ఫిరంగుల యగాదు రాయల యెలగోలు మూకను విధ్వస్తలము సేయఁగడఁగినది; పెక్కేనుగులును గుఱ్ఱములును రణక్షేత్రమున బడెను; పదాతివర్గము బహుళముగ నశించెను; హతశేషులు నిలువజాలక తిరుగుడువడిరి. విఱిగి పఱచు రాయలఫౌజును జూచి, సమయము చిక్కెనని విజృంభించి తురకలు యమదూతలవలె వెన్నంటి తఱుముచు ఖండఖండములుగ నఱుకఁగడఁగిరి. పరుగుదూరము దారి పొడుగునను పీనుగల పెంటయాయెను.

కృష్ణరాయలు పాఱివచ్చుచున్న తన సైనికులను గని క్రోధదందహ్యమానచిత్తుడై 'స్వామిద్రోహులార! ఏల పఱతెంచెదరు? పఱతెంచి వచ్చినచోట లేదా మృత్యువు? పుట్టినవారు గిట్టక తప్పదు. అపకీర్తిపాలై పేరు ప్రఖ్యాతులను దగులబెట్టి మను అస్వజీవనము కంటె వీరోచితమైనరణశయ్యయే మేలుగాదో? మాకు బాసటయై నిలువజాలిన యోధు లెవ్వరును లేరా?' యని యుద్ఘోషించెను. రాయలవారి నోటినుండి యామాటలు వెలువడెనో లేదో, తక్షణమె దొరలును దళవాయకులును కొమరులును పెక్కండ్రాతనిచుట్టును మూగి 'మహాప్రభో! మా యొడలు యేలినవారివి! పని గొనుడు', అని విన్నపము జేసిరి. రాయలవారు మరల నిట్లు పల్కిరి: 'లోకములోని భూపాలురకెల్ల నధికుడగు మేటిని జంపితినని యాదిల్షాను డుబ్బులాడు కాల మాసన్నమైననుగాక! అతని పరాభూతుని గావించితినని ప్రేలుటకెన్నడును అవసరము గలుగబోదు. అని తన వ్రేలినుండి ముద్రుటుంగరమును దీసి యొక యూడిగీని చేతికిచ్చి తనకు వీరస్వర్గప్రాప్తి కలిగిన దానిని రాణివాసములకు జూపవలయుననియు, నంతట వారు కులాచారము ప్రకారము సహగమన కార్యము నడుపుదురనియు నానతిచ్చి, గుఱ్ఱము నెక్కి, శత్రువుల నెదుర్కొనజాలక పఱతెంచివచ్చువారియం దొక్కనినైన విడువక దయాదాక్షిణ్యములను మఱచి సంహరింపవలసినదని యుత్తరవిచ్చి, తక్కిన రైదు వాహినులు వెంటరా రణభూమికి దరలెను. పలాయితులై వచ్చుచుండినవారు తమవారిచే దమ కెట్టి మర్యాద జరుగునో గ్రహించి వెనుదిరిగి దుస్సహ పరాక్రమముతో శత్రులను మార్కొని చించి చెండాడఁగడఁగిరి. వారి ప్రతాపమునకోర్చి యభిముఖులై నిల్చి యుద్ధము సేయఁగల తురక యొక్కడేనియుఁ గానరాడాయె. ఏలనఁగా దురకలు జయము తమకె చేకూడెననియెంచి యుద్ధక్రమము ననుసరింపక బారులువీడి యెవ్వరి కను కూలపడినట్లు వారు శత్రుల దఱుముకొని వచ్చుచుండిరి. హఠాత్తుగ హిందువు లెదురుతిరిగి వ్యూహక్రమము ననుసరించి పోటుచూపగా వారియెదుట నిలిచి సరిపోరుటకు తురకలకు శక్తిలేకపోయెను. ఇందుమూలమున మహమ్మదీయసైన్యము కలగుండువడినది. వారి ఫౌజసంఖ్యాతముగ మడిసినది. మిక్కిలి శ్రమపడి బలపఱచిన నిజస్కంధావారమును సయితము సంరక్షించుకొనవలయునను బుద్ధికూడ వారికి పుట్టదాయెను.

ఈ సందర్భమున సలాబత్ఖాను వృత్తాంతము చెప్పక తప్పదు. ఇతఁడు ఇస్మాయీలు ఆదిల్ ఖానుని యొక్క సర్వసేనాధిపతి; విజాపురసుల్తాను కొలువు నందుండిన పోర్చుగీసుభటులలో నైదువందలమంది చేర్చి తన కంగరక్షకుల జేసికొని యుండెను. నొబ్బారు రణక్షేత్రమున దురకసైన్య మోడి బీభత్సముగుటను గని మఱల దాని నేకముఖమునకు దెచ్చి శత్రులపైఁ గవియింపఁదలపెట్టెను; కాని యతనికది నిష్ఫల మాయెను. మహమ్మదీయ సైనికుల కెవ్వరికిని నిజప్రాణ సంరక్షణ యొక్క తిరిప్ప యన్యచింత లేకపోవుటచే నాతనిమాటల నెవ్వరును చెవిబెట్టరైరి. శత్రువులచే బట్టువడుటకంటె మరణమే మేలనియెంచి తన పోర్చుగీసు సంగరక్షక బలముతో గూడ రాయరాణువపైబడి, తన్నుదన యంగరక్షకులను శత్రులు జిరకాలము స్మరించి భయముజెందున ట్లద్భుతఘటిత వీరవిహారము సల్పెను. అతని పరాక్రమమున కోర్వజాలక యాతని నెదుర్కొన సయితమెల్లవారును వెఱచి దారి విడిచిరి. మొగ్గరము జీల్చుకొని లోఁ బ్రవేశించి రాయల యంగరక్షక బల సమీపమునకు బోయి చేరెను; అతఁడెక్కి పోవుచున్న గుఱ్ఱము విగతప్రాణమై నేలగూల నతఁడు పాదచారియాయెను; శత్రువులచే బడనీయక యతని సంరక్షించుటకొఱకతని పోర్చుగీసుభటులు రాయరాణువను పాయవడ నఱకుచుబోయి యాతని వేఱొకగుఱ్ఱముపై నెక్కించిరి. వారు పోయినమార్గమును గ్రమ్ముకొన గూడ నెవ్వరికిని ధైర్యము చాలదాయె. సలాబత్ఖాను డంతట గొఱ్ఱెలమందఁ జొచ్చిన తోడేలువలె మఱల విజృంభించెను; కాని యెంతకాల మట్లు పోరగలడు? శత్రుసమాక్రాంతుఁడై, కాయమెల్ల గాయమయమై గావిలి యుండ నిలుపోప నెట్లు సాధ్యమగును? తుదకు సలాబత్ఖానుఁడు వాహనముతోకూడ కుప్పఁగూలెను. అతని

ములల సంరక్షించుటకు పోర్చుగీసులు ప్రయత్నము చేసిరి; కాని యొక్కడైన వతిని చెంత చేరజాలక వల కుంకుకడి నిశ్శేషముగ నందఱు సమసిపోయిరి. క్షతగాత్రుండై సలాబత్ఖానుండు శత్రులచేఁ బట్టువడెను.

సలాబత్ఖానుఁ డొక్కఁడుఁ దక్క శత్రు సంరంభమును నిల్వరించుటకు తొడరిన సర్దారు వేఱొకఁ డాదిల్ఖానుని సైన్యమున లేడు. తక్కిన దొరలును మూఁకలును ప్రాణభీతిచే యథాయథలై పాఱఁ జొచ్చిరి; కృష్ణాస్రవంతి యం దుఱికి యవ్వలిదరి నెట్లయిన చేర సమకట్టిరి; కాని వారిని వెన్నంటి తఱుముచు వచ్చిన రాయదళము వారిని బోనీక పొదువుకొని చంపఁగడఁగెను. అందు ముఖ్యముగ నేనుఁగులు నదిలోనికి దిగి నీట నీదుచుండిన వారిని తొండములఁ గబళించి తునిమి తూఁటాడఁ దొడఁగినవి. హౌడాలు లందుండు యోధులు నిజహేతిప్రహారములచే వసేపులఁ దుద ముట్టించుచుండిరి. కృష్ణరాయలప్పుడు నదియొడ్డు జేరి తేఱి చూచెను; దృశ్యము మహాఘోరమై కన్పట్టినది. ఎటు చూచినను మృత్యువు తాండవమాడుచుండెను; స్కంధావారమునుండి బిడ్డలతోఁ బరారియగుచుండిన యువతీజనమొక ప్రక్కను, నదీప్రవాహము గాఢముగుటచే దప్పించుకొని పోఁజాలక వాహనములే శరణ్యములుగ దేలియాడు వాహ్యకసందోహ మొక ప్రక్కను, గట్టెక్క గమకించి పట్టుదప్పి రాహుత్తులతోఁ గూడ బిల్లపాటుగ నీటఁగూలి మడియు గుఱ్ఱము లొక ప్రక్కను, క్రమపడి పై కెగప్రాకి తిలదూపిన శత్రుల నటులనె రూపుమాపు రాయ సైనికులును, నీటనుండు వారిని నీటమునిగించు గజఘటలును వెల్లడియెడల బొడకట్టెను. ఈ దృశ్యమును గాంచినంతటనె రాయలవారి హృదయమున జాలిపుట్టినది. 'నిరపరాధులగు వీరెట్లు వధార్హులగుదురు? వీరి తప్పేమి?' యని చింతించి ధర్మదారఁ బట్టుట కాజ్ఞాపించెను; ధర్మదార బట్టినంతటనె దళవాయులెల్ల యుద్ధకర్మము చాలించి దళములను మరల్చిరి.

ఈ మహాసంగ్రామమునందు ఇస్మాయిలాదిల్ఖానుఁ డేమి చేసెనో విచారింతము. ఆతఁడు యుద్ధభూమిని ప్రవేశింప నేలేదని చెప్పుచున్నాఁడు నూనిజు. యుద్ధసమయమున నతఁడు తిరువాత అసాద్ఖానుని బిరుదు వహించిన — సుఫోలారిక్ చే సంరక్షితుఁడై యుండెను. ఈ సుఫోలారిక్ కుట్రసేయుట యందు సాటిలేని ప్రజ్ఞావంతుఁడు; తన్నును దన పరివారమును ఆదిల్ఖానుఁడు తన కంగరక్షకులుగ నియమించునట్లు పన్నుగడ పన్నెను. యుద్ధమునందు ఆదిల్ఖాని ఫౌజు సంపూర్ణ పరాజయమును బొంది విఱిగిపాఱుతెంచు విధమునుఁ గని యతఁడు, 'మహాప్రభో! అవధారు! తమకు జీవముపై వాంఛయుండిన నావెంట విజయము చేకూఁడు' అని యాదిల్ఖానునితో విన్నపము చేసెను. అంతట నాదిల్ఖానుఁ డేనుగునెక్కి శిబిరమును నందలి సర్వమును త్యజించి, సుఫోలారిక్ సలహాప్రకారము నదిని దాటక దాని దక్షిణ తటమునందుండు కొండలవరుసను బట్టి నిజరాజ్యమునకు బోయి చేరెను.

కృష్ణరాయలు యవన స్కంధావారమును ప్రవేశించి యాదిల్ఖానుని శిబిరమందు విశ్రమించెను[1]. దండనాయకుల కిది రాయలవారట్లు విశ్రమించుట సరియని తోఁచలేదు. కావున, వారు 'గెలిచిన వారిట విశ్రమించుట యుక్తము గాదు; శత్రుశేష ముండరాదు. దేవరవారు స్వయముగ శత్రుసంహార కార్యమునకు బూనుకొనవలసిన యావశ్యకత లేదు. ఆజ్ఞయైన మేమా కార్యము నస్తమయమునకు ముందె ముగించి రాగల'మని విన్నవించిరి. రాయలవా రందుకు సమ్మతింపరైరి. 'నిరపరాధులనేకులు సమసిరి; ఆదిల్ఖానుఁడు వాదోపి చేసిన తప్పునకు దగిన శాస్తియైనది. మఱియు, మన బింగల రాయచూరు మన కింకను స్వాధీనము కాలేదు; కావున కూఁచిశేవి ముందుకు నడచుటకు పూర్వము దానిని సాధించుట యవసర'మని చెప్పి యాదిల్ఖానుని స్కంధావారమున నుండు మాల నంతటిని బరిశీలించుట కాజ్ఞయొసఁగెను. మృతినొందిన వారిలో నాదిల్ఖాను సంస్థానపు మొదటి వరుస దొరలు

---

1. కృష్ణానదిని దాటి కృష్ణరాయ లాదిల్ఖానుని పాళెమును ప్రవేశించెనని నూనిజు వ్రాసినాడు. *'The Raya then crossed the river and seized the Shaha's camp.' (Forgotten Empire. p. 139.)* ఇది ప్రమాద జనితము. నూనిజ చరిత్రయందు దీని కాధార మేమియు లేదు. ఆదిల్ ఖానుఁడు కృష్ణకవ్వలి యొడ్డున తొలుదొల్త పాళెము డిగినది వాస్తవమే; కాని దాని త్యజించి కృష్ణను దాటివచ్చి గొబ్బూరు కడ శిబిరము నెత్తించి వాని చుట్టును కందకమును గరగోడను నిర్మించుకొని యుండెను. ఈ శిబిరముకడనె యుద్ధకార్యమంతయు నడచినది. కావున కృష్ణరాయ లాదిల్ఖానుని శిబిరమునకు బోవుటకు కృష్ణను దాటవలసిన యావశ్యకత లేదు.

పెక్కండ్రుండిరి; ఏవురు మహాదండనాయకులు జీవగ్రాహముగ బట్టుబడిరి. పై జెప్పిన సలాబత్ ఖానుడు వారియందు ప్రముఖుఁడు; నాలుగు వేలు గుఱ్ఱములును, నూఱు మదహస్తులను, నన్నూఱు గొప్ప ఫిరంగులను, పెక్కు చిన్న ఫిరంగులును, తోపు మ్రోతల ఫిరంగిబండ్లును, బహువిధములగు డేరాములును హస్తగతము లాయెను; ఇదిగాక యసంఖ్యాతి భారవాహక వృషభాది జంతువర్గమును, పరిచార పరిచారికా సమూహమును పట్టుబడెను. రాయలవారి యాజ్ఞచే స్త్రీల నేకులు బంధవిముక్తలై తమ నెలవులకుబోయి చేరిరి. రణస్థలిబడిన స్వపక్షమువారు పదునాఱువేల కధిక సంఖ్యగల యోధుల కెల్ల దహనాది క్రియలు ముగియవలసి యుండెను, వారికి బ్రాహ్మణులకు కావలసిన దాన ధర్మముల గావించి, యటుపిమ్మట రాయచూరికి మరలిపోయి యథాపూర్వము ముట్టడివేసెను[1].

ఇది న్యూనిజ్ చేసిన గొబ్బూరు యుద్ధవర్ణన క్రమము.

ఫెరిస్తా ఈ యుద్ధము నింకొకతీరున వర్ణించియున్నాఁడు. హిజిరీ ౯౨౭ (క్రీ. శ. ౧౫౨౦) వ సం॥ న ఇస్మాయీలు ఆదిల్ షాహు విజయనగర రాయలకడ నుండి ముద్గల రాయచూరు దుర్గములను మరల స్వాధీనపఱచుకొన నెంచి దండయాత్ర సన్నాహముల గావించెను. ఆ సంగతి తెలిసి యతఁడు ప్రచండసైన్యముతో వచ్చి కృష్ణానదీతీరమున విడిసెను; సామంతు లనేకు లటకేవచ్చి యతనిగూడిరి; అందువలన నతని క్రింద నేబది వేల గుఱ్ఱములును గొప్ప కాల్బలమును యుద్ధమునకు సిద్ధముగ నుండెను. మఱియు నతఁడు కృష్ణానదిని దాటు రేవుల నన్నిటిని స్వాధీనపఱచుకొని వాని గాపుదల చేయుటకు బలిష్ఠములగు దళముల నియమించెను. ఆదిల్ షాహు అంతట దన యుద్యమమును విరమించుకొనిన బాగుగ నుండెడిది; కాని యప్పటికే సలి సుడారములను వేయించి యుండుటవలన వెనుదీయుట నిజప్రతిష్ఠకు భంగకరమని యెంచి యేడు వేల గరీబు గుఱ్ఱపుదళముతో బయలుదేరిపోయి హిందువుల పాళెమున కెదుట కృష్ణ యవ్వలిగట్టున డేరా లెత్తించి, నదిని దాటుటకు దోనెలను జేసి ముగియుటకు నదట వేచియుండెను. పాళెముడిగిన తరువాత నొకరోజున ఆదిల్ షాహు శిబిరమున విశ్రమించియుండగా దిజకు వెలుపల నతని సహచరులలో నొక్కఁడు,

‘సంతసపు మధువుతో నింపు బంగరుగిన్నె
మధు పిపాసితుఁ దుర్వ్యథుంట గలయాకమున్నె’

యను గీతమును బాడుటను వినెను. అతని కంఠటమునకు పిపాస హెచ్చఁగా నవుకులను బిలువనంపి వారితో గూడ భోగస్తరణముపై వాసీనుఁడై మధువానుచు పాటపాటలయందు నిమగ్నుఁడై యుండెను. ఈ మధుపాన క్రీడావిలాసమునందే గా నాదిల్ షాహునకు గైపెక్కి యప్పుడే నదిని దాటిపోయి శత్రుసైన్యముపై బడవలయునను యిచ్ఛ ప్రబలెను. తక్షణమె దళనాయకులను బిలువనంపి దోనెలను తెయ్యారుసేయుట కంతటి యాలస్య మేల కల్గెనో విచారించెను. నాఁటికి దోనె లప్పటికి సిద్ధమూయనవియు, దక్కినవి కొద్దిరోజులలో నే తెయ్యారు కాఁగలవనియు వారు జవాబు చెప్పిరి. హోలాహాలోన్మత్తుఁడై యాదిల్ షాహు వెంటనె నదిని దాటుటకు నిశ్చయించి, తన యుద్దేశము నెవ్వరికిం జెప్పక యేనుఁగు నెక్కి శత్రుస్థితిని పరీక్షించుటకొఱకు బోవునట్లు బయలువడెను; ఉన్నట్లుండి సిద్ధమైయుండు పడవలు పట్టు నంతయు సైనికులు పడవలపై దాటవలసినదనియు, దక్కినవారు యేనుఁగుల నెక్కి రావలయుననియు నాజ్ఞాపించెను; తొందరపడి సాహసము జేసిన కార్యము చెడునని దళనాయకులు విన్నవించిరి; కాని యాదిల్ షాహు మాఱుపల్కక తన యేనుఁగును నదిలోనికి దోలెను; చేయునది లేక దళములతోగూడ దళపతులు రెండు వందల యేబది యేనుఁగులపై దాటి యవ్వలి యొడ్డును జేరిరి. అదృష్టవశమున పడవలన్నియు రెండు పర్యాయములు సైనికుల నెక్కించుకొని దాటించువఱకును హిందువులు వారిని దారసిల్లలేదు. కాని వారి సేన యత్యంతము బలిష్ఠమైనది; సుల్తానునకు జయము చేకూరునను వాశకుగూడ నవకాశము లేదు. అతని రెండు వేల భటులను వారు ముప్పది వేలతో ఢీకొనిరి. మహమ్మదీయ వీరులేక చిత్తము చేసుద్బోధితులైనట్లు అత్యంతాటోపముతో వారిపైబడి, విజయనగర సర్వసేనాధిపతి సంగతిరాయలు మున్నగు సహస్రాధిక సంఖ్యాకులను రూపుమాపిరి; కాని ఫిరంగులు తుపాకులు బాణసంచు మున్నగు నాగ్నేయాయుధ ప్రయోగమువలన మహమ్మదీయ బలమునం దర్ధభాగమును విద్వేషులు హతము గావించిరి. హతశేషులు బ్రతుకు జీవుఁడా యని నదీప్రవాహమున మఱికి తప్పించుకొనజూచిరి. సుల్తానుతో గూడనదేయుం బారిలో గూర్చుండియుండిన తిమ్మాన్ బహాదూరను ఇబ్రాహీమ్ బేగను ఏనుగును నది కడ్డముగ దోలాడి యవ్వలి గట్టువైపు పఱచిరి; ఆ యేనుఁగయు మఱి

1. *Forgotten Empire pp.* 334-343.

యేఱును దప్ప తక్కిన వన్నియు ప్రవాహవేగము నకు నిలువోపక నీటబడి నశించినవి. వేగిరపాటు నకు సుల్తానుకు దగిన శిక్షయాయెను; పరాజయము వలన దన కాపాదించిన యపయశమును బోగొట్టు కొనుటకుగాను మరల మద్యపేత జేయవని యత డొట్టుపెట్టుకొనెను; ఆ యవమానము బాపుకొని తన కీర్తిని నిష్కళంకము జేసికొనుట కతఁడు యావచ్ఛక్తిని వినియోగింప గడగెను.

ఈ యుద్ధరంగమున మీర్జా జహాంగీరు నిహతుఁడైన కారణమున, ఆదిల్ శాహునకు కలిగిన పరాజయమునకు ప్రతీకారముగ సేయదగిన కార్యమెద్దియో తెలుపవలయునని యసాదఖాను నడిగెను. తనకు గలిగిన నష్టముపారమనియు సైన్య ముత్సాహరహితమై యున్నదనియు, దత్కారణమున విజాపురమున కప్పుడు మరలిపోవుటయె యుక్తమనియు నతఁడు విన్నవించెను. అతని సలహో సమంజసమని యంగీకరించి సుల్తాను కృష్ణాతటము నుండి తిరలిపోయెను.1

న్యూనిజు ఫెరిస్తాల వృత్తాంతములు రెండును నొక్క యుద్ధమునొక్క వర్ణనలే. కాని వాని నొండొంటితో బోల్చిచూడగా ముఖ్యాంశములు మూటియందు తప్ప వాని కైకాభిప్రాయము గానరాదు; ఈ ముఖ్యాంశములు మూడును ఇవి: (1) ఆదిల్ ఖాను విజయనగర రాయలతో యుద్ధము సల్పుటకొఱకు సైన్యములతో గూడ కృష్ణానదిని దాటివచ్చెను (2) అతడుయుద్ధమునందు పరాజితుడై కృష్ణను మరలదాటి తన దేశమునకు బాఱిపోయెను; అట్లు వెనుదిరిగి పోవునప్పు డతని సైనికు లనేకులు కృష్ణా ప్రవాహమున బడి మునిగి చచ్చిరి. మఱియు (3) యుద్ధానంతరము సుల్తాను అసాదుఖానుని సలహో ప్రకారము ప్రవర్తించెనని ఇరువురును వ్రాసియున్నారు. కావున వారు వర్ణించిన యుద్ధమొక్కటియే యని మనము తీర్మానింపవచ్చును. ఈ మూడంశములు విడిచిన తక్కిన యుద్ధవృత్తాంతము నంతటిని న్యూనిజు ఫెరిస్తాలు చెఱియొక విధమున వర్ణించియున్నారు.

యుద్ధము జరిగినది క్రీ. శ. ౧౫౨౨ మే నెలలో నమావాస్య శనివారమునాడని న్యూనిజు వక్కాణించి నాఁడు;2 హిజరీ ౯౨౬ (డిసెంబరు ౧౨, క్రీ.శ.౧౫౨౦ మొదలు డిసెంబరు. ౧. క్రీ శ. ౧౫౨౧ వఱకు) అని ఫెరిస్తా చరిత్రయందున్నది.3 వీ రిద్దఱును జెప్పిన కాలము తప్పనియు, న్యూనిజు ప్రమాదవశమున '౧౫౨౦'కి బదులు '౧౫౨౨' అని వ్రాసెననియు, ఫెరిస్తా పొరపాటున నొకయేడధికముగ వేసెననియు, వాస్తవముగ యుద్ధము జరిగినది క్రీ. శ. ౧౫౨౦ మే నెల ౧౯ వ తేది యమావాస్య శనివారమునాడని సూయలు నిర్ణయించియున్నాడు.4 సూయలు చేసిన కాలనిర్ణయమే సరియైనదని ఋజువుసేయగల శాసన సాక్ష్యము కొంతకలదు. మాధవ వర్మ వంశజుఁడు క్రీ. శ. 1522 వ సంవత్సరమునకో యించుక తరువాతనో బెజవాడ కనక దుర్గాలయమున వ్రాయించిన శాసనములో 'అధి కృష్ణవర్ణమధి శ్రావణ సంధి రాయూరు జగదేక నాథస్య వరాలయేన సహవాటికా' యని యున్నది.5 ఇందువలన పై సింగరాజు వృష వర్ష శ్రావణమాసము నందనఁగా క్రీ. శ. ౧౫౨౧ జూలై మాసమున రాయచూరునందు రంగనాథస్వామికి దేవాలయమును గట్టించి దాని కొక వాటికను దానము చేసినట్లు తెల్లమగుచున్నది. తత్పూర్వమే రాయచూరు కృష్ణరాయలకు స్వాధీనము గాకయుండిన, నతని సామంతులయం దొక్కని కప్పు డచట దేవాలయమును నిర్మించుటకు సాధ్యమైయుండదు. వృష సంవత్సరమునం దాపస్తంబయుఁడు వ్రాయించిన శాసనమునగూడ రాయచూరు విజయము దత్పూర్వమె చేకుఱినట్లు తెలియవచ్చుచున్నది.6 కావున న్యూనిజు ఫెరిస్తా లిద్దరును చెప్పిన యుద్ధకాలములు విశ్వాసపాత్రములు గావని దృఢమగుచున్నది.

కృష్ణరాయల దండయాత్ర కాలమునందు రాయచూ రాదిల్ ఖానుని స్వాధీనమున నుండెననియు దానికి గృష్ణరాయలుముట్టడివేసిజయించి కైవసముజేసి కొనెననియు న్యూనిజు చరిత్రవలన దెలియుచున్నది. దీనికి విరుద్ధముగ ఫెరిస్తా యప్పుడు రాయచూరు ముద్గలు దుర్గములు రెండును నప్పుడు రాయలకు జెల్లుచుండెననియు, వాని జయించి స్వాధీనము జేసికొనవలయునని యాదిల్ శాహు దండెత్తిరాగా రాయ లాతని గృష్ణ యొద్దున యుద్ధమున నోడించి తఱుముకొనెననియు ఫెరిస్తా పల్కుచున్నాడు. వీరి యం. దెవ్వరు చెప్పునది సత్యమో కనుగొనవలసి యున్నది.

1. *Briggs Ferishta, III pp* 48-51.

2. *Nuniz, Forgotten Empire, pp.* 326, 337.

3. *Briggs Ferishta, III. p.* 48.

4. *Forgotten Empire, pp.* 140-147.

5. *SII. IV.* 789. *ll.* 110-13.

6. *ARE.* 47 *of* 1906.

క్రీ. శ. ౧౫౧౨ లో విజయనగర రాయలు ఆదిల్ఖానుని జయించి రాయచూరును స్వాధీనపఱచుకొనెనని ఫెరిస్తా చెప్పియున్నాడు. సమకాలికుఁడును కృష్ణదేవరాయల రాయచూరు దండయాత్రయందు రాయల శిబిరమున వసింపుచు యుద్ధమును ప్రత్యక్షముగ జూచిన న్యూనిజా అప్పుడు రాయచూరు ఆదిల్ ఖానునికి జెల్లుచుండెననియు వానిని నోడించి యా దుర్గమును కృష్ణరాయలు సాధించెననియు జెప్పియుండుటచేత క్రీ. శ. ౧౫౧౨-౧౫౨౦ ల మధ్య ప్రాయశః ౧౫౧౬-౧౭ ప్రాంతమున నా దిల్ఖానుఁడు కృష్ణరాయల కడనుండి రాయచూరును మరల స్వాధీనపఱచుకొని యుండునని పూర్వ ప్రకరణమునం దొకచోట నూహ చేసియున్నాఁడను. ఈ యూహ తప్పుకాదని శాసనసాక్ష్యమువలన నిశ్చయమగుచున్నది. సర్-ఇ-షుహూరు ౯౧౭ ( = హిజిరి ౯౨౧ = క్రీ. శ. ౧౫౧౫-౧౬) సం॥ న వ్రాయించినవి ఇస్మాయీలు ఆదిల్ఖానునివి రెండు అరబీ శాసనములు హైదరాబాదు మ్యూసియములో నున్నవి. ఇవి మొదట రాయచూరు దుర్గమునందుండినవి; హైదరాబాదు మ్యూసియమును నిర్మించినపుడు గులాం యాజ్దానీగారు వాని నచ్చటికి దెప్పించి భద్రపఱచిరి. బహమనీ సుల్తాను మహమ్మదు షాహ కుమారుఁడు మహమూదు షాహ రాజ్యము సేయుచుండగా, ఖాన్-అల్-ఆక్రమ్ మజ్లిస్-అర్-రఫీ ఆదిల్ ఖాన్ అల్-ఘాజీ కుమారుడు ఆదిల్ ఖానుఁడు ముఖ్య ప్రధానిగనుండ, షేఖ్ బుర్హానద్దీన్ - అల్-కిర్మాని పుత్రుఁడు మల్లిక్-అల్-ముకఱ్ఱమ్ షైఖ్ నిజాముద్దీన్ అహమదు రాయచూరు దుర్గమును పాలించుచుండ, హుసేన్ ఇబ్రాహిమ్ మస్త్రీ తనయుఁడు అల్-అమీర్ రమజానను నతఁడు మసీదును కట్టించి నట్లొక దానియందును, నా సంవత్సరమునందె పైఁ జేర్కొనిన బహమనీ సుల్తాను మహమ్మదు షాహ కుమారుఁడు మహమూదు షాహయు, ఆదిల్ ఖానుని కుమారుఁడు ఆదిల్ ఖానును, మల్లిక్-అల్-ముకఱ్ఱమ్ నిజాముద్దీన్ అహమద్-అల్-కిర్మాని యును పైఁది శాసనమున జెప్పినరీతిని అధికారము నిర్వహించుచుండ నున్నతమగు బుర్జ్-అల్-ఫతిహ (అనఁగా విజయబురుజు) కట్టబడెనని మఱియొక దానియందును వ్రాసియున్నది.1 ఈ రెండు శాసనములును క్రీ. శ. ౧౫౧౫-౧౬ వ సంవత్సరమున రాయచూరు దుర్గము ఇస్మాయీలు ఆదిల్ఖానుని యేలుబడి క్రింద నుండెననియు నిజాముద్దీన్ అహమద్-అల్-కిర్మాని యతని పక్షమున దుర్గాధ్యక్షుఁడై యుండెననియు దెల్లముసేయుచున్నవి. మసీదును, విజయనామాంకితమగు బురుజును ఏకకాలమున నిర్మించుటను జూడ రాయచూరు నా సంవత్సరమందె యాదిల్ఖానుఁడు సాధించియుండునని తోఁచుచున్నది. కావున కృష్ణరాయల దండయాత్రకాలమున రాయచూరు రాయలయధీనమున నుండెనని ఫెరిస్తా చెప్పినది యబద్ధమనియు, న్యూనిజా వచించి నట్లది యాదిల్ఖానుని వశమునందె యుండెననుట వాస్తవమనియు దేలుచున్నది.

ఇర్లె యుభయపక్ష బలముల సంఖ్యను గూర్చియు న్యూనిజా ఫెరిస్తాల వృత్తాంతములందు భేదము గానవచ్చుచున్నది. న్యూనిజా లెక్క ప్రకారము రాయలు ఏడులక్షల ముప్పదివేల పదాతులును, ముప్పది రెండువేల యాఱునూరు గుఱ్ఱములును, ఐదునూరు యేబది గజములును గల మహాసైన్యముతో రాయచూరును సాధించుటకు బయలుదేరినట్లు తెలియుచున్నది. ఇదంతయు గాకపోయిన జాలభాగసేనియు గొబ్బూరు యుద్ధమున పాల్గొనియుండు నను టకు సందియము లేదు. ఈ మహాసైన్యము నెదుర్కొనుట కాదిల్ఖానుఁడు లక్ష యిరువది వేల పదాతులను, పదునెనిమిది వేల గుఱ్ఱములను, నూటయేబది యేనుగులను, రెండునూరులకు మించిన ఫిరంగులను వెంటగొని యుద్ధరంగమునకు వచ్చెను. ఫెరిస్తా లెక్క ప్రకారము రాయల సైన్యమునం దేబదివేల గుఱ్ఱములును, విస్తారమైన కాల్బలమును, ఫిరంగి తుపాకి బాణసంచు మొదలగు నాగ్నేయాయుధములును నుండినవి; ఈసైన్యము నెదుర్కొనుట కాదిల్ శాహు యేడువేల గరీబు గుఱ్ఱములతో గదలివచ్చెను; కాని రెండు వేలతోడనె కృష్ణానదిని దాటి రాయచూరులో డీకొనెను.

వీ రిరువురిలో నెవ్వరి లెక్క సరియైనదో నిర్ధారించి చెప్పుటకు వలనుపడదు. కాని రాయరాణువ సంఖ్యాబలము రాయవాచకమందు వివరింపఁబడియున్నది. రాయరాణువయందు కైజీతంవారనియు నమరనాయక బలమనియు రెండు వగలవిశేషములుండెను: కైజీతపు ఫౌజులో లక్ష కాల్బలమును, పండ్రెండువేల గుఱ్ఱమును, ఐదునూరు యేనుగులు నుండినవి; అమరనాయక బలమునందు నిరువదిలక్షల పదాతులును, నిరువదినాల్గువేల గుఱ్ఱములును, పండ్రెండునూరు యేనుగులును నుండినవి. కైజీత పదముగాని

10. *Khwaja Muhammad Ahmad. Inscriptions of Raichur in the Hyderabad Museum*, pp 14-16.

యమరశాయక దళముగాని మొత్తమువిూద రాయ
రాణువయందు మూడులక్షల కాల్బలమును, ముప్పది
యాఱు వేల గుఱ్ఱమును, వేయి యేడునూఱు యేనుగులును
నుండెను. ఇది నగరిలెక్క. దీనితో పోల్చి చూచిన
న్యూనిజు లెక్కయందు నాలుగులక్షల కాల్బల మధి
కముగను, పదునొకండువందల యేబదియేనుగులును
ఇరువదినాల్గువందల గుఱ్ఱములును దక్కువగనున్నవి.
వాస్తవ సంఖ్యను నిర్ణయించుటకు వీలులేకున్నను
రాయలు రాయచూరు దండయాత్రకు కొన్ని లక్షల
సైన్యముతో బయలువెడలెనని యనుకొనవచ్చును.

అదిల్షాహు బలము ఫెరిస్తా చెప్పునంతటి స్వల్ప
మైనది కాదు. ఏబది వేల గుఱ్ఱమును విస్తారమైన కాల్బల
మునుగొని రాయలు యుద్ధమునకు బయలువెడలి
వచ్చినాడని వినియు నాదిల్‌శాహు యేడు వేలతో
నాతని నెదుర్కొనవచ్చినాడనియు, నందు చాలభాగ
ము గృష్ణ కవ్వలియొడ్డుననె నిల్పి రెండు వేలతో
నదినిదాటి యుద్ధమునకు గడగెననియు జెప్పు ఫెరిస్తా
వాక్యములు నమ్మదగినవి కావు. ఈ రెండు
వేలును యుద్ధమునను కృష్ణాప్రవాహమునను సంపూ
ర్ణముగ నశించిపోయెనని యొప్పుకొనినను, మిగిలిన
యైదు వేలును యుద్ధమున బాల్గొనక, వచ్చినవారు వచ్చి
నట్లు వెనుకకు మఱలక యుండిరికదా. ఇంతబలము
యుద్ధమునకు సిద్ధమై యుండ నసాదుఖానుఁడు దనకు
గలిగిన నష్ట మపారమైనదనియు; దత్కారణమున
సైనికు లుత్సాహహీనులై యుండిరనియు నప్పటికి
వెనుదిరిగి బిజాపురమునకు బోవుటయె శ్రేయస్కర
మనియు, నహమదునగరపాలకుఁడైన బూర్హాను నిజాము
శాహుతో సఖ్యము గావించుకొని యవ్వల రాయలపై
గసితీర్చుకొనవచ్చుననియు జెప్పుట వింత. అతని సలహా
చక్కనిదని యంగీకరించి యాదిల్‌శాహు నిజరాజ
ధానికి దిరిగిపోవుట యంతకంటె వింత.

చక్కఁగ విచారించి చూడఁగ న్యూనిజు ఫెరి
స్తాలకు గల భేదములకు ముఖ్యకారణములు రెండు
గానవచ్చుచున్నవి. న్యూనిజు కృష్ణరాయల కాలమున
వచ్చుచు బోవుచుండిన సమకాల రచయిత; రాయ
చూరు దండయాత్రయందు రాయల శిబిరమునుండి
యుద్ధకార్యమును గన్నులారజూచిన ప్రత్యక్షద్రష్ట.
ఫెరిస్తా తరువాత ఎనుబది తొంబదియేండ్లు గడచిన వెనుక
బిజాపురమునందు చరిత్ర రచన గావించిన యర్వా
చీనుఁడు. ఫెరిస్తాకు విజయనగర చరిత్ర తెలియదు;
తెలిసికొనవలయునని యతఁడు ప్రయత్నము సల్పిన
ట్లగపడదు; కావున నతఁడు బహమనీసుల్తానుల చరి
త్రయు వారి యధికారమునకు వారసులైన దక్కను
పంచపాదుశాహుల వృత్తాంతమును వివరించు
నప్పుడు విజయనగర విషయములను బ్రస్తావింపవలసి
వచ్చినప్పుడు కుంతీ పుత్రో వినాయకః యను
న్యాయమునను సరించి తన ప్రతిభకొలది గాథల ననేక
ములను గల్పించినాఁడు. 1

విజయనగర చరిత్రాధ్యాపకుల కిదియంతయు
నాకాశపురాణమని వివరించి చెప్పవలసిన యావశ్య
కత లేదు.

అజ్ఞానముతో పాటు జాతిమతాభిమానము లతని
దప్పుదారుల కీడ్చినవి. మహమ్మదీయుల పరువుప్రతి
ష్ఠలను గాపాడవలయుననియు, దన కాశ్రయ మొసగిన
యాదిల్‌శాహు పూర్వికుల కీర్తిప్రతాపములు నిష్క

---

1. ఒక యుదాహరణముఁ జాలును అతని
యజ్ఞానమును గల్పనానైపుణ్యమును వెల్లడిసేయు
టకు. క్రీ. శ. ౧౫-వ శతాబ్దోత్తరార్ధమున శివరాయలను
నతఁడు విజయనగరమును బాలించుచుండెను; అంతకు
పూర్వ మతని పెద్దలచట నేఁడువందల సంవత్సరముల
నుండియు రాజ్యము సేయుచుండిరి. అతని కిద్దఱు
పుత్రులుండిరి; అందు పెద్దవాఁడు తండ్రి పిదప సింహా
సనము నధిష్ఠించెను; కాని యతనిని మంత్రియగు తిమ్మ
రాజు విషప్రయోగముచే జంపె — మఱియొక
చోట నతఁడు యుద్ధమున గాయపడి చచ్చెనని చెప్పి
నాడు— అతనితమ్ముని దన చేతి జంత్రపు బొమ్మవలె
నాడింపుచు, గొంతకాలమైన పిమ్మట సింహాసనము
నాక్రమించుకొనెను. మఱియొకచోట కథను ఇంకొక
విధముగ మార్చినాఁడు. శివరాయల మరణానంతర
మర్భకుఁడైన యతని పెద్దకుమారుఁడు సింహాసనము
నెక్కెను; కాని యల్పకాలముననె యాతఁడును మర
ణించెను; అతనితరువాత నతని తమ్ముడు రాజ్యాధిపత్య
మువహించెను; అతఁడును మృతి నందెను. తరువాత
రాజ్యమునకు వారసైన మూడుమాసముల పసిపాపను
సింహాసనము నెక్కించి ముఖ్య మంత్రి తిమ్మరా
జాతని పేర రాజ్యము సేయ నగపడెను. ఆ బాలుడు
స్వయముగ రాజకార్యములు నిర్వహించుటకు దగిన
యీడురాగనే తిమ్మరాజతనికి విషము పెట్టి చంపి,
యాతని వంశమునకు జెందిన మఱియొక పసికూనను
గద్దెపై గూర్చుండబెట్టెను. ఇట్లు నలువదియేండ్లధి
కారమును జెల్లించి క్రీ. శ. ౧౫౩౦ ప్రాంతమున
నతఁడు కాలగతి నందెను. తిమ్మరాజు కుమారుఁడు
రామరాజు. ఇతఁడు శివరాయల కుమార్తెను పెండ్లి
చేసికొనెను. తండ్రి యనంతర మితఁడు రాయలకును
రాజ్యమునకు సంరక్షకుఁడై ప్రజాపాలనము సేయ
గడఁగెను. *Briggs Ferishta III pp. 10-13, 80-81.*

శంకమైనదని రూపింపవలయునని నాతనికడక. కావున మహమ్మదీయులకును నందు ముఖ్యముగ నాదిల్ శాహు రాజులకును దుర్యశమును దెచ్చు చరిత్రాంశములను సాధ్యమైనంతవఱకును సంపూర్ణముగ గప్పి పుచ్చుటయో, విధిలేక చెప్పవలసివచ్చినప్పుడు మసిబూసి మారేడుకాయ యనిపించుటయో యతనికి గర్తవ్యమాయెను. ఈ కారణములచే నతఁ డెన్నియో యబద్ధములను గల్పించెను. రాయలచే సంపూర్ణ పరాజయమును బొంది రాయచూరువంటి ప్రధానదుర్గమును గోల్పోవుట ఇస్మాయిలాదిల్ఖానుని యశక్తతను వెల్లడిపఱచునని యెంచి కల్పనాకథను గట్టెను. రాయచూరు రాయల యాధీనమందె యుండెననియు దానిని జయించుటకొఱకు ఇస్మాయి లాదిల్ శాహు దండయాత్ర సన్నాహముల జేయుచుండగా నా సంగతి దెలిసి రాయలు ప్రచండసైన్యముతో దానిని సంరక్షించుటకు వచ్చెననియు ప్రారంభించినాడు; తన కాతని నెదుర్కొనబలము చాలదని యెఱిగియు వెలిగుడారము వేసినపిమ్మట వెనుదీయుట పరువునకు లోటని యల్పబలముతోడనె యాదిల్ శాహు యుద్ధమునకు బయలుదేరెనని రచింపబూనిన కథకు పీఠిక వ్రాసినాడు; మధుపానగోష్ఠిని సృజించినాడు; ఆదిల్ శాహు వెంటనున్న యల్పబలమును అల్పతరముగ జేసినాఁడు. ఏలననఁగా, నాదిల్ఖానుఁడు పరువుమీఁద దృష్టినిల్పి శత్రుబలమును సరకుసేయక తొందరపడి యల్పసైన్యముతో యుద్ధమునకు వెడలి మధుపానమత్తుఁడై యొడలెఱుఁగక కూడవచ్చిన చిన్నదండునకుగూడ సంపూర్ణముగ నదినిదాటుట కవకాశమీయక శత్రువును దాకుటవలన నోడిపోయెనే కాని లేనియెడ నతఁడు పరాజయమును బొందియుండడని బోధించుటకొఱకింత కల్పన గావలసివచ్చినది. గావున ఫెరిస్తా వృత్తాంతము విశ్వసపాత్రము గాదు. యుద్ధమును కన్నులారగాంచి వర్ణించిన న్యూనిజా కథ సత్యాత్మకమైనదగుటచే ఫెరిస్తావ్రాతకంటె సర్వోత్కృష్టమైనది. ఈ యంశమును స్మరణయం దుంచుకొని చరిత్రకారులు పరిశోధనసేయుట యుక్తము.





# ప్రపంచపౌరుడు



శ్రీ కవికొండల వెంకటరావు

ఆది ధనుర్మాసం. ఇంకా సరిగ్గా చెప్పాలంటే డిసెంబరు 26 వ తేదీ. 25 క్రిస్మస్ పండుగ, క్రిస్టియను లకు జరిగిపోయింది. 27 హిందువులకు ముక్కోటి ఏకాదశి రానైయుంది. ఆ కారణంగా డిసెంబరు 26 వ తేదీ ఉదయం ఉభయ మతస్థులు కలిసికొన్న ప్పుడు, తప్పకుండా, ఆయా మతాలయొక్క తరతమ భేదాలనుగూర్చి నిరూపించుకోవడం ఆయేను తప్పింది కాదు. అందులోనూ ఆ రెండిళ్లు ప్రక్క ప్రక్క యిళ్లు. ఆయిళ్ళలో నివసించేవాళ్లు, ఒకయింట్లో ఒక కన్నె, ఒకయింట్లో ఒక కన్నె. ఆ యిద్దఱికన్నెలను తప్పిస్తే మరి రెండోవారులతో కూడా జోడుగా మాట్లాడుకునే వయస్సు వాళ్ళుగాని, వాలకంవాళ్ళు గాని, యౌవనముగలవాళ్లుగాని, మోహముగలవాళ్లు గాని వేరెవరినుకోవచ్చు; ఇతరు లెంతమందివుంటేం గనుక ఆ పేటలో!

పేట అంటే ఇతరదేశాల్లో ఏయేజాతుల గల వాళ్లు కలిసి ఒక పేటగా ఏర్పడివుంటారో నాకు తెలియదుగాని, నే వ్రాస్తూవున్న యీ కథలోని పాత్రలు, భారతయూనియన్‌లోని వార లవడంచేత అందు గల ఊళ్లనుగురించి, పేటల్నిగురించి మాత్రం, నేను భారతీయుణ్ణి కాబట్టి ఎఱుగుదును.

సర్వసాధారణంగా ఏయూరు చూచినా, ఏపట్నం చూచినా, బ్రాహ్మలంతా ఒకచోట, లేదా కోమటిబ్రాహ్మలంతా ఒకచోట, క్షత్రియులు ప్రత్యేకంగా ఒకచోట, కమ్మవారు కాపువారు మరోచోట ఇలా సవర్ణులంతా ఒక గుంపుగా ఉంటే, మరో గుంపుగా అవర్ణులన్న వాళ్లు ఉంటూ వుంటారు. ఈమధ్య ఈ అవర్ణులుండేజాగాను పెలివాడ అని, మాలగూడెం అని పిలవడం మానేసేసి, దేశభక్తుల ధర్మమా అంటూ హరిజనవాడ అనడం సాగిస్తూ వున్నారు. పేరు అంటే మార్చారేకాని, వాళ్ళ ఆర్థికావస్థ, వాళ్ల ఆరోగ్య వ్యవస్థ మార్చగలిగే మహానుభావులు లేనేలేరనవచ్చును. అటువంటి హరిజనవాడలో అక్కడక్కడ క్రిష్టియన్‌లు, తమ స్థిర స్థానానికి, చలనం కలుగకుండా, అనగా వాళ్ల పుట్టు పూర్వోత్రపుటిండ్లు వాకిండ్లు విడిచిపెట్టకుండా, అక్కడక్కడ, సహారాలో ఒయాసిస్సుల్లా, కనబడ తారు ఈక్రిష్టియన్లుకూడా భారతయూనియన్ ప్రజలే. అసలు భారతయూనియన్ మతిమీద ఆధారపడివున్న దేశంకాదు. లౌకికమైంది. ఆ కారణంగా ఎవరెక్కడ ఏ మతాభిప్రాయంతో విలసిల్లినా వేర్పాటులేకుండా ఏకే స్వభావం ఆ ప్రభుత్వం అలవరుచుకుంది.

ఈ ఉపోద్ఘాతవివరములో అసలు కథ మఱచి పోతానో ఏమో!

నేనన్న ఇద్దఱు కన్నెలు చెఱో ఇంట్లోను ప్రక్కప్రక్కల్ని కాపురాలు చేస్తూ వున్నారు. కాపురాలు చేస్తూ కన్నెలున్నారు అంటే, వాళ్లెంత ఎత్తు, ఎంత ఏపుగలిగివున్న వాళ్ళో వర్ణించడ మన వసరం. అయినా కొద్దిగా చెప్తాను, ఎందుకైనా మంచిది.—ఎవరిసంపాదన వారు చేసుకుంటూ, ఎవరి పొయ్యి వారు రాజేసుకొంటూ, ఎవరి పక్క వాళ్లు వేసికోగల స్వతంత్రత గల వాళ్లు ఇద్దఱూ కూడాను. హరిజనకన్య పేరు "కువలయూర్వశి" క్రిష్టియన్ కన్య పేరు "రెబక్కమ్మ"

కన్యల యిద్దఱియిళ్లకు మధ్య, పురాతనకాలం నుంచి పెరుగుతూ తఱుగని ఒకానొక కట్టవ వుంది. ఆదిలో ఆపేట ఒక పొలం కావడంవల్ల, ఆ పొలం యొక్క రెండుమళ్ళకు మధ్య పోసిన ఒకానొక మందడిగట్టు ఆ రెండిళ్లకు సరిహద్దుఅయి, దానిమీద పడి మొలిచిన ప్రతీ మొలకను ఎదగనివ్వడంచేతను పెద్ద కట్టవగా తేలింది. తొల్త పూర్వీకు లొకరొక రికి, గట్టుమీద మొలిచిన చెట్లు పండులమ్ముట కన బడుతూవచ్చినా, క్రమక్రమంగా రొట్టాపట్టా బలిసి పోయి, యీతరంవారి నొండోరులు చూచుకోకుండా చేసి పారేసింది. ఏదైనా ఒకరితో నొకరికి తమలో తమకు కువలయూర్వశికు రెబెక్కమ్మకు చెప్పుకోవా లని వుంటే తమతమ వీధి గుమ్మాలు వెలువడి ఒకరి తలుపు ఒకరు తట్టుకోవలసిందే! అందులోనూ ఒకళ్లు కిరస్తానీవాళ్ళు అని, మఱొకళ్లు అరుంధతీయులని అనుకొంటూ వున్నంతసేపు వారిరువురిమధ్య అన్యో న్యత ఇంతలో ఏర్పాటు కాగలదని పాఠకు లను కోవడం వెఱ్ఱి.

కువలయూర్వశిజీవితానికి రెబక్కమ్మ జీవితానికి పోలికే లేదు. ఏనాడో ఆపేటంతా అంటుకుని, అందున్న ఇళ్లన్నీ తాటాకు ఇళ్లు కావడంచేతను, సమస్తం పరశురామప్రీతి అయినప్పుడు, వీళ్ళ పూర్వీ కులు వాళ్ళ పూర్వీకులు కలిసి నీళ్ళుతోసి, పోసి, ఆర్పుకొని ఆరుబయట అన్యోన్యం అనునయించు కున్నారో, మఱి ఎన్నుకున్నది లేదు; మన్నించు కున్నది లేదు. అప్పటికీ ఇప్పటికీ కులవృత్తి మాను

పోకుండా కుశలమూర్తి కోతలకెళ్ళి, ఊడుపులూడ్చి, పచ్చగడ్డిమోపులెత్తుకుని విద్యలవిడి మచ్చికతో పెరిగింది. రెబక్కమ్మ స్కూలుఫైనల్ దాకా చదువుకుని, ట్రైనింగు అయి, ఒక మిస్ట్రెస్సుగా పని చేస్తూ, పృచ్ఛిస్తేనేగాని జవాబు చెప్పని బిగువుతో ఎదిగింది.

రూపానికి మళ్లీ ఇద్దరూ ఒకటే! గబ్బితనంలోనూ, సుబ్బితనంలోనూ, నిబ్బరంలోను, అబ్బురంలోను సరిసమానులు. అయితే చీరకట్టు, చెంగువిసరు, సిగచుట్టు, ముంగురుముసురు, ఇలాంటివాటిల్లో వేర్పాటు ఎవరికివారే అన్నట్టు కాపరిచేరు. ముఖ్యంగా దీపమ్మట వెళ్ళేటప్పుడు కుశలమూర్తి చేతిలో నిడుపాటి జడపలు, రెబక్కమ్మ చేతిలో కుఱుచ గౌనులు, ఎవరి అందము వారిదే ఎవరి చందము వారిదే అని రూఢి గొల్పేవి. దానాదీనా ఒకరు ఒకరి యింట్లోకి, ఒకరు ఒకరి యింట్లోకి వేళా వేళా ప్రవేశించడంకూడా పాంథజనులకు అనవాలై పోయింది.

ఒక పాంథజనుడు కుశలమూర్తి యిల్లు చూపించి, "ఈయింట్లో ఎవరు వున్నారో గాని వారివల్ల మన దేశములోని తిండి సమస్య పరిష్కారమయ్యేని" అంటే, వేరొక పాంథజనుడు రెబక్కమ్మ యిలు చూపించి ఈ యింటివారి జీవితపు కొలమానముతో సమానమైన కొలమానం మనకెందునూ కావలం" అనేవాడు. వారు మాటలయొక్క అర్థం తెలియకపోయినా ఆ మాటలు విన్నప్పుడెల్లా, రెండు గోచరించేవి. ఒకటి — కుశలమూర్తియొక్క నలుచదరపు పూరి ముంగిట్లోను ఇట్టలంగా ఎదిగి ఇంపుగా పూసి సొంపుగా కాస్తూవున్న చిక్కుడుపాదు కనిపించేది. రెండు — రెబక్కమ్మ పెత్తెమువాకిట్లోను, సీతాకోక చిలుకలు వాలినట్టు అగపించే రంగురంగుల క్రోటను మొక్కలు గల కుండీలుండేవి. ఆ పాదంత విస్తరింపుగా ప్రాకి అంత విరివిగా ఏలా కాసేనో మన యింట్లో పాదెడితే మాడిపోతుంది అని ఒకడనుకుంటే, ఆ కుండీలోకి ఏరకం ఏ సేత మెంచేనో, పెంట రొంత్రి ఆపి, తా వెంత సేవచేసినా తాతలేవలేదే మొక్కలకు అని మఱొకడు నిడుస్తూ మిడుస్తూ చూసేడు!

ఆలా తమకేసి చూచేవాళ్లను ఆ కన్నెలున్ను, జాలకించబలకుండా చూచినట్లు తమ కన్నులరవాల్చి వెప్పలంట జూచేవారు. ఊ, ఇదయ్యేవారు తిమర్చి ఆ పాంథజనుల్లో ఒక్కడైనా పెళ్లాడకపోతాడా అని. — చూడ్డం అంటే సులువుగాని పెళ్లి చేసికోవడం అనేది ఏదేశంలోనూ కష్టమే. అందులోనూ భారత దేశంలో మరీ కష్టము. ఇప్పటికే జనసంఖ్య మితిమీరి వుంది. ఇంకా స్త్రీ పురుషాదులు వివాహమై శిశువుల్ని కంటే, వాళ్లందఱినీ మేపి, సాకుచేసి, చక్కపఱచి, సంపల్లలితమైన సరఫరా ఏ సర్కారు చేయగలదు?

ఇదంతా నిత్యం వార్తాపత్రికల్లో కాలంకషంగా చెఱగబడ్డం కన్నె లిద్దఱకూ తెలుసును. ప్రతీయువకునికీ తెలుసును. తత్రాపి ఇద్దఱుకన్నెలూ కూడా తాము స్వార్జితంగా కొంత డబ్బు అనగా అసమం ఒక్కొక్క రొక్కొక్క పదివేల రూపాయలైనా కోశాలో నిలవ వేసికొంటే పెళ్లాడరాదనికూడ బలుకున్నట్టు ఆలాగే వుండిపోయేరు, ఏలాంటి మనువూ లేకుండా.

ఏళ్ళు జరిగిపోజొచ్చాయి. నోవాళ్ళు ఆయింటికీ ఈయింటికీకూడా వచ్చి నిరాశాపరులై పోతూ వుండేవారు. ఇలా వుంటూవుండగా ఓ ధనుర్మాసంలో వచ్చిన డిశంబరు 25 వ తేదీ రాత్రి ఏం జరిగిందీ అంటే–రెబక్కమ్మ ప్రతీ క్రిస్టమస్ పండక్కీ నిలిపినట్టే. ఒక క్రిస్మసి చెట్టు ప్రాంగణంలో ఎత్తుగా నిలిపింది. వరసుగా కొమ్మలు రెమ్మలు, అమరిచి, బొమ్మలూ సొమ్ములు కుదిరిచి, క్రిస్మసి తాతకో పం వేచివుంది. బైబిలులో ఏసుజననం అన్న దాన్ని గురించి చదువుతూ వుంది. అదే వేళకు కుశలమూర్తి తన వాకిట్లో కళ్లాపు చల్లి, వరిపిండితో రథం, నాగబాము, పద్మం, ఇలాంటి ముగ్గులు పచరించుకు వన్నెల్లో సందర్శిస్తూ, తన కులవేల్పైన 'కాంతి' ని సంస్మరించుకుంటూ వుంది ఇద్దఱూ అప్రయత్నంగా ఒక్కసారి కునుకు గన్నారో ఏమో,—కల్లో—ఇద్దఱూ ఒక్కసారి మెలకువ వచ్చేలా, ఆ రెండిళ్ళకు మధ్యనవున్న కట్టవలో చంటిపిల్లవానియొక్క "కేరు కేరు" ఏడ్పు వినబడ్డటయింది.

వెంటనే ఈతట్టునుంచి ఒక ఎండు తాటాకు అంటించుకుని కుశలమూర్తి తనవైపు కట్టవమ్మట నెరుకసాగింది. అతట్టునుంచి రెబక్కమ్మ ఒక టార్చి వేసుకు చూడసాగింది. కాని ఒకరి వెలుగు ఒకరికి కానబడ్డంలేదు. అంత దట్టంగా అల్లుకుపోయి అదంతా అంధకారమయమయి వుంది. రెండెంపులా వెలుగు ప్రసరించినా ఆ వెలుగు.

ఇరువురూ క్రమంగా కట్టవచివరకు వచ్చి నిలబడిపోతూ, ఒకరిమీదకు ఒకరు తిమతిమ దివ్వెలను వేసుకున్నవారై విస్తుపోయి, "మనిద్దఱకూ ఈపొద్దు

ఒకేరకపు కలవచ్చినట్లుందే! మనిద్దఱం ఒకే రకం ధ్వనిని లేచినట్లున్నామే! కాని కట్టెవలో ఏమీ కనిపించదే!" అని అనుకొన్నారు. "ఏమిటా వెన్నెల్లోను ముంగిట్లో కొత్తవెలుగు?" అని అడిగింది కువలయార్ద్రి. "అదే మా కిరిస్మిస్ మహోత్సవం. అయితే ఎందుకు? దాన్నప్పుడే నీ చిక్కుడుపాదలముకు పోయ్యేని" అంది రెబెక్కమ్మ. "నే నిప్పుడు పెట్టానో లేదో ముగ్గు, నీ ఎఱ్ఱచీమలు చూడు అప్పుడే వచ్చి ఎలా తిరిగేస్తున్నాయో పిండిఅంతా" అంది కువలయార్ద్రి.

"ఏమిటా ముగ్గు? ఎందుకు పెట్టేవు?" అని అడిగింది రెబెక్కమ్మ కువలయార్ద్రిని. అడిగితే "ఏం, హరిజనులమన్న మాట తెలుసా? మాది హిందూమతమని ఎరుగుదువా?—ఆ మతాన్ని అనుసరించి ధనుర్మాసం ఆరంభంనుంచి, రాత్రిపూట కళ్ళాపుజల్లి పిండిముగ్గులు పెట్టుకుంటాము! అది మా మతం!' అంది కువలయార్ద్రి. "ఎవరు చెప్పేరు నీకిదంతా?" అని అడిగింది రెబెక్కమ్మ. మా వాళ్ల పురోహితుడు చెప్పేరు. మఱెన్నో నిత్యం మా కుల దేవతైన కుంతి కథ చెబుతూ, కర్ణుని జన్మవృత్తాంతం దగ్గఱకొచ్చేసరికి ఆ పెద్దా—వెలుగు చూడు! సూర్యోదయం చూచి నమస్కరించు అని బోధచేసి తెల్లవారకుండా తాను తిరోహితుడయ్యేడు" అంది అతి అమాయకంగా. రెబెక్కమ్మకూడా తన మనసు తేట తెల్లమయ్యేలా ఎఱుకపఱిచింది; తనచిన్నప్పటప్పటి దైవజ్ఞాన గురువువచ్చి దేవుని వేదగ్రంథాన్ని బోధపఱిచి, అందులోని క్రీస్తు జననఘట్టం వినిపించేవాడని, వినిపించి వినిపించి దీపమార్పేసి చూడు ఇలా చీకటిమయంగా వున్నప్పుడు మేరీ కన్య పశువులకొట్టంలో క్రీస్తుని కన్నదని వివరించి తిరిగి దీపం ముట్టించేడని.—అయితే మీ మతం చీకటినుండా వెలుతురులోకి తీసుకుపోతుంది కాబోలు. మా మతం ఎప్పుడూ వెలుతురు మయమేను. అసలు కర్ణుడు పుట్టిందే వే వెలుగులవానికి. మఱే చాటూ లేదు, మాటూ కాదు." అంది కువలయార్ద్రి. "ఏమైతేం! మీ మతంలోను ఒక కన్య, ఆ కన్యకు ఒక కొడుకు కలగడం! ఇలాంటి గాథ వుంది!" అంది రెబెక్కమ్మ—"ఏ మతంలోనైనా పెట్టెలొట్టి గాథలుండక మానవు. ఇప్పుడు మనకు కట్టెవలో వినబడ్డ బిడ్డ ఏడుపులాంటివే ఆ గాథలు" అంది కువలయార్ద్రి. దానిమీద రెబెక్కమ్మకు మఱోసారి కట్టెవఅంతా వెనుకి చూద్దామని బుద్ధిపుట్టింది. తనకు తోడు కువలయార్ద్రిని రమ్మనమంది. నిజం తెలుసుకుందామంది. మనిద్దఱికీ ఒకేలాంటి కల రావడం ఒకేచోట ఏడుపు వినబడ్డం అత్యంతకరం ఆశ్చర్యమే" నంది. రెబెక్కమ్మయొక్క వాగ్ధారకు లొంగిపోయినట్టుగా కువలయార్ద్రి ఆమె వెంట వెంట కట్టెవింకో పాడి వెదకజొచ్చింది. కొఱుమనడం మానేసి ఈమాటా శిసువు చిగనవ్వు నవ్వినట్టు అయింది. కాని రూపం ఏమీ కాపడదాయెరి.

చటుక్కున ఒకచోట కొత్తగా అప్పటికప్పుడు చంకక్రలమీద నిలబడ్డట్టు నిలబడి పొడుగ్గా ఒక దైవికత్వం మానవత్వం కలసిన మహోద్భుతం సాక్షాత్కరించి ఆ యిరువురికీ ఇలా ప్రబోధించింది. "నేనొక కుంటిదాన్ని, నాకొక శిశువు ఈ కట్టెవలో కలిగాడు. వీణ్ణి మీ యిరువురకు ఒప్పజెప్పి నేను సెలవు పుచ్చుకొంటూవున్నాను. నేను కిరిస్మిస్ ముక్కా ముదిలితాతినా కాను: అనూరుణ్ణి కాను. నేను నేనే అవిదాన్ని." అని దివ్యజ్యోతి అయి తిరోహిత అయింది.

"కల కాదు నిజంగా బిడ్డే! ఆ బిడ్డను కన్నది ఒక దేవత" అని కువలయార్ద్రి రెబెక్కమ్మకూడా ఏకధాటిని నమ్మేరు. ఒకే తాటిమీద నిలిచేరు బిడ్డను గురించి మోజింపచేటప్పుడు. కాని దేవతను గురించి ఆలోచనలో పడ్డప్పుడు మాత్రం ఆ దేవతకు ఎడంకాలు మాత్రమే కుంటి అని రెబెక్కమ్మ, కుడికాలు మాత్రమే కుంటి అని కువలయార్ద్రి తగవుపడసాగారు. కట్టెవలో బిడ్డకు నవ్వేమాని ఏడ్పేమాని సెలవులంట తెల్లని చనుబాలు వెలలించేసు.

తెల్లారింది, సమస్తంలో కానికి పల్లడిఅయింది. "మారనే దేవత కే కాలుకుంటో అని మీరిద్దఱూ తగవు పడేకన్న, ఏ కుంటీ లేని యీ కూచిని చూచి సంతోషించండి!" అని యిరువురకు ప్రబోధం చేసేరు పట్నంలోని ప్రజఅంతా.

నాటినుండీ రెబెక్కమ్మ, కువలయార్ద్రి, మతం అన్నది మఱచి కట్టెవకొట్టిపారేసేసి, ఏకండీ యిల్లుగా రెండిళ్ళూ గావించుకుని ఆ దొఱకిన బిడ్డని దైవదత్తంగా చేకొని యిరువురూ కలిసి పెంచి పెద్దవాణ్ణి చేశారు. అతగాడు క్రమక్రమంగా శుక్లపక్ష చంద్రుడిలా పెరిగి ప్రపంచ పౌరుడయ్యేడు.

కథ కంచెకు వెళ్ళింది. మనం మనయింటికి వెళ్ళేం.

చిన్న నవల

# అల్పజీవి





శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి

★

(గత సంచిక తరువాయి)

## 4

అంతకుముందెన్నడూ తన కింత పరపతి ఉన్నదనుకోలేదు సుబ్బయ్య.

తనలాంటి వాడు గవరయ్య అంతటివాణ్ణి అలా అడగ్గలగడం, అడగ్గానే అతను అడిగినంతా కిక్కురు మనకుండా ఇవ్వడం సంభవమౌతుందనుకోలేదు సుబ్బయ్య.

అంత సులభంగా అంతా జరిగినందుకు చాలా గర్వించేడు సుబ్బయ్య.

మరునాటి ఉదయం కాఫీతాగి, సిగరెట్టు కాలుస్తూ వీధి వరండాలో కూర్చున్నప్పుడు అతని కంటికి ఎర్రచీరమనిషి సంతోషంగా ఉన్నట్టు కనిపించింది.

మొగుడు కాని త్వరలోనే వస్తున్నానని ఆఖరికి ఉత్తరం రాసేడేమో? కొడుకు జబ్బు పూర్తిగా పోయిందో? లేక రెండూ జరిగేయో?

ఏమో, పాపం!

మునీశ్వర్లవారు ఇంకా రాలేద? ఏం చెప్మా!

లేడీడాక్టరు రోజూ కన్న వేగిరం బయల్దేరింది.

ఈవిడకి పెళ్లికాలేదా? లేక విడోవా? డ్రైవరు పక్కనే ఎందు కూర్చుంటుంది?

ఎందు కూర్చోకూడదు?

పొట్టివాడప్పుడే బజారుకి పోయి వస్తున్నాడు.

వీడికి పకుచుపెళ్ళాం ఉన్నదనుకుంటాను. కోడిమాంసం అంటే చెవికోసుకొంటుంది. మనిషి ఎలా ఉంటుందో? బావుంటుంది...

ఆ నల్లచీర కట్టుకున్నది ఎవరో?

అబ్బ! ఎంత తెల్లగా ఉంది!!

తెల్లటిదానికి నల్ల మొగుడే దొరుకుతాడు. ఈవిడ మొగుడు మసిబొగ్గులా ఉంటాడనుకుంటాను. ఎలాంటి దానికి అలాంటివాడు ఎప్పుడూ దొరకడు. నిజం అంతే.

సావిత్రి ఎంత బావుంటుంది! నేనెలా ఉంటాను?!

అంతే!

ఏమిటో దేవుడు అలా కూర్చుతాడు!

సావిత్రి చాలా బావుంటుంది...అది ఇంత తెల్లగా ఉంటుందా? ఏమో! కాని బావుంటుంది... నాలా ఉండరు...కమల నాలాగే ఉంటుంది... అందుకే సావిత్రికి దాన్ని చూస్తే ఇష్టంలేదు...కన్నతల్లికూడా అలా ఉంటుందా?...అన్నీ నా అనుమానాలే...క్రిష్టుడు తల్లినీ మామనీ పోలేడు... వాడూ ఓ జమీందారవుతే...జాతకం బావుందన్నాడు పాలకొండ శాస్త్రులు...ఆవిడే ఎదటింటికి ఎందుకు వెళ్తోంది...చాలా తెల్లగా ఉంది...

నల్లగా చీర...కళ్లు బావున్నాయి...చిన్నవి...పెళ్ళయిందో లేదో...అప్పుడే నల్లగా ఉంటాడనేస్తున్నాను...కిల్లీకొట్టు ఇప్పుడేనా తెరిచేడు...పక్కింటి వాళ్ళమ్మాయి తయారు...అబ్బెబ్బే లాభం లేదు...తల్లీ తండ్రీ అదమాయింపులో ఉంటేనా...సోడాలు, లైమ్ జూస్‌లు, అలా తాగుతూనే ఉంటుంది...వాడు డబ్బులు పుచ్చుకోడు...ఈడొచ్చిన అమ్మాయే...పైటమాత్రం వేసుకోదు...సిగ్గు లేకపోతే సరి...కిల్లీ కొట్టువాడు మంచివాడు కాడు...నల్లచీరావిడ...ఎందుకు వెళ్లింది...బావుంది...చాలా...కమలా క్రిష్ణుడూ పుస్తకాలు పట్టుకొని వీధిలోకి వచ్చేరు.

"ఏంరా క్రిష్ణా! ఇవాళ ఆలస్యంగా వెళ్తున్నావేం?"

"ఫరవాలేదు నాన్నా! మేష్టరేమీ అనర్లే"

నే వేసిన ప్రశ్నేమిటి? వాడి సమాధాన మేమిటి?...మేష్టరేమీ అనర్లే...డాబూ దర్జా ధీమా...మేనమామ పోలికే అంతా...కమలకి నాలాగే భయం...పాపం...ఎప్పుడూ వాడికి వెనకే నడుస్తుంది...అదేమిటో...

క్రిష్ణుడు తోలుసంచీ భుజాన్న వేసుకొని అటూ ఇటూ చూస్తూ ముందు నడుస్తున్నాడు. క్రిష్ణుడికి తొమ్మిదోఏడు. చురుగ్గా కన్పిస్తాడు. ఉంగరాల జుత్తు; పొడవు ముక్కు; పెద్దకళ్ళు; కుర్రవాడిలో వెంకట్రావు పోలిక కొంత లేకపోలేదు.

కమల పీలగా ఉంటుంది. నెమ్మదిగా మాట్లాడుతుంది. చూడ్డానికి పదకొండేళ్ళ పిల్లలా ఉండదు. క్రిష్ణుడికన్న ఆమె వయసులో పెద్దయినప్పటికీ ఆమె తనకన్న చిన్నదానిలాగ వ్యవహరిస్తాడు క్రిష్ణుడు.

ముందు తమ్ముడు, వెనక అక్కా నడుస్తూ స్కూలుకి వెళ్తున్నారు.

వెళ్తూన్న వాళ్ళని చూస్తూ తండ్రి చాలా సంతోషించేడు.

"నాన్న ఉంటే ఎంత బావుణ్ణు!"

పాపం! నాన్న!

రోజూ నన్ను స్కూలుకి దిగబెట్టేవాడు!

వీళ్ళని చూసి ఎంత సంతోషించునో!

ఏమిటో ఈ జీవితం?!

నాన్న ఎక్కడున్నాడో?

స్వర్గాన్న ఉన్నాడు!

నేనుమాత్రం ఎన్నాళ్ళుంటాను?

కొన్నాళ్ళు!

తరువాత?

"నాన్న ఎక్కడున్నాడో?"

అనుకుంటారు కమలా, క్రిష్ణుడూ!

ఏమిటో ఈ జీవితం?!

నాన్న చచ్చిపోయేడు!

నేను బ్రతికున్నాను!

నేను చచ్చిపోతాను!

కమలా క్రిష్ణుడూ బ్రతికుంటారు!

వాళ్లు......

ఛా! పొద్దుటే ఏమిటీ పాడు ఆలోచన్లు!

...ఇహ లేస్తాను...స్నానం చెయ్యాలి...వేణ్ణీళ్ళు ఉన్నాయో లేవో...భోజనం చెయ్యాలి...వంటయిందో లేదో...ఏం కూర చేసిందో ఈపూట...వెధవకూరలు...అన్నీ ప్రియం వే...భోంచేసి ఆఫీసుకి పోవాలి...వెధవాఫీసు...నా కాఫీసుకి వెళ్లాలని లేదు...తప్పుతుందా...తప్పదు...వెళ్ళవలసిందే...

మెల్లిగా లేచేడు సుబ్బయ్య.

వీధిలోకి చూసేడు.

ఆవిడ ఎదటింటి మెట్లు దిగుతోంది.

ఎవ రీవిడ...అబ్బ...చాలా తెల్లగా ఉంది...ఎవరో ఈవిడ...నవ్వుతోంది...బాగుంది...బాగా నవ్వుతోంది...మేష్టర్ చుట్టమా ఏమిటో...

అని ఇంట్లోకి వెళ్ళబోతూ ఆగిపోయిన సుబ్బయ్య అనుకున్నాడు.

ఎదటింటి మెట్లు దిగుతూన్న ఆడమనిషి నల్లటి చీరకట్టుకొంది. ఆవిడ తెల్లగా మెరిసిపోతోంది ఎండలో.

ఆవిడ కళ్ళు పెద్దవికావు. కాని కనురెప్పలు

మాటిమాటికీ రాల్చి, అప్పుడప్పుడు కళ్ళు తేల్చి చూస్తోంది, ఆమె.

ఆవిడ జుత్తు పొడవు కాదు. కాని నొక్కులుగా ఉంది. చెదురుతోంది.

ఆవిడ ముక్కు పొట్టిది కాదు. కాని కొంచెం మొద్దుగా ఉంది.

ఆవిడ నోరు వెడల్పు కాదు. కాని పెదవులు కాస్త దళసరిగా ఉన్నాయి.

ఆవిడ శరీరం సన్నం కాదు. కాని ఆరోగ్యంగా ఉంది, లావుగా ఉన్నా.

ఆవిడ్లో మోటుతనం లేదు. ఆవిడ చూపుల్లో కరకుతనం లేదు. ఆవిడ ఒంటిమీద ఆభరణాల్లేవు. ఆవిడ తన ఒంపుల్ని అంతగా దాచుకోడం లేదు.

పరిచయం లేని మొగవాళ్ళు ఆవిడ్లాంటి ఆడవాళ్ళని పలకరించడానికి సందేహించరు.

పరాయి మొగవాళ్ళతో చనవుగా ఉండడానికి సందేహించే మనిషిలా ఆవిడ అనుపించదు.

ఆదినం ఉదయం "ఈవిడెవరో" అనుకొంటూ ఆవిణ్ణి చూస్తూ నిల్చున్న సుబ్బయ్యని చూస్తూ ఆవిడ అడిగింది.

"ఏమండీ! 'టైమ్' ఎంతయిందండీ"

అది మాత్రం అడిగింది ఆవిడ.

అది ఆవిడ అడిగినందుకు అపర ప్రవరుడ్లాగ అమితంగా గాభరా పడ్డాడు సుబ్బయ్య.

వీధిలో అందరుండగా నన్నే అడగాలా?

నన్నే ఎందు కడిగింది?

సుబ్బయ్య చెడ్డ గాభరా పడ్డాడు.

ఆట్టే వెడల్పుగా లేని రోడ్డు అడ్డుగా దాటి సుబ్బయ్యకి దగ్గరగా వచ్చిందావిడ.

ఇంట్లోకి పోదాం అని నిశ్చయం చేసుకున్నాడు సుబ్బయ్య.

ఉద్దేశాన్ని ఆచరణలో మాత్రం పెట్టలేక పోయేడు.

ఎవ రీవిడ? ఎందుకువచ్చింది ఎదురింటికి? ఈమెకు ఇంత తెలుపు ఎక్కణ్ణించి వచ్చింది? మాటల్లో పడమటియాస ఉందా లేదా? ఎవరో ఎరగని నన్ను చూసి టైమ్ అడగడంలో ఉద్దేశం ఏమిటి? ఎదురుగా నిల్చొని పైట సర్దుకోకపోడంలో అభిప్రాయం ఏమిటి? కొంపతీసి...కోతి వెధవని...ఈవిడకి ముప్ఫ యేళ్ళుండవచ్చు...పెళ్ళయి వుంటుంది...కాక పోతే?...బావుణ్ణు...నాకెందుకు అయినా?... మనిషి బాగుంది...బాగుంటే నాకేం...మంచి మనిషిలా అవుపి...స్తోందా?...అయినా నాకెందుకు?... రెప్పలు పొగ్గా రాలుస్తోంది...పైట సర్దుకుంటే... బావుండదేమో...

ఒక్క క్షణంలో రకరకాల భావాలు, పరిగెత్తేయి సుబ్బయ్య మనసులో.

ఆవిడ మళ్ళీ అడిగింది!

"ఏమండీ గంటెంతయిందో చెప్పగలరా?"

సుబ్బయ్య చేతికి వాచీ లేదు.

"ఇంట్లో...ఇంట్లోకి వెళ్లి చూసి చెప్తానుండండి" అని తొట్రుపాటుతో అన్నాడు.

ఆవిడ నవ్వింది.

ఎందుకు నవ్వింది? నన్నుచూసి కాదుకద? వటకారపు నవ్వు కాదుకద?

నవ్వితే బావుంది.

బుగ్గ చిల్లు బావుంది.

"సరేనండీ" అన్నదామె.

తొందరగా ఇంట్లోకి వెళ్ళేడు సుబ్బయ్య.

గదిలో గడియారం ఏడుగంట లయినట్టు చూపెడుతోంది.

ఇంకా ఏడుగంటలేనా అయింది!

లేదు లేదు. గడియారం ఆగిపోయింది.

సుబ్బయ్య చాలా చిరాకు పడ్డాడు.

గంట తెలుసుకుందికి వీధిలో అందమైన ఆడమనిషి నిల్చుంది.

గదిలో ఉన్న గడియారపుముల్లు గదిలో నిల్చుండి పోయేయి.

వీధి వసారాలోకి వచ్చి రాని నవ్వు తెచ్చుకున్నాడు సుబ్బయ్య.

"గడియారం ఆగిపోయిందండీ! కాని...కాని ఇప్పుడు ఎనిమిదిన్నర అవుతుం దనుకుంటానండీ" అన్నాడు. సరియైన 'టైమ్' తెలుసుకోందికి, పాపం, ఆవిడకి ఏంపనుందో, ఏమిటో?

"అయ్యో!...పోనీలెండి" అని కదలబోయింది ఆవిడ.

అయ్యో! వెళిపోతోందే!

ఈవిడ్ని ఆపుదామని ఎందు కంత ఆత్రతగా ఉంది వాడి?

అయ్యో! వెళిపోతోందే!

"సందు చివర్ని హూటేల్లో ఎంత టైమయిందో చూసి వస్తానుండండి" అన్నాడు ఆత్రంతో.

"అక్కర్లేదండీ! అలాగే వెళ్తున్నా న్నేను"

ఆవిడ కంఠం చాలా ఇంపుగా ఉంది.

ఆవిడ నవ్వు చాలా సొంపుగా ఉంది.

ఆవిడ కదలింది.

అయ్యో! వెళిపోతోంది!

వెళిపోతోంది!!

ఎలా ఆపడం ఈవిడ్ని?? +!!! +?? +!!

అతితీవ్రంగా అరక్షణం ఆలోచించేడు.

"ఏం?...తొందరగా స్టేషన్కి ఎక్కడికైనా వెళ్లాలా?"

ఆమాటతో ఆవిడ ఆగింది.

హమ్మయ్య! ఆగింది!

"లేదండీ"

అన్నదే కాని ఎక్కడికి వెళ్లాలో చెప్పలేదు.

చెప్పలేదు కాని అక్కడే నిల్చొంది.

ఆవి డెవరో తెలుసుకోవాలనే ఆదుర్దా జాస్తి అయింది సుబ్బయ్యకి.

"ఎదటింటివారు మీకేమైనా అవుతారా?" అని అడగ్గలిగేడు.

ఎన్నడూ ఎరగని ఆడమనిషిని ఎండలో నిల్చోబెట్టి ఆవిడ పుట్టుపూర్వోత్తరాలగురించి, సంబంధ బాంధవ్యాల గురించీ, ప్రశ్నించడం, పెద్దమనిషి తరహా కాదని సుబ్బయ్యకి గుర్తు రాలేదు ఆ సమయంలో.

"ఏమవుతారంటారా? ఆయన మాస్టరూ, నేను మిస్ట్రిస్నీ" అని కొంటెగా నవ్విం దావిడ.

నవ్వేక అన్నది: "ఆయనకి జ్వరంగా ఉంటే చూసిపోదామని వచ్చేను. అంతే"

ఎదటింటిమాస్టర్ కి జ్వరం వచ్చిందికదా అని చింతించే అవస్థలోనూ లేడు, ఆవిడ ఎందుకునవ్విందా అని ఆలోచించే అవస్థలోనూ లేడు సుబ్బయ్య.

నవ్వినప్పుడు ఎంతో బావుంది అని మనసులో మళ్ళీ "నోట్" చేసుకున్నాడు.

"అయితే మీరు భారతీ విద్యాలయంలో పని చేస్తున్నారా?"

"అవునండీ"

"స్కూల్లో ఇదివర కెవరూ ఆడటీచర్లులేరే"

"అవునండీ, ఈయేడే వేసేరు. నేను వచ్చి అంతా రెండుమాసాలయింది, ఈవూరు"

"ఆహాఁ! అలా చెప్పండి. అయితే...అయితే మీది ఈవూరు కాదా ఏమిటి?"

"కాదండీ, మాది ఏలూరు"

"అబ్బ! అంతదూరంనుంచి వచ్చేరాండీ?!"

"ఏంచెయ్యడమండీ పొట్టకోసం ఎంతదూరమైనా పోవాలి కద!"

అయ్యో! పాపం! పేదవాళ్ళ

ఈవిడకి పెళ్ళయిందో లేదో!

పెళ్ళయితే ఇలా అవస్థపడుతుందా?

అయినా, ఎలా అడిగి తెలుసుకోడం?

"ఏక్లాసుకి చెప్తారండీ పాఠాలు?"

అన్నట్టు కమల భారతీ విద్యాలయంలోనే చదువుతోంది. ఫస్టుఫారంకి వచ్చింది. ఈవిడ ఫస్టు ఫారంకి పాఠాలు చెప్తే...

"చిన్నక్లాసులకి చెప్తానండీ. ఈయేడు ఫస్టు ఫారం, సెకండ్ ఫారాలవాళ్ళకి ఇంగ్లీషూ, హిస్టరీ చెప్పమన్నారండీ"

హమ్మయ్య!

"మాఅమ్మాయి ఫస్టుఫారమే చదువుతూందండీ. మీకు తెలుసునో లేదో" అన్నాడు సుబ్బయ్య సంతోషంతో.

"ఏం పేరండీ మీ అమ్మాయిది?"

"కమలండీ, కమల. పల్చగా తెల్లగా ఉంటుంది"

"కమలా?...ఆ. తెలుసునండీ, తెలుసు. తెలివైనపిల్లే (సుబ్బయ్య ముఖం వికసించింది)...అయితే మీ అమ్మాయి స్కూలుకు వెళ్ళిందా?"

"పావుగంటయిందండీ వెళ్ళి"

"అయితే స్కూలుకి వేళయివుంటుందండీ. టీచర్నయీ లేటుగా వెళ్తే బావుండదు. వెళ్ళి వస్తా.

వస్తా. మళ్లీ కలుసుకుందాం. మీ అమ్మాయిగురించి చూస్తూ ఉంటాన్లెండి. మరి నే వస్తా"

అని కొంచెం తొందరపాటుతో వెళ్లింది ఆవిడ.

మళ్ళీ కలుసుకుందాం...అబ్బ...అబ్బ!...

నడకకూడా అందంగా ఉంది ... హబ్బ ... హబ్బ... వెనకనుంచి చూసినా మనిషి బావుంది... అబ్బ...అబ్బ...కొంతదూరం వెళ్ళేక వెనక్కి తిరిగి చూసింది ఆవిడ.

వెనక్కి తిరిగిచూసి మందహాసం చేసింది.

ఆమె కట్టుకొన్న నల్లటిచీర ఎండలో ఇంకా నల్లగా అగుపిస్తోంది. ఆవిడవళ్లు దూరంనుంచి ఇంకా హెచ్చు తెల్లగా కనపడుతోంది. తొందరగా నడవడంలో ఆవిడ నడుం చాలా భారంగా కదుల్తోంది.

అవిణ్ణి చూస్తూ ఉంటే సుబ్బయ్య గుండెలు కట్టు తప్పి కొట్టుకుంటున్నాయి. అతని ఒళ్లు చెప్ప లేనంతగా వేడెక్కి వణికింది. మొదటిసారి మద్యం తాగినట్టు అతని తల తిరిగింది.

అతనికి నిషా ఎక్కింది.

ఆవిడ వెళ్తూ వెళ్తూ సందుచివర ఆగింది. హోటేల్లో టైమ్ చూసేక వెనక్కి తిరిగి మళ్ళీ చూసింది. తరువాత సందు మళ్ళింది.

అబ్బబ్బ! రెండుసార్లు వెనక్కి తిరిగిచూసింది.

రెండుసార్లు చూసింది.

చూసింది. కళ్లు రాల్చి చూసింది. కళ్లు తేల్చి చూసింది. తొలగిన పైట సర్దుకొంటూ చూసింది.

సుబ్బయ్య మతి మతిలో లేదు.

మొగవాళ్ళందరికీ ఉన్నట్టుగానే చిన్న తనంలో సుబ్బయ్యకి ఆడవాళ్ళని ఆకర్షించాలనే అభిలాష ఉండేది.

ఒకప్పుడు తనకా అభిలాష ఉండేదనికూడా తరువాత దినాల్లో మర్చిపోయేడు.

కాని, ఆరోజు ఉదయం ఆవిడతో తను మాట్లాడినందుకు పెళ్ళికొడుకులా సంబరపడ్డాడు సుబ్బయ్య.

అతనికి అతి ఉత్సాహం కలిగింది.

అతనికి తెలియని వాంఛలతో అతని మనసు చలించింది.

ఆవిడ వీధి మలుపు తిరిగి పోయిన తరువాత సుబ్బయ్య ఇంట్లోకి వెళ్ళేడు.

స్నానం చేసేడు. భోజనం చేస్తున్నాడు.

వడ్డించుకొని భోజనం చేస్తున్నాడు.

సావిత్రి అతని కెప్పుడూ వడ్డించదు. వంట చేసి, అన్నీ సిద్ధంచేసి ఆమె తన గదిలోకి పోతుంది.

“నేనామెకి తగను. నిజమే. కాని భర్తనికదా? నామీద కొంచెమైనా గౌరవం ఉంచకూడదా” అని కించపడుతూ ఉంటాడు సుబ్బయ్య.

ఆపూటమాత్రం సావిత్రి తనపక్కన కూర్చొని వడ్డించనందుకు విచారించలేదతను.

సావిత్రి ఉన్నప్పుడు ఏ ఆలోచనా తోచ దతనికి.

సావిత్రి ఎదురుగా ఉంటే నల్లచీరావిడ అతని మనసులోంచి తొలగిపోయుండును.

సావిత్రి అతనికి ఎదురుగా లేదు.

ఎదురుగా లేని నల్లచీరావిడ అతని మనసంతా ఆక్రమించింది.

అతని ఆలోచనలన్నీ నల్లచీరావిడ చుట్టూ తిరుగుతున్నాయి.

ఆవిడ ప్రధాన పాత్రగా అనేక నాటకరంగాలు అతనికళ్ళముందు కదిలిపోతున్నాయి.

అనేక కథల్లో అతని కోరికలు చెలరేగు తున్నాయి.

అనేక కోరికల్లో అతని కథలు నిండుకుంటు న్నాయి.

ఆవిడకి పెళ్ళయిందా?

అయింది! ఆమె భర్త ఇక్కడెక్కడా లేడు. పరలోకానికి అర్జంటుగా వెళిపోయేడు. మొదట్లో ఆవిడ చాలా ఏడ్చింది. తరువాత బ్రతుకు తెరువు చూసుకొందికి ముందు స్కూల్లో ప్రవేశించి చదువు కొంది. “నన్నెవ్వరూ పోషించనక్కర్లేదు. నాపొట్ట నేను పోషించుకోగలను” అన్నాది. అలాగే సాధిం చింది. తన జీవితాన్ని తనే భరిస్తోంది. “నాకు భర్త అక్కర్లేదు” అన్నాది. మళ్ళీ పెళ్ళిచేసుకోదల్చుకో లేదావిడ. చేసుకుందామనుకున్నప్పటికీ ఆమెకినచ్చిన వాళ్ళెవరూ లేరు.

కాని—

భగవంతుడు సుబ్బయ్య నేవాణ్ణి సృష్టించేడు.

ఆ సంగతి ఈరోజే తెలిసింది ఆవిడకి.

ఆవిడకి పెళ్ళయిందా?

అవలేదు! "నేను పెళ్లి చేసుకోను. నాకు పెళ్ళిక్కర్లేదు." అని భీష్మించుకూర్చుంది. మగవాళ్ళంటే ఆవిడకి అసహ్యం. "ఆడవాళ్ళ బ్రతుకులు ఉద్ధరించడానికే నేను పుట్టేను" అంటుం దావిడ. పురుషుడన్న వాడి అపవిత్రపు హస్తం ఆవిడ వంటిని పడలే దింతవరకూ.

కాని—

ఈ రోజున సుబ్బయ్యని చూసింది ఆవిడ.

మగవాళ్ళగురించి ఆవిడ దృక్పథం మారింది. ఆవిడ మనసు చెదిరింది. ఆవిడ పైట తొలగింది.

ఆవిడకి స్నేహితులున్నారా?

ఉన్నారు! అనేకమంది. అంతా స్నేహితులే ఆవిడకి. అంతా కబుర్లు చెప్తూ తిరిగేవారే. అంతా ఒట్టి కబుర్లు చెప్పేవారే. అంతా ఆవిణ్ణి మోసపుచ్చేవారే. అంతటితో ఆవిడకి మానవులయందు నమ్మకం పోయింది.

కాని—

ఈరోజున సుబ్బయ్యతో మాట్లాడింది.

నిజంగా నిజమైన స్నేహం ఉన్నదనే నిజమైన నమ్మకం నిజంగా కలిగింది ఆవిళ్లో.

ఆవిడకి స్నేహితులున్నారా?

లేరు! ఆవిడకి స్నేహితుల్లేరు. ఆవిడ ఎవ్వరికీ స్నేహితురాలు కాదు. ఆవిడ ఒంటిపిల్లి రాకాసి. నమ్మినవాళ్ళనందర్నీ ఆవిడ ద్రోహం చేస్తుంది. ఆవిడ ఒక గోముఖ వ్యాఘ్రం. స్త్రీరూపంలోఉండే రాక్షసి.

కాని—

ఈరోజున సుబ్బయ్య ఆవిడకెదురుట నిల్చేడు.

రాక్షసి చచ్చింది.

సహజ శాంతమూర్తి స్త్రీమూర్తి నిల్చింది.

ఆవిడ కన్యేనా?

అవును. కాదు.

ఆవిడకన్యేనా?

కాదు. అవును.

ఆవిడ అందం ఒక్క ముఖంలోనే ఉందా?

అవును.

ఆవిడ అందం ఒక్క ముఖంతోనే ఆగిపోయిందా?

లేదు.

నీకు తెలుసునా?

తెలుసు.

ఎలా తెలుసు?

నాకంటికి ఎక్స్‌రేస్ ఉన్నయ్.

అయితే ఆవిడ కన్య అవునో కాదో ఎందుకు తెలుసుకోలేవు?

నాకు తెలుసు నే.

నీకు తెలిసిన దేమిటి?

ఆవిడ కన్యకాని కన్య అనే విషయం నాకు తెలుసు.

నీకు పిచ్చెక్కింది. మతి చెడింది. వళ్లు తిప్పింది. తల తిరిగింది. కన్ను చెదిరింది.

ఆవిడే కన్యకాని కన్య.

నువ్వు నువ్వుకాని నువ్వు.

అర్థం ఉందా?

ఉంది. లేదు. ఉందికాని ఉంది. లేదుకాని లేదుంది దుందిలే...

"నిజంగా నాకు పిచ్చెత్తుతోంది"

అనుకున్నాడు సుబ్బయ్య ఆఫీసుకి నడుస్తూ.

పగలు పదిన్నరగంటలు దాటింది.

ఎండ జోరుగా ఉంది.

వేడి హెచ్చుగా ఉంది.

గాలి తక్కువగా ఉంది.

మోటారుకార్లు లేపిన దుమ్ము కిందికి రాలడం లేదు.

సదరుదుమ్ము ఇళ్ళల్లోకివస్తోంది; ముక్కుల్లోకి పోతోంది. బట్టల్ని అంటుతోంది. చెమటతో కలుస్తోంది.

ఆఫీసు చేరేసరికి పావుతక్కువ పదకొండయింది.

ఇంకా హెడ్ గుమాస్తా రాలేదు.

హెడ్ గుమాస్తాలు కొద్దిమంది వచ్చేరు.

సుబ్బయ్య తన కుర్చీకి కోటు తగిల్చి తన కుర్చీలో కూర్చున్నాడు.

వెధవాఫీసు!

ఈ వెధవ ఆఫీసులో నేను.

ఆ వెధవ స్కూల్లో ఆవిడ.

దూరదూరంగా ఉండీ ఒకే అవస్థలో ఉన్నాం.

ఎక్కడో ఎప్పుడో ఆవిడకీ నాకూ సంబంధం ఉంది.

అదంతా ఒక గుట్టు.

ఆమెకీ నాకూ ఈరోజువరకూ తెలియని గుట్టు.

ఈరోజు బైట పడింది.

నేనూ ఆవిడా.

ఆవిడా నేనూ.

ఆదినుండీ నాకోసమే ఉన్న ఆవిడ,

అనేక జన్మల్లో అనేక వేషాల్లో వస్తోంది.

ఈరోజు నల్ల చీరతో వచ్చింది.

రేపు......

"ఏదయ్యా సుబ్బన్నా, ముందు ఇలా ఓ సిగరెట్టిచ్చుకొని, తరువాత నే నడిగిన ప్రశ్నకి సమాధానం చెప్పు"

సుబ్బయ్య త్రుళ్లిపడ్డాడు.

ఎదురుగాఉన్న గడియారంలో పది నిమిషాలు తక్కువగా పదకొండయింది, చూసేవాళ్ళకి.

సుబ్బయ్య ఆరొక్క గడియారంవైపు చూడ లేదు.

సుబ్బయ్యకీ గడియారానికీ మధ్య అవధాని తాలూకు బట్టతల, మెల్లకన్ను, బండముక్కు, దాక నోరు వగైరాలన్నీ అడ్డొచ్చాయి.

సుబ్బయ్య ఇచ్చిన సిగరెట్టు సుబ్బయ్య ఇచ్చిన అగ్గిపుల్లతో అంటించి సుబ్బయ్యముఖంమీదకి పొగ వదుల్తూ అడిగేడు అవధాని.

"నిన్న మధ్యాహ్నం గవరయ్యతో ఏమిటోయ్ మాట్లాడుతున్నావూ?"

తెలివిలేని సుబ్బయ్యకి ఒక్కసారిగా తెలివొచ్చింది.

"ఏమిటి మాట్లాడుతున్నాను? ఎవరితో?"

"ఇప్పుడు నాతో మాట్లాడుతున్నావ్! ఇప్పటి సంగతి కాదు అడిగేది నేను. నిన్న గవరయ్యతో ఏమిటి మాట్లాడేవు?"

"ఏమీ మాట్లాడలేదే!"

అబద్ధం ఆడుతున్నాను.

ఎందుకు?

ఏమో! నాకు భయంగా ఉంది.

అవధాని దమ్ము లాగేడు. పొగ వదిలేడు.

"సుబ్బన్నా! నేనోమాట చెప్తా విను. ఈఆఫీసు మంచిది కాదు. ఆఫీస్ స్టాఫ్ మంచిది కాదు. హెడ్ క్లార్కు మంచివాడని వాడూ అనడు. నేనూ అనను. గవరయ్య అందర్నీ మించిపోయి వున్నాడు...ఇహ. నువ్వు చూస్తే ఓ వెర్రిపీరువి. అందుచేత, భాయీ! జాగ్రత్తగా మసులుకో. బోధపడిందా!"

సుబ్బయ్యకి సరిగ్గా బోధపడలేదు.

కాని అమితంగా భయం కలిగింది.

హెడ్ క్లార్కు...గవరయ్య...అయిదువందలు నేను...బిల్సు...అయిదువందలు ... గవరయ్య బిల్సు నేను...

భయం ఉప్పెనగా వచ్చి సుబ్బయ్యని ముంచేసింది.

అతని మనసులోంచి నల్లచీరావిడ సన్నసన్నగా వెనక్కిపోయింది.

నల్లచీరావిడ, వెనక్కి వెనక్కి తిరిగి తిరిగి చూడకుండా అదేపోవడం పోయింది.

నల్లగా, నల్లనల్లగా, కటికచీకట్లో, కారుమబ్బుల్లో సుబ్బయ్య...

హాబ్బా! ఈ సుబ్బయ్యకి గుండె నిబ్బరం పోయింది.

"జాగ్రత్తగా మసులుకో, బోధపడిందా?"

మెల్లకన్నుతో చూసి, సుబ్బయ్య భుజం తట్టి, తరువాత తనసీట్లో కూర్చున్నాడు అవధాని.

గోడమీద గడియారంలో పదకొండు గంటలయింది, చూసేవాళ్ళకి.

సుబ్బయ్య గడియారంవైపు చూడ్డంలేదు.

అతని కళ్ళు చీకట్లు కమ్మేయి.

అతనిగుండెలు అగాధంలోకి దిగిపోతున్నాయి. జారిపోతున్నాయి.

దిగజారిపోతున్నాయి.

## 5

ఆరోజున ఆఫీసులో ఏపనీ చెయ్యలేకపోయేడు సుబ్బయ్య.

లెక్కలు కూడుతూఉంటే అన్నీ తప్పులే వస్తున్నాయి.

పదహారు పైసలు...అణాపోతే...పన్నెండు పోతే...

అయిదువందలూ నాకోసం పుచ్చుకో లేదే!

పాపం, వెంకట్రావుకి అవసరంవచ్చి అడిగేడు.

మళ్ళీ గవరయ్యకి ఇచ్చెయ్యనూ!

వెంకట్రావు పెద్దమనిషి, జమీందార్ కొడుకు. గొప్ప వంశం.

తప్పకుండా ఇచ్చేస్తాడు.

పదహారు...అణాపోతే నాలుగు...ఒకటీ మూడు నాలుగూ పదిహేను పంథొమ్మిది...పదహారుపోతే మూడు...ఒకటీ నాలుగు అయిదూ నలభై నలభైఅయిదు వందలూ అయిదు...

"ఏం సుబ్బయ్యా! గవరయ్యబిల్సన్నీ పూర్తి చేసేవా?"

హెడ్‌క్లార్క్ కంఠం అది.

"ఏమిటండీ ఏమిటి?"

"గవరయ్య బిల్స్ చెకింగ్ పూర్తయిందా???"

హెడ్‌క్లార్క్ కర్కశ కంఠం అది.

"ఇంకా లేదండీ"

"నువ్వెక్కడ చేస్తావ్?! ఇంత వేగిరం అయిపోతే ఇంకేమి టుంటుంది నీకు...వర్క్"

సుబ్బయ్య గుండె బద్దలయిపోతోంది.

తప్పదు! బద్దలయిపోతోంది!

"ఇంకా వర్కు కొత్త కదండీ. కొంచెం ఆలస్యం అవుతుంది ఎలానూ మరి" అని అవధాని అన్నాడు.

"ఆ, అలా నేం! ఆలస్యం అవుతుందా? నాకు తెలుసునండీ అవధానిగారూ! ఇంకా ఆలస్యం అవుతుంది." అని వెటకారంగా నవ్వి, కొమ్ముడబ్బీలోంచి ముక్కుపొడుం తీసి ముక్కులోకి దట్టించేడు హెడ్ గుమాస్తా.

పదహారూ...పది...పదహారూ నాలుగు పదహారూ ఆరు పదహారూ ఎనిమిది పదహారూ...

సుబ్బయ్య తల బద్దలవుతోంది.

తప్పదు! సుబ్బయ్య తల బద్దలయిపోతోంది.

సుబ్బయ్య సాయంకాలం ఇంటికి వెళ్తూనే ఉన్నాడు.

రోడ్డుమీద పోయే జనం రోజూలాగ పోతూనే ఉన్నారు.

రోడ్డుమీద రోజూలాగ పోతూన్న సుబ్బయ్య తలలో జట్కాలు, రిక్షాలు, మోటార్లు, విమానాలు, రైళ్లు, పరిగెడుతున్నాయి. ఎగురుతున్నాయి. గుద్దుకొంటున్నాయి.

ఆఫీసుబెలుపల టీదుకాణం ప్రొప్రయిటరు ఎర్రగళ్ళ లుంగీ కట్టుకొని, బీడీ కాలుస్తూ 'టీ' కలుపుతున్నాడు. 'ఉడిపి' హోటేల్ ముందు ఎప్పుడూ మాసిని కొత్తకారు ఆగింది. 'ప్రేమ' సినీమాకి అందర్నీ పూర్ణాకి రమ్మని లౌడ్‌స్పీకర్స్ ఆహ్వానిస్తున్నాయి. ముగ్గురు పిల్లలూ, ఇద్దరు పెద్దవాళ్ళూ ఐస్‌ఫ్రూట్ తింటున్నారు. ఒక పిల్లడి మంచుముక్క మన్నులో పడింది. సైకిల్ విడించి ఒకడు పడబోయి పడలేదు. సిల్కుసూటు వేసుకున్న సప్లయ్‌ఆఫీసు గుమాస్తా రోడ్లోకి కాండ్రించి ఉమ్మేడు. కిళ్లీ దుకాణం దగ్గర నిల్చున్న అసామీ కాణీ లేద్దామా అర్ధణా వేద్దామా అని అరనిమిషం ఆలోచించి ముష్టివాడికి అర్ధణా వేసేడు కాణీ కనపడక. రాత్రివేళే కనిపించే సిల్కుజాకెట్టు పిల్ల లైట్‌హౌస్ వైపుకి సాయంకాలమే పయనం సాగించింది. సందుచివర్న రిక్షా పడిపోయింది. దెబ్బతగిలిన రిక్షావాడికి దెబ్బ తగలని పెద్దమనిషి డబ్బు లివ్వకుండా వెళిపోయేడు. బండీలో కూర్చొన్న బెంగాలీపిల్లవైపు కిరాణా కొట్టుదగ్గర కూర్చొన్న ఒడ్డిమంగలి నిగావేసి చూసేడు. బెంగాలీ పిల్ల కిళ్లీ నములుతూ షాపులోఉన్న రిబ్బన్లవైపు చూస్తోంది. "సరస్వతీ వాచకాలు ఎక్కడండీ దొరుకుతాయి" అని పదహారేళ్ల అమ్మాయి ఫస్ట్‌ఫారం తెలుగు పుస్తకం గురించి ఇంకొకర్ని అడుగుతోంది. "ఒక్క కాణీ ఇప్పించు నాయనా" అని పద్దులేని ముష్టివాడు వాణీ వేసుకొన్న సంగీతం మాస్టర్ని అడిగేడు. "ఒక రూపాయుంటే ఇద్దూ బావా" అని నీలిరవిక వేసుకొన్న వెలయాలు బొమ్మల పట్టు వేసుకొన్న విటకాణ్ణి సందు మలుపులో అడిగింది. "ముందు నాకో అర్ధరూపాయుంటే ఇయ్యి" అని ఆతిగాడు అర్జంటుగా అడిగేడు ఆమెని. జనబాహుళ్యాన్ని పక్కకి తప్పకోమని జట్కావాడు హెచ్చరిస్తున్నాడు.

సుబ్బయ్య పక్కకి తప్పుకున్నాడు.

బాధపడుతున్నాడు.

భయపడుతున్నాడు.

పక్కకి తప్పుకు పోవాలి.

ఎక్కడికైనా తప్పించుకుపోతే బావుణ్ణు.

"జాగ్రత్తగా మసులుకో"

అయినా నేనేం తప్పుచేశాను?
అయిదు వందలు అడిగేను.
అడిగి పుచ్చుకున్నాను.
బ్రైబ్! పబ్లిక్ సర్వెంట్!
"సుబ్బయ్య లంచం పుచ్చుకున్నాడు!!"

ఇంకా పక్కకి, ఇంకా వెనక్కి, ఇంకా వారకి, ఇంకా చాటుకి పోవాలి, తప్పుకుపోవాలి.

ఎవరలా ధీమాగా నడుస్తున్నారు?
అంతా ధీమాగానే నడుస్తున్నారు!

నేనుకూడా ధీమాగా, ధైర్యంగా ఉండగలిగితే...

నాకు ధైర్యంలేదు.
భయం, భయం, భయం.
హెడ్‌క్లార్కు చంపేస్తాడు.
పబ్లిక్ సర్వెంట్!
కోర్టుకెక్కితే జెయిల్!
జెయిలుకి పోతే...
ఇంకా వారకి, ఇంకా చాటుకి.
ఇంకా వారకి వస్తే
కాలవలో పడతాను.
సముద్రంలో పడతాను.
చస్తాను.
ఎవరలా దగ్గరగా వస్తున్నారు?
తెలిసిన మొహమే!
నావైపు చూడ్డంలేదు.
ఎందుకు చూస్తాడు?
నే నెవరికీ కనపడను.
నేను దాగుంటాను.
నేను చచ్చిపోతాను.
"జాగ్రత్తగా మసులుకో!!"
నే నే తప్పూ చెయ్యలేదే!
"నేనో మాట చెప్తా, విను"
వింటాను. తప్పక వింటాను.
"జాగ్రత్తగా మసులుకో!!"
సరే, సరే!...కాని...నే నే పొరపాటూ...
అయినా సరే, భయంమీద ఉండాలి.
జాగ్రత్తగా మసలాలి.
లేకపోతే—

ఉద్యోగం బర్తరఫ్!
పిమ్మట కారాగారవాసం తథ్యం!!
అమ్మో! అమ్మో!
ఎందుకలా నవ్వుతున్నారు?
'బాజారే తిరిగిచూచి పక్కున నవ్వేన'!
అంతా ఎందుకలా నవ్వుతున్నారు?
ఎందుకో? ఏమో?

అంతా నవ్వుతున్నారు. నవ్వుతారు. ఇంకా నవ్వుతారు!

గవరయ్య, రామస్వామికూడా నవ్వుతారు.
భయంకరంగా నవ్వుతారు.

జోరు జోరుగా నడిచి ఇంటికి చేరుకున్నాడు సుబ్బయ్య.

అరుగుమీద కూలబడ్డాడు.

సాయంత్రం ఆరుంపావయింది అప్పుడు.

కుడిచేతి కోటు చేత్తో ముఖంమీద చెమట తుడుచుకొంటూ ఉంటే కమల వెక్కి వెక్కి ఏడుస్తూ వీధి వరండాలోకి వచ్చింది.

"నాన్నా! అమ్మ...అమ్మ...సి...సినీమాకి వెళ్లింది నాన్నా!"

కమల కళ్ళంట కన్నీరు కారుతోందని చూడకుండా చూసేడు సుబ్బయ్య.

"ఆహాఁ!"

"నన్ను తీ...తీసుకు పో...ళ్ళ లేదు నాన్నా!"

"ఆహాఁ!"

"త...తమ్ముణ్ణి తీ...తీ...సుకు వెళ్లింది నాన్నా!"

"అయితే సరే"

"ఎప్పుడూ ఇంతే నాన్నా!"

కమలా కాంతుడు అస్తమిస్తున్నాడు.

కమలా కుమారి ఏడుస్తున్నది.

"ఎందుక్కమలా ఏడుస్తున్నావు?"

"నే చెప్పే దెప్పుడూ వి...వినవు నాన్నా! న న్నెవ్వరూ చూడ్రు నాన్నా! నే నెవ్వరికీ... హక్కర్లేదు నాన్నా!"

"ఏమిటమ్మా? ఎందుకూ ఏడుస్తున్నావ్?"

"అమ్మ తమ్ముడూ సినిమాకి వెళిపోయేరు నాన్నా"

అని బావురుమని ఏడ్చింది కమల.

అసందర్భంగా ఉంది! అసందర్భం! అసం దర్భం!

అంతా అసందర్భంగా ఉంది!

డబ్బు పుచ్చుకొన్న వెంకట్రావు దర్జాగానే ఉన్నాడు. పొడుం పీల్చే హెడ్ గుమాస్తా కంట్రాక్టర్ల దగ్గర డబ్బు పీల్చి ఇంకా దర్జాగా ఉన్నాడు. అడగ్గానే అయిదువంద లిచ్చేడు గవరయ్య. అవధాని నేనిచ్చిన సిగరెట్టు కాల్చి కాల్చి పారేశాడు. ఎదటింటి మాస్టరు టైఫాయిడ్‌తో బాధపడుతున్నాడు. పక్కింటి అమ్మాయి పోడాదుకాణం వాడితో సరసాలాడుతోంది. హార్బర్ ఇంజనీరు సరికొత్తకార్లో పందిలాంటి పాత పెళ్ళాన్ని ఊరేగిస్తున్నాడు. సావిత్రి "ప్రేమ" సినీమాకొక్కతే వెళ్లింది. ప్రేమ సినీమాకి వెళ్ళనందుకు కమల వెక్కి వెక్కి ఏడ్చి ఏడ్చి ఓక్క చచ్చి నిల్చుంది. నేను ఏడవలేక నోరుమూసుకూర్చున్నాను.

అంతా అసందర్భం! అసందర్భం!

అసందర్భంగా లేదూ?

"ఇదిగో! అర్ధణా పట్టుకు పోయి ఏమైనా కొనుక్కో! ఏడవకమ్మా!" అన్నాడు సుబ్బయ్య కూతుర్ని బుజ్జగిస్తూ.

"అక్కర్లేదు నాన్నా! నాకక్కర్లేదు. అయిదురూపాయ లిచ్చినా అక్కర్లేదు నాన్నా!..."

"అయిదు" శబ్దం నన్ను వదల్దు కాబోలు.

నేనేం తప్పుచేశాను భగవంతుడా!

"...అమ్మ నన్నెందుకు, నాన్నా, సినీమాకి తీసుకువెళ్ళక పోవాలి?"

ఏమో? ఎవడెరుగును? కారణం ఎవడికి తెలుసు? దేనికైనా సరే కారణం ఎవడు చెప్ప గలడు? సినీమాకి నిన్ను తీసుకువెళ్ళకపోతే నీకు ఏడుపెందుకు వచ్చింది? నవ్వెందుకు రాలేదు? అయిదువంద లడిగి నేనెందుకు భయపడాలి? గవరయ్య లక్షాధికారి ఎందుకవాలి? రామస్వామి పొడుం ఎందుకు పీల్చాలి? అవధాని తల బట్టతలగా ఎందుకు మారాలి? అసలీలోకం అంతా ఎందుకిలా ఉండాలి?

సుబ్బయ్యకి నవ్వొచ్చింది. ఏడుపూ వచ్చింది. కమల ఏడుస్తూనే ఉంది.

"ఎందుకమ్మా ఏడుస్తున్నావూ?"

అని అడిగినది సుబ్బయ్య కాదు.

అడిగిన దెవరు?

అడిగిన ఆసామీ అరుగుపక్క పొట్టిగా నిటారుగా నిల్చున్నాడు.

"ఎవరు నువ్వు"

అని అడిగినవాడు సుబ్బయ్య.

"నేనండి పోతన్నని. అయిదువందలూ నిన్న నే నేకదా పట్టుకువచ్చేను. మర్చిపోయేరా?"

అయిదు వందలు!!

అవునవును. అయిదువందలూ తెచ్చిన దితనే! గవరయ్య నౌకరు!!

భయం హెచ్చింది సుబ్బయ్యకి.

"మర్చిపోలేదు. మర్చిపోలేదు. చీకటిగా ఉంది కదూ. పోల్చుకోలేక పోయేను."

"చిత్తం"

సల్లగా, లావుగా, పొట్టిగా, సూదిముక్కుతో నిల్చున్న పోతన్న ఎందుకు వచ్చేడో తెలియక కలవరపడ్డాడు సుబ్బయ్య.

"ఏం...ఏం? ఇలా ఒచ్చేవ్?"

"ఇంటికి పోతున్నానండి. చిన్నమ్మగారు ఏడుస్తూ ఉంటే ఆగేను"

అంతేనా!!

"ఎందుకమ్మా ఏడుస్తున్నావ్?" అని కమల నుద్దేశించి మళ్ళీ అడిగేడు పోతన్న.

ఆ ప్రశ్నకి ఏడుపు కట్టేసి ఊరుకొంది కమల.

"దీన్ని వదిలేసి వాళ్ళమ్మా తమ్ముడూ సినీమాకి వెళిపోయేరు. అందుకూ ఏడుస్తోంది" అని సుబ్బయ్య సమాధానం చెప్పేడు.

పోతన్న నవ్వుతూ అడిగేడు కమలని; "పోనీ నాతో షికారు వస్తావా? చిన్నమ్మా"

కమల ముఖం వికసించింది.

"వెళ్తానన్నా!" అంది చేతులు ఊపుతూ.

"వెళ్ళు...కాని...ఎక్కడికి తీసుకువెళ్తావోయ్" అన్నాడు సుబ్బయ్య కొంచెం సందేహిస్తూ.

"రావమ్మా, వెళ్దాం" అని కమలని పిల్చేడు పోతన్న, సుబ్బయ్యకి జవా బివ్వకుండా.

"సరే వెళ్లు" అన్నాడు సుబ్బయ్య కమలతో.

కమల మెట్లు దిగి పోతన్న చెయ్యి పట్టుకొంది.

ఇద్దరూ చేతులు పట్టుకొని బజారువెంబడి పోతున్నారు.

"వేగిరం వచ్చెయ్యాలి సుమా" అని కేకవేసేడు సుబ్బయ్య.

అలాగే అన్నట్టుగా చెయ్యి వూపేడు పోతన్న.

సుబ్బయ్య ఆశ్చర్యపడ్డాడు. తనకి పోతన్నని చూస్తేనే భయం కలిగింది. కమల నిర్భయంగా అతనితో షికారు వెళ్తోంది, పిలవడమే తడవుగా.

కమలా పోతన్నా వెళ్ళిన తరువాత సుబ్బయ్య లేచి లోపలికి వెళ్ళి కోటు విప్పేడు. కాళ్ళు కడుక్కొని, తుడుచుకొని, దుస్తులు మార్చుకున్నాడు. తిరిగి వీధి వసారాలోకి వచ్చి మామూలు జాగాలో కూర్చుని సిగరెట్టు అంటించేడు.

ఏడుగంటలు దాటింది.

ఎదటివారింటికి డాక్టరు వచ్చి వెళ్తున్నాడు. అతను పొడుగ్గా ఆరోగ్యంగా ఉన్నాడు. చేతిలో చిన్న తోలుపెట్టె, మెడలో స్టెతోస్కోపు, నోట్లో సిగరెట్టు. వీటితో వీధిలోకి వచ్చి నిల్చున్నాడు. అతని వెనక అరడజనుమంది నిల్చున్నారు ఆందోళనతో. టైఫాయిడ్‌తో బాధపడుతూన్న మాస్టర్ గారి తమ్ముడితో "ఇహ ఫర్వాలేదు. *HE HAS TURNED THE CORNER*" అన్నాడు డాక్టరు నోట్లోంచి సిగరెట్టు తియ్యకుండానే.

మనుష్యులకి జబ్బు లెందుకు వస్తాయో? డాక్టర్లు చెప్పగలరా?

అనే విషయంగురించి ఆలోచించేడు సుబ్బయ్య.

ఎదటివారింటికి వచ్చిన డాక్టరు, ఎదటివారిచ్చిన ఫీజు పుచ్చుకొని ఎదటివారు రప్పించిన రిక్షా ఎక్కి వెళ్ళిపోయేడు.

తానుకూడా డాక్టరీ చదువుతే ఎంత బావుణ్ను!

వైద్యుల్ని అందరూ గౌరవిస్తారు. వాళ్ళని ఎక్కువగా చూస్తారు. వాళ్ళదగ్గర భయభక్తుల్తో ఉంటారు. వాళ్ళు చెప్పినట్టు నడుచుకుంటారు.

డాక్టర్లకి సంఘంలో మంచి మర్యాద.

నేను వైద్యం చదువుతే "డాక్టర్ సుబ్బయ్య" అని రాయించి బోర్డు పెట్టుకొందును.

వ్రాత ఇలా ఉండగా అలా ఎందుకవుతుంది?

నేనూ నా వెధవ ఆఫీసూ ఇలా ఉండవలసిందే అని చెప్పి మొదట్లోనే నిర్ణయం జరిగింది.

ఇలా ఏడవ్వలసిందే!

మొదట్లో డిస్పేచ్ సెక్షన్లో ఏడిచాను. ఇప్పుడు అకౌంట్సు సెక్షన్లో ఏడుస్తున్నాను. రేపు ఎక్కడ ఏడుస్తానో!

రేపట్నుంచీ జాగ్రత్తగా ఉండాలి.

అవధాని చెప్పినట్టు, జాగ్రత్తగా మసులుకోవాలి.

అయినా ఒకటి నా కర్థం కావడంలేదు.

నే నేతప్పూ చెయ్యలేదు. నా మనసు నిష్కల్మషంగా ఉంది. కాగా, నే నెందుకు భయపడాలి?

కాని నువ్వు నేరం చేశావని అంతా అంటారు.

వాళ్ళు చెప్పేమాటకే విలువ ఉంటుంది.

నీమాటా నామాటా ఎవడు నమ్ముతాడు?

అదీగాక రెండు ముఖ్యవిషయాలు నీకెరిగినవే!

ఏమిటవి?

గవరయ్య బిల్సు నీదగ్గరున్నాయి.

గవరయ్యవి అయిదువందల రూపాయలు నీదగ్గరున్నాయి.

సుబ్బయ్య కళ్ళు మూసుకున్నాడు.

లంచం! నేరం! శిక్ష! జెయిల్!

సుబ్బయ్య కళ్ళు తెరిచేడు.

దేవా! నాకు భయంగా ఉంది!

దేవా! నా కీ ఆలోచన్లు వద్దు!

నాకు మతిపోతోంది దేవదేవా!

బడిపిల్లలు లేటుగా ఇంటికి వెళ్తున్నాయి.

పరమేశ్వరా! నా కెందు కీభయం?

సొట్టకాలువాడు ఆలస్యంగా బజారుకి వస్తున్నాడు.

సర్వేశ్వరా! నే నేవిధమైన నేరమూ చెయ్యలేదే!

వయ్యారిభామ కొబ్బరికాయలతట్ట ఖాళీ చేసుకొని పోతోంది.

భగవాన్! ఏపాపమూ ఎరగన్నేను.

సిల్కు జాకెట్టుపిల్ల లైట్‌హౌస్‌నుంచి వచ్చేసిందే!

ఈశ్వరా! సర్వేశ్వరా!

అందర్లోకీ పాపాలభైరవుడు హెడ్‌క్లార్కు... ఎర్రచీరమనిషి...అవధాని పాపం......వెంకట్రావు

కోసం చేసేను...జమీన్దార్లు...పాడు రోజులు...ఎద
టింట్లోంచి దిగుతున్న దెవరు??

నల్లచీరావిడ కాదుకద!!

కాదు! కాదు! అయ్యయ్యో! కాదు!

నేనింత బాధల్లో ఉన్నానని ఆవిడ కేం తెలు
స్తుంది?

తెలిస్తే, పాపం! ఆవిడకూడా బాధపడుతుంది.

నాకు తెలుసు!

నన్ను చూస్తే ఆవిడకి జాలి.

పోయి ఆవిడ వెచ్చటివళ్లో పడుక్కుంటాను.

ఎంతో హాయిగా ఉంటుంది.

అరుగుమీద కూర్చున్న సుబ్బయ్య రాత్రి ఎని
మిదిన్నర గంటలవరకూ ఆలోచిస్తూ ఆరీతిగా నే
కూర్చున్నాడు. అవధాని ఆఫీసులో ఇచ్చిన హెచ్చ
రికతో అతనికి ఆందోళన, భయం కలిగి
ఆ విషయంగురించితప్ప ఇంకే ఆలోచనా లేకుండా
పోయింది. అందుచేతనే, లేచి ఇంట్లోకివెళ్ళి భోజనం
చెయ్యడానికి కూర్చొనేవరకూ కమలసంగతి జ్ఞాపకం
రాలే దతనికి.

అప్పుడు జ్ఞాపకం వచ్చింది.

ఇంకా కమల రాలేదే! కమల ఇంతవరకూ
రాలేదేం?

పోతన్నతో షికారు వెళ్ళిన కమల ఇంకా
ఎందుచేత రాలేదు? పిల్ల ఏమయిపోయింది? ఏమయి
పోయిందో ఏమిటో! వాడేం చేశాడో యేమిటో?

అన్నం వడ్డించుకోబోతూ వీధిలోకి వచ్చే
శాడు సుబ్బయ్య.

కనుచూపు మేరలో ఎక్కడా కనిపించలేదు
కమల.

సుబ్బయ్య ఇటూ అటూ తిరిగేడు. "మా
అమ్మాయి కనిపించిందా" అని తెలిసినవాళ్ళని అడి
గేడు. తెలియనివాళ్ళని అడగబోయి అడగడం
మానేశాడు.

తొమ్మిదిగంటలయినా కమల రాలేదు.

వాడేంచేశాడో ఏమిటో! ఒంటిని బంగారం
కూడా ఉంది! రెండుతులాలేఅయినా చేదా విషమా?

రెండుతులాలంటే ఈ రోజుల్లో రెండువందల
రూపాయలు. ఇంట్లో ఉన్నది దాని ఒంటిని ఎరక్క
పెట్టేను. ఎరక్క వాడితో పంపించేను. బంగారం
కోసం ఎంతమంది ఎన్ని ఘోర కృత్యాలు...

సుబ్బయ్య గడగడ వణికేడు.

నేరకపోయి పంపించేను.

ఎంత అమాయకంగా వెళ్ళింది వాడితో!

ఏందారి భగవంతుడా!

పిల్లని వెతకడానికి ఇంకా ముందుకి వెళ్ళడమా?
పోలీస్టేషన్కి వెనక్కి వెళ్ళడమా?

వెనక్కి వచ్చి ఇంటిదగ్గర కూలబడ్డాడు. అరుగు
మీద కూర్చొని ఆలోచించేడు.

పోతన్న వెంకట్రావుదగ్గర పనిచేసేడు కద!
తెలిసినవాడు వెంకట్రావుకి...దొంగలా కనిపించలేదే
మరి...కాని వెంకట్రావుదగ్గర ఇప్పుడు పని చెయ్యడం
లేదే...నమ్మకంలేకనే వెంకట్రావు మానిపించేశాడో
ఏమిటో...పిల్ల ఒంటిమీద బంగారం ఉంది...కానీ
ఎత్తు బంగారంకోసం ఎంతమంది చిన్న పిల్లల్ని
చంపెయ్యలేదు...చెమట చెమట...వెధవ చెమట...
వెంటనే పోలీస్టేషన్కి వెళ్లాలి...రిపోర్టిస్తాను...
సావిత్రి నన్ను చంపేస్తుంది ... వాడితో ఎందుకు
పంపించేవు...బుద్ధీ జ్ఞానం లేదు...తక్కువ వెధవల్తో
పిల్లని పంపిస్తావా...కాని వాడు గవరయ్యదగ్గిర పని
చేస్తున్నాడుకదా ... అయిదు వందలూ వాడే పట్టు
కొచ్చేడు...నమ్మకం లేకపోతే సొమ్ము వాడిచేతికి
ఇస్తాడా గవరయ్య...వాడు ఎగేస్తే ఎవ డడగ్గలడు
...అయిదువందలకి ఆశపడన్ది ఈ వెధవ రెండు తులా
లకీ ఆశపడతాడా...మొహం చూస్తే మంచివాళ్లాగే
ఉన్నాడు...బీచిని కూర్చొనుంటారు ... రేడియో
కూడా ఉంది......సినీమాకే పోయారో ... నేను
డబ్బివ్వలేదే...కొంతసేపు చూద్దాం...

ఇట్టే భయపడతాడు సుబ్బయ్య.

అంతలోనే భయం పోయిందనుకుంటాడు.

కమలగురించి "సరే కొంతసేపు చూద్దాం" అను
కున్నాడు.

సరిగ్గా మరో ముప్పావు గంటికి ఇంటిముందు
బండి ఆగింది.

సుబ్బయ్య గాభరాతో చూసేడు. చూస్తూండగా
గానే సావిత్రీ, క్రిష్ణుడూ బండీలోంచి దిగేరు.

"ఏదీ కమలేదీ" అని ఆత్రతతో అడిగేడు
వాళ్ళని.

"ఏమీ? ఇంట్లో లేదూ?" అని అడిగింది
సావిత్రి.

"నాన్నా! సినీమా ఎంతో బావుంది" అన్నాడు
క్రిష్ణుడు.

"అమ్మాయి కనిపించలేదా ఎక్కడా?"

నేరం చేసినవాళ్లాగ అడిగేడు సుబ్బయ్య సావిత్రిని.

"ఇంట్లో ఎందుకు లేదు?" అని ఎదురు ప్రశ్న వేసింది సావిత్రి మెట్లెక్కుతూ. ఆవిడ గాభరా పడుతోందో లేదో చెప్పడం కష్టం.

"ఇంట్లో లేదు. ఇందాట్లా పోతన్నతో వెళ్ళి ఇంకా రాలేదు"

క్రిష్టుడు ఇంట్లోకి రివ్వున పోయేడు. సావిత్రి మెట్లమీదే ఆగింది.

"పోతన్నెవడు?"

"గవరయ్య నౌఖరు"

"గవరయ్యెవడు?"

సావిత్రికి కనపర్చకుండా సుబ్బయ్య చిరాకు పడ్డాడు.

"అతనో కంట్రాక్టరు"

"వాడి నౌఖర్తో మనపిల్ల ఎందుకు వెళ్ళింది?"

"నేను పంపించేను"

"ఎందుకు పంపించేరు?"

"బుద్ధిలేక"

అని చెప్దామా అనుకొంటున్నాడు సుబ్బయ్య.

ఇంతలో ఇంటి ముందు సైకిల్ రిక్షా ఆగడం, అందులోంచి కమల గెంతడం, పోతన్న దిగడం జరిగేయి.

"అమ్మయ్యా! ఇదిగో పిల్ల!!" అన్నాడు సుబ్బయ్య.

"అమ్మా! నేనూ సినీమాకి వెళ్ళేనే" అంది కమల పట్టరాని సంతోషంతో.

"ఎందుకు వెళ్ళేవే????"

అతికోపంతో అడిగింది సావిత్రి.

కమల ఉత్సాహమంతా ఒక్కసారిగా చల్లారింది.

జవాబు లేకుండా నిల్చుండిపోయింది.

పెట్టెబండీ వెళ్ళింది.

సైకిల్ రిక్షా వెళ్ళింది.

"చిన్న పిల్లని ఇంటిదగ్గిర విడిచిపెట్టి మీరు సినీమాకెందుకువెళ్ళేరో ముందు చెప్పండి"

అని అడిగిన మొగవాడు కమల చెయ్యిపట్టుకు నిల్చున్నవాడు. అతడు పోతన్న.

సుబ్బయ్య నిర్ఘాంతపోయేడు.

సావిత్రి అంతకంటె నిర్ఘాంతపోయింది.

విస్తుపోయి, ఆశ్చర్యపడిపోయి, నిర్ఘాంతపోయింది.

ఒక్కక్షణంపోయాక "నువ్వెవడివి?" అని అడిగింది కోపతీవ్రతతో.

"నేను పోతన్ననండి" అన్నాడు పోతన్న.

"పిల్లని నువ్వేనా తీసుకు వెళ్లేవ్?"

"చిత్తం"

"ఎవర్నడిగి తీసుకెళ్ళేవ్?"

"బాబుగారు తీసుకువెళ్ళమన్నారండి"

"ఎవరా బాబు?"

"అదిగో ఆ బాబేనండి?"

తనేదైనా చెప్పవలసిన అవసరం కన్పించింది సుబ్బయ్యకి. గొంతుక సవరించుకున్నాడు. కాని నోటంట మాట రాలేదు, ఏమాట అనాలో తోచక.

సావిత్రికూడా ఆలోచిస్తోంది 'ఈనెధవకి ఎలా బుద్ధి చెప్పడమా' అని.

ఈలోపున పోతన్న అందుకున్నాడు.

"అమ్మా! మీరు పెద్దవారు. నేను మీకు చెప్ప తగ్గవాణ్ణికాను. కాని మీరు సినీమాలకి వెళ్ళి, చిన్న పిల్లని అలా వదిలెయ్యడం ఏమీ బాగులేదు. మీకున్న సరదా చిన్నపిల్ల కుండదా? ఇహామీద ఎప్పుడూ ఇలా చెయ్యకండి. ఏం?"

సావిత్రికక్కడా నోటంట మాట రాలేదు. అలాగే నిల్చుండిపోయింది మెట్లమీద.

తనభార్యకి పరాయివాడు బుద్ధి చెప్పడమేమిటి అని కోపగించుకోలేదు సుబ్బయ్య.

సావిత్రిలాంటి మనిషికి ఈ మనిషి ఎంత ధైర్యంగా బుద్ధిచెప్తున్నాడో అని ఆశ్చర్యపడ్డాడు.

ఆశ్చర్యపడ్డమేకాకుండా సంతోషించేడు.

ఆశ్చర్యం!!

సావిత్రి మాట్లాడలేకపోతోందే!!

"చిన్నమ్మా ఇంట్లోకి వెళ్ళు తల్లీ" అని కమలతో చెప్పి

"మరింక నేనొస్తానుబాబూ" అని వెళిపోయేడు పోతన్న.

సుబ్బయ్య సావిత్రివైపు చూసేడు.

సావిత్రి సుబ్బయ్యవైపు చూడలేదు.

"మొగుడు మొగాడు కాకపోతే ఆడదాని బతుకింతే" అన్నది ఇంట్లోకి వస్తూ, ఎవరితోనో అన్నట్టుగా.

సుబ్బయ్య ఇంట్లోకి వెళ్లడానికి భయపడ్డాడు.

## 6

తరువాతదినం సుబ్బయ్య ఆఫీసుకి కొంత ఆలస్యంగా వెళ్ళేడు. అప్పుడప్పుడు తప్పని సరిగా ఏదో పనివున్నప్పుడు ఆలస్యం అవుతూ వుంటుంది. అందుగురించి ఆఫీసర్లెవరూ అంతగా తప్పుపట్టరు. రోజూ ఆలస్యంగా వెళ్తే మాత్రం పంజాయిషీ అడుగుతారు.

మామూలుగా తన సీట్లోకి వెళ్తున్నాడు సుబ్బయ్య.

హెడ్ గుమాస్తా తనవైపు కొరకొర లాడుతూ చూడ్డం లేదు. తలవంచుకొని పోతున్నాడు.

సీట్లోకి వెళ్ళబోతూన్న మనిషిని రామస్వామి ఆపేడు.

"యూ కమ్ హియర్" అన్నాడు.

అతని కంఠం మృదువుగా లేదు.

సుబ్బయ్య, గదిమధ్యనున్న రామస్వామి 'సీటు' దగ్గరికి వెళ్ళేడు.

"ఎందుకు లేటుగా వచ్చేవ్?" అని సున్నితంగా కాకుండా అడిగేడు రామస్వామి.

"ఆలస్యం అయినందుకు క్షమించాలి సార్" అన్నాడు సుబ్బయ్య రుమాల్తో ముఖం తుడుచుకొంటూ.

ఆఫీసులో అంతా వారిద్దరివైపూ చూస్తున్నారు.

"ఆమాట వస్తూనే ఎందు కేడవకూడదు? పెద్ద ఆఫీసర్లాగ సీట్లోకి పోతున్నావే!"

ఎన్నడూ అనవసరంగా మాటపడని సుబ్బయ్య కొంతసేపు మాట్లాడలేక పోయేడు.

"క్షమించండి సార్, ఏదో మామూలుగా..."

"మామూలుగా, మామూలుగా, మామూలుగా! ఇదేపనయిపోతోంది నీకు. లేటుగా రాకూడదని ఎన్ని సార్లు నీతో చెప్పడం? ఏం? జీతం ఒట్టినే ఇస్తున్నా రనుకుంటున్నావా?"

రోజూ సరిగా వేళకే ఆఫీసుకి వస్తాడు సుబ్బయ్య. ఆదినం తెల్లవారి లేస్తూనే కమల కాలుకి దెబ్బతగుల్చుకొంది. ఆమెని ఆసుపత్రికి తీసుకువెళ్ళి రావడంలో కొంత ఆలస్యం అయింది.

"ఇవాళ ఏదో కొంచెం...కొంచెం ఆలస్యం అయిందండీ. రోజూ సరిగ్గా టైమ్‌కే వస్తున్నాను కదండీ...ఇవాళ మా అమ్మాయి..."

"ఏమా అమ్మాయి గిమ్మాయి! డోన్టాక్ రాట్! ప్రతిరోజూ లేటుగా ఒస్తావ్! అడిగితే ఇన్సొలెన్టుగా జవాబులు చెప్తావ్! ఏమిటనుకుంటున్నావు నీ మనసులోకి నువ్వు? గెజెటెడ్ ఆఫీసర్వా? ఐ. సి. యస్. ఆఫీసర్వా? ఆఫీసులో దమ్మిడీయెత్తు పని చెయ్యలేవు! ప్యూన్ వెంకన్నా ఈజ్ ఫార్ బెటర్ దేన్ యూ! కంట్రాక్టర్ల దగ్గరకి పోయి చెయ్యి చాచడానికి మాత్రం తయారు! టేక్కేర్! డిస్మిస్ అయిపోతావు!"

సుబ్బయ్య కేమీ అర్థం కావటంలేదు. అతనికి కంపం పుట్టుకొచ్చింది. హెడ్ గుమాస్తా తాలూకు మేజా పట్టుకొని నిల్చున్నాడు.

"డోన్ట్ లీన్ ఆన్ మై టేబిల్! గో టు యువర్ సీట్" అని అరిచేడు రామస్వామి.

అదే తడవుగా తన కుర్చీవైపుకి పోబోయేడు సుబ్బయ్య.

ఆ కుర్చీలో రామారావనే మరొకతను కూర్చున్నాడు.

గదిమధ్య గడబిడ పడుతూ నిల్చున్నాడు సుబ్బయ్య.

ఇంకా వణుకుతూనే ఉన్నాడు.

అంతా అతనివైపే చూస్తున్నారు, మాదుల్లాంటి చూపులతో.

"తమరి సీటు ఇవాళనుంచీ పాత సీటేనండి" అని వెటకారంగా నవ్వి మూలనున్న ఖాళీ కుర్చీ చూపించేడు రామస్వామి.

*DESPATCH!!!*

తిరిగి తపాలా బంట్రోతు నౌఖరీ!!

కుర్చీలో ఎలా వెళ్లి కూర్చున్నాడో సుబ్బయ్యకి తెలియదు. భారంగా వేడిగా ఉంది అతని తల. కూర్చున్నాడే కాని అతని కాళ్ళూ చేతులూ వణుకుతూనే ఉన్నాయి. తల వంచుకొని కూర్చున్నాడు. చుట్టూ తోడివాళ్ళవైపు చూడ్డానికి భయంగా ఉంది. సిగ్గుగా ఉంది.

"జాగ్రత్తగా మసులుకో" అని అవధాని అవడం, "ఏం సుబ్బయ్యా! గవరయ్య బిల్సన్నీ పూర్తిచేసేవా?...నువ్వెక్కడ చేస్తావ్" అని ముందు రోజు రామస్వామి అడిగి రిమార్కు చేయడం; పీటి

తోచే మతిపోయిన సుబ్బయ్యకి కుర్చీలో, పాత కుర్చీలో, కూర్చున్నప్పుడు మతి పూర్తిగా పోతున్నట్టుగా ఉంది.

"వీడు లంచం పుచ్చుకొన్నాడు" అని ఆఫీసర్‌తో చెప్పేసి ఉంటాడు రామస్వామి.

ఇహ నన్ను డిస్మిస్ చేస్తారు కాబోలు!

పరమేశ్వరా! నన్ను కాపాడు! కాపాడు!

అని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ కూర్చున్నాడు సుబ్బయ్య.

పన్నెండు గంటలయింది.

పన్నెండు గంటలు దాటింది.

"నమస్కారా లండోయ్!" అంటూనే గదిలోకి వచ్చేడు గవరయ్య.

"రండి, రండి" అన్నవాడు రామస్వామి.

తొందరగా కుర్చీ తెచ్చి వేసినవాడు వెంకన్న.

ఆ కుర్చీలో కూర్చున్నవాడు గవరయ్య.

"పుట్టగానే ఎందుకు చచ్చేను కాను?" అనుకొంటున్నవాడు సుబ్బయ్య.

గవరయ్య రాగానే కలిగిన భయంవల్ల బాధవల్ల, విచారంవల్ల, 'బెరర్' వల్ల సుబ్బయ్య కళ్ళంట నీళ్లు గిర్రున తిరిగేయి. ఏదీ వినకుండా ఎటూ చూడకుండా ఉష్ట్రపక్షిలా కూర్చున్నాడు.

మరొక పదినిమిషాలకి తలెత్తిచూసేడు.

అవధాని తనవైపు సూటిగా పక్కగా చూస్తూ "మరేం భయంలేదు" అన్నట్టు సంజ్ఞచేసేడు.

ఆపదలో ఉన్నవాళ్ళకి అవధాన్ని చూడగానే ధైర్యం కలుగుతుంది.

ఇంతలో గవరయ్య లేచేడు. వెనక్కి తిరిగేడు.

"నమస్కారా లండోయ్, సుబ్బయ్యగారూ" అని అన్నాక రామారావుని చూసేడు.

"ఓహో! రామారావుగారొచ్చేరే!"

"రండి! కూర్చోండి" అవలేదు రామారావు.

"అవునండీ, గవరయ్యగారూ! సుబ్బయ్యన్నాడే, చూసేరు కదూ, చాలా ఇనెఫిషెన్ట్‌గా ఉన్నాడు. అంచేత సీట్ ఛేంజ్ చేసేను" అన్నాడు రామస్వామి, పొడుం పీలుస్తూ.

"ఓహో! అలాగా, బాగానేఉంది...అయితే మరి సెలవ్! నే వెళ్లొస్తా"

గవరయ్య వెళ్ళేడు.

"ఏం సుబ్బయ్యా! ఏమిటి చూస్తున్నావు?" రామస్వామి అడిగేడు.

"నే... నే... నేనా?"

"అవును."

"ఏ ఏమీలేదండీ"

"ఏమీలేదండీ" అని వెక్కిరించేడు రామస్వామి.

ఆఫీసులో కొంతమంది నవ్వినట్లయింది.

"ముందు లెటర్సన్నీ డిస్పేచ్చెయ్! తరవాత యూ కెన్ టేక్ రెస్ట్!" అని రామస్వామి కసిరేడు.

పనిచెయ్యమంటున్నాడని గ్రహించేడు సుబ్బయ్య.

ఆరోజుకి ఎలాగైతే నేం పని తెముల్చుకున్నాడు. సాయంకాలం, ఎలా అయితే నేం, ఆఫీసులోంచి బైటపడ్డాడు.

చల్లగాలి పీల్చేడు.

మెల్లిగా కాళ్ళీడ్చుకొంటూ నడుస్తూఉంటే అవధానివచ్చి భుజంమీద చెయ్యివేసేడు.

"మరేం ఫర్వాలేదోయ్! సుబ్బన్నా! సీటు మారింది. అంతేనా? అంతకన్న వాడు నిన్నేం చెయ్యగల్డు?"

"నే చేసిన్నేరమేం లేదోయ్...మా వెంకట్రావు నెరుగుదువుకదా?" అని గద్గద స్వరంతో అన్నాడు సుబ్బయ్య.

"ఓ! ఎరక్కేం"

జరిగినదంతా చెప్పేడు సుబ్బయ్య.

"అయితే, అందులో నువ్వు కాణీ ఎరగవందూ! అంతా ఒట్టినే తెచ్చిపెట్టుకున్నావ్"

"అవునోయ్! ఇప్పుడంతా పీకలమీదకి వచ్చింది"

"నీమీదకి వచ్చే దేమిటుంది? ఏగుద్దూ రాదు!"

"అది కాదోయ్!......డి......డిస్మిస్‌లూ, కేసూ..."

అవధాని నవ్వేడు.

"నీకేం పిచ్చేమిటోయ్. సుబ్బన్నా. ఎవ్వడైనాసరే నీతలమీద వెంట్రుక తెంపలేడనుకో!"

"అయితే నాకేం ఫర్వాలేదంటావా?"

"ఏమీ ఫర్వాలేదయ్యా! రామస్వామిగాడేదో అన్నాడని భయపడుతున్నావేమిటి? అసందర్భం! నువ్వుకూడా వాళ్లాగే కక్కుర్తిపడుతున్నా

పని వెంటనే సీటు మార్చేసేను. అంతకన్న ఆ వెధవ గాని మరేవెధవ గాని చేసే దేమీ లేదు!"

అని సుబ్బయ్యకి ధైర్యం చెప్పి బట్టతలమీద పెట్టుకున్న టోపీ తీసి, ఒక్కసారి గుండు నిమురుకొని, మెల్లకన్నుతో అతనివైపు చూసేడు అవధాని.

సుబ్బయ్యకి కొద్దిగా ధైర్యం కలిగింది.

"నీలోఉన్న లోటుపా టేమిటంటే, ఓయ్ సుబ్బన్నా, నీకు నోటంట మాట సరిగా రాదోయ్. ఆ వెధవ అలా అరుస్తూఉంటే బెల్లం కొట్టినరాయిలా ఊరుకుంటావేం? నీ అనువుచూసి వాడెగిరేడు. వాడు షెడీ అన్నప్పుడు నువ్వు షెడీ అంటే, వెధవ, వచ్చినట్టు ఊరుకొన్నా. నేనయితే ఆ వెధవ పొడుంముక్కు పట్టుకొని సాగదీసేద్దును"

అవధాని అందర్నీ అలాగే అనెయ్‌గలడు.

ఆఖరిగా సుబ్బయ్యకి ధైర్యం చెప్పిన అవధాని దార్లో విడిపోయేడు. సుబ్బయ్య మెల్లగా ఇల్లు చేరుకున్నాడు.

ఇంటిమెట్లెక్కి నడవదాటి లోపలకి వెళ్ళి సుబ్బయ్యచూసిన దృశ్యం ఇది.

లోపల వరాండాలో సావిత్రి కుర్చీ వేసుక్కూర్చుంది. ఆవిడవెనక కుర్చీ పట్టుకొని చెరోపక్క కమలా క్రిష్ణుడూ నిల్చున్నారు. ఎదురుగా స్తంభానికి చేర్లబడి నేలమీద పోతన్న కూర్చున్నాడు.

పోతన్న ఏదో చెప్తున్నాడు. మిగతా ముగ్గురూ నవ్వుతున్నారు.

ముందురోజున జరిగిన ఘర్షణతో పోతన్నమీద మండిపడ్డానికి బదులు అతను చెప్పేది ఎదురుగా కూర్చొని సావిత్రి నవ్వుతూ వింటున్నందుకు సుబ్బయ్య కొంచెం ఆశ్చర్యపడ్డాడు.

సుబ్బయ్యని చూసి పోతన్న లేచి దండం పెట్టేడు.

ఆఫీసులో తిట్లు తిని ఇంటికివచ్చి దండం పెట్టించుకోడం కష్టమనిపించింది సుబ్బయ్యకి.

"కూర్చోవోయ్" అన్నాడు హీనస్వరంతో.

పోతన్న కూర్చున్నాడు.

"నాన్నా, నాన్నా; పోతన్నకి మంచి మంచి కథలు తెలుసున్నాన్నా" అన్నాది కమల ఎంతో సంతోషంతో.

"పోతన్న మన మావఁయ్యదగ్గిర పనిచేసేట్ట నాన్నా" అందువల్ల పోతన్నకూడా కొంత ఘనత అబ్బినట్టు చెప్పేడు క్రిష్ణుడు.

అదీ కారణం! అనుకున్నాడు సుబ్బయ్య.

తన అన్న తాలూకుమనిషి కాబట్టి ఆమనిషిలో ఎన్ని తప్పులున్నా క్షమిస్తుంది సావిత్రి.

పోతన్న చెప్పే కబుర్లు అంత ఖులాసాగా కూర్చొని వినడాని క్కారణం అది.

"సరేసరే" అనేశాడు కమలా క్రిష్ణులతో.

తిన్నగా గదిలోకిపోయి, దుస్తులు మార్చుకొని, కాళ్ళూ చేతులూ కడుక్కొని, తిరిగి వీధి వసారాలోకివచ్చి మామూలుస్థలంలో కూర్చున్నాడు. పోతన్నకూడా వసారాల్లోకి రావడం అతను గమనించలేదు.

పోతన్న మెల్లిగా పకిలించేడు.

"ఏం, పోతన్నా"

"మరేం లేదండి"

"ఏం? ఇలా ఒచ్చేవ్?"

"ఏంలేదండి. వెళ్లమంటే వచ్చేను"

"వెళ్లమంటే రావడ మేమిటోయ్?"

"గవరయ్య పంపించేడండి!"

ఎందుకో నాకు తెలుసు!

"గవరయ్య అడుగుతున్నాడండి"

అడిగేదేమిటో నాకు తెలుసు. అయినా—

"ఏమడుగుతున్నాడు?"

"అయిదువందలు ఎప్పుడిస్తామన్నారో అడగమన్నాడండి"

అవును! అదే! అవునవును! అదే! అదే!

గవరయ్య ఎలానూ అడుగుతాడు. అడగడామరి!

ఇప్పుడెలాగా అడుగుతాడు కచ్చితంగా!

ఎందు కడగడు?

ఇప్పుడు రామారావు చేతుల్లో ఉన్నాయి గవరయ్య బిల్సు.

సుబ్బయ్యేం చేస్తున్నాడు? ఏం చెయ్యగలడు.

తపాలా బంట్రోతు పని చెయ్యగలడు. చేస్తున్నాడు

అనకుండా ఊరుకొంటాడా గవరయ్య! అందులోనూ గవరయ్య!

సుబ్బయ్య పరపతిపోనే పోయింది.

నా పరపతివల్ల ఏదో ఘనకార్యం జరిగిందని పొంగిపోయేను.

నా పరపతి కాదది. అకౌంటున్న సీటుపరపతి.

ఈరోజు ఆసీట్లో ఆ పరపతిమీద రామారావు కూర్చున్నాడు.

ఈరోజునుంచీసుబ్బయ్య మామూలుసుబ్బయ్యే!

సుబ్బయ్యని ఈరోజు ఏది పనిస్తే అదే అడుగుతాడు, ఏమాట నోటికొస్తే అమాటే అంటాడు, ప్రతీవాడూ.

అడుగుతున్నాట్ట, గవరయ్య!!

"అయిదువందలూ ఎప్పుడిస్తామన్నారో అడగమన్నాడండి"

ఎప్పుడు? అయిదువందలూ ఎప్పుడిస్తాను?

"అతగాడికి అవసరంగా ఉందిటండి. అర్జెంటుగా జతపర్చమన్నాడు."

అయిదువందలూ అర్జంటుగా జతపర్చాలిట! ఎక్కణ్ణించి తెచ్చేది? ఎలా జతపర్చేది?

జతపర్చలేనే! వెంకట్రావే ఇవ్వకోవాలి... సొమ్ములేకే నాదగ్గిర కొచ్చేడు...ఇంత వేగిరం ఎలా ఇవ్వగలడు...

"గవరయ్యతో ఏం చెప్పమన్నారండి?"

"కొంత వ్యవధియిస్తే ఇచ్చేస్తాను"

వచ్చేసింది మాట!

ఇవ్వవనేస్తే ఎంత బావుణ్ణు!

ఇవ్వవనేస్తే ఏం చెయ్యగలడు గవరయ్య?

ఏంచెయ్యగలడా? ఏమైనా చెయ్యగలడు. గవరయ్యకోపంవస్తే ఏమైనా చెయ్యగలడు. అటువంటి మనిషితో పేచీలు పెట్టుకొని ప్రయోజనం లేదు. సాఫీగాపోతే నయం.

"సరేలెండి. అరిగాడితో అలా చెప్తా"

మళ్ళీ కంట చూస్తావనే, ఇచ్చెడాసొమ్ము! లేదే! అటువంటప్పుడు ఇస్తానన్నందుకే సంతోషిస్తాడు. ఇచ్చేస్తాను. ఎప్పుడో ఒకప్పుడు ఇచ్చేస్తాను. రాదని విడిచిపెట్టుకున్న సొమ్ము ఎప్పుడు వస్తేనేం అనుకుంటాడు. చనువంటే అట్టే లేదుగాని మర్యాదా తెలిసినమనిషే

ఈలోపున వెంకట్రావు ఎడంచేత్తో పారేస్తాడు.

పోతన్న గభీమని అన్నాడు.

"గవరయ్య దొంగముండాకొడుకండి"

పోతన్నిలా అంటున్నాడేం??

"వాడిదగ్గిరెవ్వడూ డబ్బు పుచ్చుకోకండి"

ఒకసారయింది చాలు. కాని, పోతన్న ఇలా అన్నాడేం?

"వాడు పేచీకోరుమనిషండి"

పోతన్న ఇలా చెప్తున్నాడెందుచేత?

సుబ్బయ్యకి వింతగా ఉంది.

రాత్రి చీకటిగా ఉంది.

పోతన్న వెళ్ళేడు. అరే! ఎప్పుడువెళ్ళిపోయేడు? తల నొప్పిగా ఉంది ... జ్వరం కానివచ్చిందా ... హాయిగా ఎక్కడకైనాపోయి విశ్రాంతి తీసుకుంటే బావుణ్ణు:.....హాయిగా ఎక్కడకైనాపోయి పడుక్కుంటే బావుంటుంది...కష్టసుఖాలకి దూరంగా పోతే హాయిగా ఉంటుంది...ఎవరైనా వచ్చి చల్లటి చెయ్యి నుదుటిమీద వేస్తే.... ఎవరికొక్కాలి నా వెధవ బాధలు...కళ్ళు మూసుకున్నా ఓలాగే ఉంది...కళ్ళు తెరుచుకున్నా ఓలాగేఉంది...నల్లగా నల్లనల్లగా... భయమేస్తోంది...నల్లచీరావిడ...ఏదీ...వస్తేబావుణ్ణు ...టైమెంత...గడియారం ఆగిపోయిందా...పాపం ...నే ఒస్తానుండండి...'కీ' యివ్వనా...ఇప్పుడు ...ఎలా ఉంది...హాయిగాఉందా ... నుదుటిమీద చెయ్యి వెయ్యనా ... ఇలా పడుకోండి నావళ్ళో అయ్యో అలా ఉన్నారేం......ఎంత నీరసంగా ఉన్నారో...ఆకలి వేస్తోందా...

ఉలిక్కిపడి కళ్ళు తెరిచేడు సుబ్బయ్య.

ఆకలిగా ఉంది. బాగా ఆకలిగా ఉంది.

ఈరోజు ఇంత ఆకలి వేస్తోందే—ఎందుచేత? లేచినపుడు ఒళ్ళు జోగిం దతనికి. భోజనం చేస్తున్నప్పుడే నిద్రవచ్చింది. అలసటతో వళ్ళెరక్కుండా నిద్రపోయేడారాత్రి.

జరిగినదంతా కలా నిజమా అనుకున్నాడు మర్నాడు నిద్రలేచి. పక్కమీద కూర్చొని ఒక్కటొక్కటే జ్ఞాపకం తెచ్చుకున్నాడు. ఒకొక్క విషయం సర్తుకు రావడంతో తిరిగి కంపం పుట్టుకొచ్చింది. ఆరోజు ఆఫీసుకి వెళ్ళడానికే భయపడ్డాడు.

కాని, ఆలస్యం అవుతుందేమోనని తొమ్మిదిన్నరకే బయల్దేరేడు. ఆఫీసు చేరేసరికి ఇంకా గేటు తలుపులే తెరవలేదు. సిగరెట్టు కాలుస్తూ గేటుదగ్గర నిల్చొని దిక్కులు చూస్తున్నాడు.

రిక్షాలో ఎవరో వస్తున్నారు.

ఎక్కడో చూసినట్టుగా గుర్తు. జోరుగా పోతోందే రిక్షా.

ఎవరు చెప్మా? ఎవరావిడ?

నామతిమండినట్టుగానే ఉంది. ఆవిడే! అయ్యబాబోయ్ ఆవిడే!

నల్లచీరావిడే!!

ఇవాళ తెల్లచీర కట్టుకొంది.

చెయ్యి ఊపుతోంది!!

ఎవర్ని చూసి???!!

చుట్టుపక్కల ఎవరూ లేరే!

విధవ తెలివి! విధవ తెలివి!

నన్ను చూసే సంజ్ఞ చేస్తోంది!!

హోయ్‌హోయ్! నన్ను చూసే హాసం చేస్తోంది!

పలకరిస్తోంది!!

అయ్యబాబోయ్ వెళిపోతోంది.

నన్ను చూసి నవ్వుతూ, ఎంతో ముద్దుగా నవ్వుతూ నన్ను నన్నే పలకరించింది!!

ఆనందంలో నీరసంగా నిల్చున్నాడు, గేటుకి చేరాబడి. అతనికళ్ళంట ఆనందబాష్పాలు రాలేయి. త్రుటికాలం స్వర్గంలో ఉన్నాడు.

ఇంతలో ఆఫీసు తలుపులు తెరిచేరు.

తిరిగి భూమ్మీద సుభ్భేల్ మని పడ్డాడు.

"నరకానికి గేటు తెరిచేరు" అనుకున్నాడు మనసులో.

తలవంచుకొని ఆఫీసులోకి వెళ్ళేడు.

తలవంచుకొని ఆఫీసులోంచి వచ్చేడు.

అలా వెళ్తూ వస్తున్నాడు.

గవరయ్యకూడా ఆఫీసుకి వస్తూ వెస్తున్నాడు. కాని సుబ్బయ్యతో మాట్లాడ్డంలేదు, ఆఫీసులో అందర్నీ పలకరించినట్టుగా తప్ప. ఏభోగట్టా అతను ఎత్తకపోడం చూసి ఇహ ఫరవాలేదనుకున్నాడు సుబ్బయ్య. ఏదో మాటవరసకి అడిగేడేమో! లేక అంత తొందరగా లేదో! తొందరగా ఉంటే మళ్ళీ అడగడా? ఈలోపున వెంకట్రావుని మెల్లిగా అడగొచ్చు. వెంకట్రావు చిరాకుపడతాడు. కొంచెం చిరాకు జాస్తీ అతనికి. సరే, మెల్లిగా ఏదో ఒహాటి చెయ్యొచ్చును. వెధవది! ఇదే జ్ఞాపకమా గవరయ్యకి! లక్షాధికారి. లక్షసమ్మంటాయి. లక్షలమీద వ్యాపారం చేస్తున్నాడు. అయిదువందలంటే ఏపాటి! మర్చిపోయుంటాడేమో. లేకపోయినా అంత తొందర లేదు.

ఈరీతిగా ఈవిషయంగురించే సుబ్బయ్య ఆలోచిస్తూ ఒకరోజు ఉదయం బజారుకి వెస్తున్నాడు.

వెస్తూవుంటే ఎర్రటికారు అతనిపక్క ఆగింది.

పక్కకి తప్పుకో బోయేడు.

కార్లోంచి ఎవరో అతని రెబ్బపట్టుకున్నారు.

కారు కిటికీదగ్గర నల్లటి మీసాలు, బంగారపు 'ఫ్రేం' కళ్ళద్దాలు.

గవరయ్య!!

'ఏ...ఏమండోయ్...గ...గవరయ్యగారూ'

"పలకరింపులు, మర్యాదలూ అటుంచి అసల్సంగతి చెప్పవోయ్! డబ్బివ్వ దల్చుకోలేదేంటి?"

గడ గడ గడ గడ.

ఉన్న పనులమాట మర్చిపోయి చాలామంది చోద్యం చూస్తున్నారు.

"అబ్బే! అబ్బే"

"అబ్బే గిబ్బే! ఆఖరికి బెబ్బెబ్బే అనేటున్నావు. నాదగ్గిర వేషాలు పనికిరావు తెలుసా! వీడు గవరయ్యని తెలుసుకో! మర్యాదాగా పట్టుకెళ్ళిన సొమ్ము మర్యాదాగా ఇచ్చెయ్! టోపీ వేద్దామనుకున్నావా, తొక్కలోస్తాను"

"చిత్తం! చిత్తం! సరే సరే!!"

"సొమ్మిచ్చేసి గౌరవం దక్కించుకో"

"చిత్తం చిత్తం! కొ కొద్దిగా టైం ఇప్పించండి"

"పదిరోజులే గడువు! ఈ లోపున ఇవ్వక పోయావా చూసుకో తమాషా"

గవరయ్య మీసాలు దువ్వుకొంటూ ఉండగా, సుబ్బయ్య చెమట తుడుచుకొంటూ ఉండగా ఎర్రగా ఉండే మోటారు కారు పరుగుతీసింది.

పదిహేనుమంది చుట్టూ మూగి అడుగుతున్నారు. అంటున్నారు.

"ఏమిటండీ అయింది?"; "ఏమిటడుగుతున్నాడండీ?";

"తన్నబోయేట్ట"; "ఎవన్ని?"; "గవరయ్యలా ఉన్నాడు"; "గవరయ్యే"; "లెంపకాయిచ్చుకున్నాడు"; "నోటంట రక్తం కారుతోంది";

"ఏ ఊరుకున్నాడా?"; "ఏమండీ ఏమిటీ దెబ్బలాట?"

పదిహేనుమంది పాతికమందయేరు.

గాభరాలో, సిగ్గుతో, అవమానంతో బజార్లోకి పరుగెత్తేడు సుబ్బయ్య.

అశ్రద్ధ పనికిరాదు. అశ్రద్ధ పనికిరాదు.

వెంకట్రావే శరణ్యం. శరణ్యం.

వెళ్ళాలి. అతనిదగ్గరకి వేగిరం వెళ్ళాలి.

అదిగో! వెంకట్రావే!!

అదృష్టం! అదృష్టం!

భగవంతుడుడికి నమస్కారం చేసి వెంకట్రావుని పలకరించి జరిగిన సంగతి టూకీగా చెప్పేడు సుబ్బయ్య. వెంకట్రావు చిరాకుపడ్డాడు.

"నువ్వు చేతకాని చచ్చు పెద్దమ్మ వోయ్ బావా''

అతనలా అన్నందుకు సుబ్బయ్య నొచ్చుకో లేదు.

"ఆ సొమ్మెలాగైనా వాయిందు దయుంచి జతపర్చాలోయ్'' అన్నాడు దీనంగా.

ఎటో చూస్తూ ఆలోచించేడు వెంకట్రావు.

ఎవర్నయినా సరే మోసపుచ్చడానికి వెంకట్రావు సాధారణంగా వెనకతియ్యడు.

''జాలి'' అనే పదం చాలాకాలం క్రితం మర్చిపోయేడతను.

కాని ఆరోజు.

చిరిగిన కాలర్ గల చొక్కాతో, భుజాన్న గూరల సంచితో కళ్ళల్లో నీళ్ళతో నిల్చున్న చెల్లెలి పెనిమిటిని చూసి కొంత జాలిపడ్డాడు.

"సరే! వారం పదిరోజుల్లో చూస్తాన్లే. ఈలోపున ఎల్లుండోసారి కనిపించు''

వెంకట్రావు రెండు చేతులూ పట్టుకున్నాడు సుబ్బయ్య.

## 7

మెయిన్‌రోడ్డులోంచి సందులోకి మళ్ళగానే దక్షిణంవైపు కనిపించే రెండో ఇల్లే వెంకట్రావుది. "ఆ యిల్లే వెంకట్రావుది" అంటే అర్థం అది అతని స్వంతం అని కాదు.

అతను అన్నివిధాలా అది తన ఇల్లులాగే వ్యవహరిస్తాడు.

అంటే, అందులో అద్దెకి ఉన్నాడతను.

మెయిన్‌రోడ్డులోంచి సందులోకి రాగానే కనిపిస్తుందా యిల్లు.

ఆ యింటి డాబాజాలునుండి వేళ్ళాడే 'బోర్డు' కూడా స్పష్టంగా కనిపిస్తుంది.

ఆకుపచ్చబోర్డుమీద "వెంకట్రావ్, ఇంజనీర్ అండ్ కంట్రాక్టర్" అని ఇంగ్లీషులో వ్రాసిన లాటికాయలం జేసి నీలి అక్షరాలు ఇంకా స్పష్టంగా కనిపిస్తాయి. (ఇంజనీర్ అండ్ కంట్రాక్టర్ అంటే ఇంజనీరు కాదు, కాని చాలా పెద్ద కంట్రాక్టరు అని అర్థం) రాత్రి ఎనిమిది గంటలకి అటువైపు వస్తూన్న సుబ్బయ్య, ఆ యింటిని గాని, ఇంటికి వేళ్ళాడే ఆకుపచ్చరంగు బోర్డుని గాని, లాటికాయలం జేసి వున్న నీలి అక్షరాలని గాని గమనించలేదు.

వస్తూనే అతను చూసినది వీధి అరుగుమీద కూర్చున్న వెంకట్రావునే. అత దితర్జారాత్రేని మిది గంటల సమయంలో చూసి "హమ్మయ్య"అని నిట్టూర్చేడు. ఎదురుగా అరుగుమీద కూర్చున్నవాణ్ణి చూసి ఏడుకొండలవాణ్ణి చూసినంతగా సంతోషించేడు. వెంకట్రావుని చూడగానే అనేకమందికి సంతోషం కలుగకపోవచ్చును. కాని సుబ్బయ్యకి మాత్రం ఆ రాత్రి సంతోషం కలిగింది.

ఆరోజు వెంకట్రావింటికి సుబ్బయ్య రావడం అది మూడోసారి.

"ఎల్లుండోసారి కన్పించు" అని వెంకట్రావు చెప్పిన ప్రకారం సుబ్బయ్య వెళ్తే అతను ఇంట్లో లేడు. ఆరీతిగా వరసగా రెండుమూడురోజులు వెళ్ళేడు. తరువాత రెండుదినాలు ఆగి తిరిగి అతనింటికి వెళ్ళినా వెంకట్రావు ఒక్కసారి కనిపించ లేదు. ఎన్నిసార్లు వెళ్ళినా "వీధిలోకి వెళ్ళే"రన్న మాటే వినవచ్చింది.

ఆ రోజుకూడా మొదటిసారి వెళ్ళినప్పుడు "ఇంట్లో లేరు" అనే సమాధానంవచ్చింది పిలవగా, పిలగా. రెండవసారి వెళ్లినప్పుడు వెంకట్రావు ఊళ్ళోనే లేడన్నారు.

ఇంటికి ఎప్పుడు వెళ్లినా "ఇంట్లో లేరు", "ఎక్కడకో వెళ్ళేరు", "ఎప్పుడు వస్తారో తెలీదు" అనే మాటలే వినవస్తూండడంచేత, వెంకట్రావు ఇంట్లో ఉండే లేడనిపించుకొంటున్నాడేమోనని సుబ్బయ్యకి చిన్న అనుమానం కలిగి గట్టి నమ్మకంగా మారింది. ఒకరోజు "ఎక్కడికో వెళ్ళేరు" అనే మామూలు సమాధానం వచ్చినా "సరే, వచ్చేదాకా వెయిట్ చేస్తాం" అని అక్కడే గుమ్మంలో కూర్చున్నాడు. వెంకట్రావు ఎంతకీరాడే! ఎంత పనిమీద ఎక్కడికి వెళ్ళినా ఇంత ఆలస్యం అవదుగదా అనుకున్నాడు సుబ్బయ్య.

తలుపుతట్టి దమాయించి వెంకట్రావింట్లోకి వెళ్ళడానికి సుబ్బయ్యకి ధైర్యంలేదు. ఎప్పుడైనా అతనాహ్వానిస్తే అతని గుమ్మంలో అడుగు పెట్టడమే గాని లేనప్పుడు బైటనిల్చోవలసిందే. లోపలికి వెంకట్రావు ఆహ్వానంమీద వెళ్ళినా అతనెక్కడ కూర్చోపెడితే ఆ గదిలో అలా కూర్చోడమే కాని ఇంట్లో చనువుగా తిరగడానికి వీల్లేదు.

“నా అనుమతి లేకుండా నా యింట్లో అడుగు పెట్టడానికి ఎంతమాత్రం వీలులేదు.”

అని వెంకట్రావు ఎన్నడూ సుబ్బయ్యతో చెప్పలేదు. కాని అతని అనుమతి లేందే అతని గుమ్మం దాటడానికి సుబ్బయ్య భయపడతాడు.

అందుచేతే వెంకట్రావు ఉన్నాడని తెలిసినా ఇంట్లోకి వెళ్ళలేకపోవడం, వీధి అరుగుమీద పడిగాపులు కాయటం జరుగుతూ వచ్చింది.

ఆ రోజు ప్రొద్దుట రెండవపారి వెళ్లినప్పుడు కూడా ఇంట్లోంచి మామూలుమాటే వినవచ్చింది.

“ఎక్కడికో వెళ్ళేరండీ!” అని మృదువుగా శ్రావ్యంగా వచ్చిందది మాట.

ఆవిణ్ణి ఎప్పుడూ చూడకపోయినా ఆమాట అంత మృదువుగా చెప్పిన వ్యక్తి వెంకట్రావు ఉంపుడుగత్తెని సుబ్బయ్యకి తెలుసు.

“మీ బావమరిది చక్కటి మనిషిని జాగ్రత్త చేసేడయ్యా” అని అతన్తో అనేకులు అన్నారు. ఇంత బావుంటుంది, అంత బావుంటుంది అని అనుకోగా వినడమే గాని సుబ్బయ్యెప్పుడూ చూడ్డం తటస్థించలేదు. కాని, ఆవిడ చెప్పలేనంత అందంగా ఉంటుందని సుబ్బయ్య మనసులో బాగా నాటిపోయింది.

“ఇంతటి అపురూప సౌందర్యవతి, ఇంత మృదుమధుర కంఠంతో ఎంత సులభంగా అబద్ధం చెప్తోంది!”

అని సుబ్బయ్య ఆశ్చర్యపోయేడు.

విచారించేడు.

“ఆడవాళ్లు ఎంతకైనా సమర్థులు” అనుకున్నాడు ఒక్కక్షణం.

కాని ఆవిడ తనంతటతాను బుద్ధిపూర్వకంగా అబద్ధమాడిందనుకోడం సుబ్బయ్యకిష్టంలేదు.

వెంకట్రావు చెప్పమన్నప్పుడు, పాపం, అలా చెప్పక తప్పుతుందా!

అందమైన ఆడమనిషి. బుద్ధిపూర్వకంగా తప్పు చేసిందనుకోడం సుబ్బయ్యకి ఎంతమాత్రమూ ఇష్టం లేదు.

ఉంచుకున్నాడు! పోషిస్తున్నాడు!

ఎలా చెయ్యమంటే అలా చెయ్యాలి.

పాపం! ఈవిణ్ణనవలసిన పనేమీ లేదు.

అని సమాధానపర్చుకున్నాడు.

ఇంట్లో లేడని వినగానే సుబ్బయ్య వెనక్కిపోవడం జరుగుతూ వచ్చింది. మరొక ప్రశ్న వెయ్యడం లేదతను. క్రాస్ పరీక్ష చేద్దామనే తలంపే లేదతనికి.

అవతలమనిషి చెప్పేది అబద్ధం అని తెలిసినప్పుడు ఇవతలమనిషికి కలిగే సుపీరియారిటీవల్లనో, లేక కోమలాంగి కోమలగాత్రం అయినా విందామనే ఆసక్తిచేతనో గాని సుబ్బయ్య ఆరోజు రెండవపారి వచ్చినప్పుడు వెంటనే వెళ్ళిపోకుండా,

“ఎక్కడికి వెళ్ళేరండీ?”

అని అడిగ్గలిగేడు.

చెప్పిన భోగట్టా విని వెళ్ళడమే గాని ఎదురు ప్రశ్న వేసే అలవాటులేని సుబ్బయ్య ఆరీతిగా అడిగినందువల్ల కలిగిన ఆశ్చర్యంచేతనో, మరెందుచేతనో గాని లోనుంచి సమాధానం ఆలస్యంగా వచ్చింది.

“ఏమిటో చెప్పమంటారు?” అని వెంకట్రావు నడిగివుంటుంది. అందుకే జవాబు రావడం ఆలస్యమవుతోంది.

ఇంతలోనే, కంటికి కనిపించని బంగారు తీగల్తో అల్లుకున్నాయి మాటలు.

“ఊరికి వెళ్ళేరండీ!”

అబద్ధం! అబద్ధం!

అబద్ధంచెప్పి నవ్వుతోందా?!

నవ్వు ఆపుకోంటున్నట్టుగా ఉందే!!

నవ్వుతూ అబద్ధాలాడే ఈవిడ ఎలా ఉంటుందో! ఎలా ఉంటుంది? నాకు తెలుసు!! మేనకలా ఉంటుంది. రవివర్మ బొమ్మ చూసేను కదూ! అలాగే సరిగ్గా అలాగే ఉంటుంది. మెత్తటి పరుపుమీద తెల్లచీర కట్టుకొని తమలపాకులు నముల్తూ కూర్చునుంటుంది. ఆమె అందాన్ని కళ్లతో తాగుతూ, చేతుల్తో తాకుతూ పక్కనే వెంకట్రావు! అదృష్టవంతుడు! ఇద్దరూ హాయిగా ఉండగా మధ్య పానకంలో పుడకలా నా కర్కశ కంఠం. విను

కుంటూ "ఎక్కడకో వెళ్ళేరు" అనేసింది మామూలుగా. "ఎక్కడ కెళ్ళేరు" అని నే నడుగుతానని అనుకొనివుండరు. విసుక్కోదూ, పాపం, మరి! అనవసరంగా చిరాకు కలిగించే నావిడకి. నే చెప్పేదూ ఇంతే! కాని ఏంచేసేది? అడక్క తప్పదే మరి.

తెల్లటి చీరతో నల్లటి కురుల్తో, మృదువైన వంపులు తిరిగిన వళ్ళంతా వెంకట్రావుకి ఆమె అప్ప చెప్తూ ఉండగా తను వేసిన "వెధవ ప్రశ్న"కి తన కళ్ళెదుట ఆమె విసుక్కుంటున్నట్టు తోచింది సుబ్బయ్యకి.

'నోరు జారేక ఏం చేస్తాం' అనుకున్నాడు.

జవాబు చెప్పడానికి అతని సలహా అడిగింది. కళ్ళల్లో పడుతూన్న ఆమె పొడుగాటి జుత్తు ఓ పక్కకి తోస్తూ "ఊళ్ళోలేవని చెప్పి తోలేద్దూ" అనుంటాడు వెంకట్రావు. సలహా విని "అంత అబద్ధం ఆడమంటారా" అని నవ్వుతూ అతణ్ని ముద్దులాడింది.

ముద్దాడుతూ నవ్వింది!

నవ్వాపుకొంటూ ఆమాట అందకేసింది.

"ఊరికి వెళ్ళేరండి!"

ఉప్పెనగా వస్తూన్న నవ్వు ఆపుకొందికి తెగ ప్రయత్నం చేస్తోంది, అనుకున్నాడు సుబ్బయ్య.

ఆడవాళ్ళ హేళనకి మొగవాళ్ళకు కలిగే బాధ సుబ్బయ్యకూడా కలిగింది.

ఉదయం తొమ్మిదిగంటలకి ఎండ చురుగ్గా ఉన్నది. సందులోకి జర్ మని చప్పుడుచేస్తూ 'జీప్' ఒకటి తిరిగింది. 'జర్'మని చప్పుడుచేసుకొంటూ పోయింది. పక్కింట్లో ఎవడో పిల్లడు ఏడుస్తున్నాడు. ఎదటింట్లో ఎవరో యాభయ్యేళ్ళ వితంతువు పద్దెనిమిదేళ్ళ కన్యతో కూరగాయలబేరం చేస్తోంది. చేసి ఇంట్లోకి వెళ్ళింది. కూరగాయలమ్మే పిల్ల తట్టసర్దుకొని సుబ్బయ్యవైపు సూటిగా చూసింది.

"నన్నో వెర్రివెధవనిచేసి నవ్వుకుంటున్నారు" అని బాధపడ్డాడు సుబ్బయ్య.

ఎండ చురచురమంటోంది. పక్కింట్లో పిల్లడు ఏడుపు ఆపేసి ఒక్కసారిగా నవ్వడం ప్రారంభించేడు.

"నవ్వుతున్నారు నన్ను చూసి."

కూరలమ్మే కన్య సుబ్బయ్యవైపు చూస్తోంది సూటిగా. సుబ్బయ్య ఆ పిల్లవైపు చూసేడు, కాని ఆమె ముఖం వికృతంగా ఉందనిగాని, ఆమె శరీరం యవ్వనపు బిగిలో ఆకర్షణీయంగా ఉందనిగాని చూడలేదు.

"ఇదికూడా నన్ను చూసి నవ్వుతోందా?" అని చూసేడు.

కూరలు కొనిపించడానికి 'ప్రిలిమినరీ'గా ఆమె సుబ్బయ్యని చూసి చిన్న చిరునవ్వు పారేసింది.

"ఇదికూడా నవ్వుతోంది!"

అంతా నవ్వుతున్నారు!

నన్ను చూసి అంతా నవ్వుతున్నారు.

నన్నో వెర్రివెధవనిచేసి అంతా నన్ను చూసి నవ్వాపుకోలేకుండా ఉన్నారు.

పోతాను. ఇంటికి పోతాను.

మెల్లిగా ఇంటికి నడకసాగించేడు సుబ్బయ్య. రెండుమైళ్లు నడిచివచ్చేడు. రెండుమైళ్ళు నడిచి వస్తున్నాడు. రెండవసారి ఆరోజు అలా వెళ్ళడం.

రెండవపర్యాయం ఇంటికి పోతున్నప్పుడు మూడోసారి మళ్ళీవద్దామనే కృతనిశ్చయంతో వెళ్ళేడు, సుబ్బయ్య.

ఊళ్ళోనే, ఇంట్లోనే ఉండి లేననిపించుకొంటున్నాడు వెంకట్రావు.

నన్ను గుమ్మంలోంచే గెంటేస్తున్నాడు.

కొంపతీసి దగాచెయ్యడు కద?!

దగాచేసేడంటే చస్తాను.

బాబోయ్! చస్తాను!

ఇవాళ ఎలాగయినాసరే అతణ్ణి కలుసుకోవాలి.

లేకపోతే కొంపమునుగుతుంది.

ఆఫీసులో ఆరోజు.

"ఏమయ్యా, సుబ్బయ్యా! ఒంట్లో బాగు లేదా?" అని రామస్వామి అడిగేడు.

"అబ్బెబ్బే! లేదండీ! బాగానే ఉంది."

గవరయ్య వచ్చి వెళిపోయేడు.

సుబ్బయ్యవైపు చూడనే లేదు.

సుబ్బయ్య వంట్లో గాభరాగా ఉంది. జ్వరం లేకపోయినా వళ్ళంతా వేడిగా ఉంది. కాయితాలు మడత పెట్టబోతూవుంటే చేతులు వణికేయి. కలంతో రాయబోతే వేళ్ళు టొంకర్లుపోయేయి.

కొంపతీసి దగాచెయ్యడు కద!!

పక్కనే కూర్చొన్న టైపిస్టు ఎడతెరిపి లేకుండా టైపు కొడుతున్నాడు.

టప్‌టప్ టపటప్ టపటపటప్, టప్‌టప్ టపటప్.

ఛస్తాను, ఛస్తాను.

చచ్చేదాకా చావు బాజాలాగ పీకు పైపు కొడుతూనే ఉంటాడు కాబోలు.

హబ్బబ్బా! నరకబాధ! ఛస్తున్నాను.

"అన్నిటికన్నా ముందు ఈ ఉత్తరం పంపించెయ్ మన్నారు దొరగారు" అని ఆఫీస్ ప్యూన్ వెంకన్న ఓ ఉత్తరం పట్టుకొచ్చేడు.

"ఏదయ్యా సుబ్బన్నా ఓ సిగరెట్టిలా ఇచ్చుకో" అన్నాడు అవధాని.

పైపెట్టు బాదేస్తూనే ఉన్నాడు.

'పోర్టికో'లో కూర్చున్న పేచుజుత్తు డ్రైవరు బీడీకి ఆఖరి పీల్చిచ్చేడు.

రామస్వామి ఆరోజుకి యాభైరెండోసారి పొడుం పీల్చేడు.

చస్తాను, దగా చేస్తే!

వెంకట్రావు వెలాగైనా కలుసుకోవాలి.

కలుసుకొని సంగతేదో తేల్చుకోవాలి.

తనమనిషి తరహాగా లేదు వెంకట్రావు ప్రవర్తన.

ఏమీ తనమనిషి తరహాగా లేదు.

ఇంట్లో ఉండే ఆవిడచేత అబద్ధాలాడించేడు.

(ఎంత ఇంపుగా చెప్పింది!! పాపం, ఆవిడ తప్పేమీ లేదు.)

వ్యవహారం చూస్తే ఏమీ బావుండడంలేదు.

ముఖాముఖీ మాట్లాడి వ్యవహారం ఫైసలు చెయ్యాలి.

ఇంట్లో లేడంటే ఈసారి తలుపు తియ్యమంటాను, అనుకొని ఆరాత్రి ఇంటినుంచి బయల్దేరేడు సుబ్బయ్య.

మెయిన్‌రోడ్డులోంచి ఆరాత్రి ఎనిమిదిగంటల సమయంలో సందులోకి వస్తూనే అరుగుమీద కూర్చొన్న వెంకట్రావుని చూసి ఇంట్లో ఉన్నాడు కదా అని సంతోషించేడు సుబ్బయ్య.

"హమ్మయ్య!" అని నిట్టూర్చేడు.

ఊరికీ వెళ్ళలేదు. గిరికీ వెళ్ళలేదు. నేను మొదట్నించీ అనుకొంటూనే ఉన్నాను అని సంతోషించడమే కాకుండా గర్వించేడు.

అంత పచ్చిఅబద్ధాలు, (మళ్ళని పాపం ఆ పేనకచేత), చెప్పించినందుకు వెంకట్రావు కొంచెం సిగ్గుపడి తనతో మాట్లాడ్డానికి మొహమాట పడతాడేమో అనుకున్నాడు. అందుచేత అడుగు జోరుగా వేసేడు. సిగరెట్టొకటి తీసి అక్కడే వెలిగించేడు. చిన్న చిరునవ్వు నవ్వేననుకొన్నాడు. అరుగుమీద కూర్చున్నాడు.

సుబ్బయ్యవచ్చినందుకు వెంట్రావు సంతోషం ప్రకటించలేదు. రమ్మని ఆహ్వానించలేదు. రాకకి కారణం అడగలేదు. "ఎప్పుడూ ఈమధ్య కనిపించలేదే! ఏమిటి విశేషాలు?" అనే మామూలు మాటలైనా అనలేదు.

రెండోమనిషి లేనట్టుగా, ఎటో చూస్తూ చుట్ట కాలుస్తూ కూర్చున్నాడు కాలుమీద కాలువేసుకొని.

సుబ్బయ్య సంతోషం చచ్చిపోయింది.

గర్వం అణగారిపోయింది.

సిగరెట్టు ఆరిపోయింది.

వెంకట్రావు చుట్ట తెగజోరుగా వెలుగుతోంది.

ఆరోజు రాత్రి ఎనిమిదిగంటల అయిదు నిమిషాల సమయంలో, సుబ్బయ్య సిగరెట్టు ఆరింది.

వెంకట్రావు పొగచుట్ట వెలిగింది.

ధీమాగా కాలుతున్న పొగచుట్టలాగ వెంకట్రావు ధీమాగా కూర్చొని ఉండగా సుబ్బయ్య సంతోషం వెలుగు వెలిగి ఆర్పు ఆరింది.

సుబ్బయ్య ఎందుకొచ్చేడో వెంకట్రావుకి తెలుసు.

వెంకట్రావుకి తెలుసనని సుబ్బయ్యకి తెలుసు.

తనకి తెలుసునని సుబ్బయ్యకి తెలుసునని వెంకట్రావుకి తెలుసు.

అది సుబ్బయ్యకి తెలుసు.........

తెలిసిన ఇద్దరూ తెలియనట్టుగా కూర్చున్నారు.

సుబ్బయ్య కంగారుపడుతున్నాడు. గాభరా పడుతున్నాడు. ఆందోళనపడుతున్నాడు. బెంగ పెట్టుకుంటున్నాడు. బాధపడుతున్నాడు. భయపడుతున్నాడు.

దగా చెయ్యడుకద! దగా చెయ్యడుకద!!
వెంకట్రావు దగా చెయ్యడుకద!!!
"అయ్యయ్యో! చేస్తాడయ్యా చేస్తాడు!!
వెంకట్రావు దగా చేస్తాడు!!!"

అని ఎవరో చాటుతున్నారు.

డప్పులు కొట్టించేరు. బాజాలు వాయించేరు. భీషణ శంఖాలు పూరించేరు. భీకరగర్జన గర్జించేరు. మదగజంలా ఘీంకారం చేసేరు.

అన్నీ చేసి చెప్పేరు! చెప్పేశారు!! చెప్పి పారేశారు!!!

వెంకట్రావు తప్పక దగా చేస్తాడు!!!!

వెంకట్రావు చెయ్యకపోతే ఇంకెవరు చేస్తారు???

సుబ్బయ్యా! చూస్తావుకదూ!

వెంకట్రావు చేస్తాడుకదా!

చూస్తావుగదా!

అతివిదగా!

తడిలేని గొంతుకతో రెండు పొడి ముక్కలు మాట్లాడేడు సుబ్బయ్య.

"ఇదిగో, ఒచ్చేను"

"అవును, చూసేను"

ఇంకేమనడం? ఖోగట్టా ఎలా ఎత్తడం? లోపల్నుంచి మేనక వింటోందో ఏమిటో! ఇతణ్ణి డబ్బడుగుతే ఆవిడ బెంగ పెట్టుకుంటుందో ఏమో! ఇతనియందు మక్కువతో ఉంది. నన్ను తిడుతుంది. ఏడుస్తుంది. ఆ ఉసురంతా నాకు తగుల్తుంది.

ఛాఛా!

ఆమె ఉసురు నాకు తగల్డమేమిటి! అసంభవం! కాని ఎలా అడగడం? ఏమనడం?

"ఊరికి వెళ్ళేరన్నారు, ఇందాట్లా వస్తే"

అయ్యయ్యో! చేరకపోయి అనేశాను! ఆవిడ నొచ్చుకొంటుందికద!

"ఆహాఁ! అయితే?"

ఏమీ లేదు.

"అయితే?"

"ఏమీ లేదు! ఊరికెళ్ళేరన్నారని ఊరికే అన్నాను" ఊరుకోకుండా!

మధ్యాహ్నపు మండుటెండలో కాలిన అరుగు, రాత్రయినా ఇంకా కాల్తానే ఉంది.

కూర్చుందికి ఎంతమాత్రం సుఖంగా లేదు.

ఎంతసేపు ఇలా కూర్చోడం?

వొచ్చిన పనేమిటి?

నన్ను రమ్మన్నాడే ఆరోజు బజార్లో కనపడి వప్పుకు!

మరి ఇప్పుడు మాట్లాడ్డేం?

మాట్లాడ్డే!!

నేనే మాట్లాడాలి.

అవసరం వచ్చినప్పుడు అడక్కపోతే లంపటమంతా నా మెడకి చుట్టుకొంటుంది.

వచ్చేన్నా, భగవంతుడా,

"చెల్లెమ్మా, చిన్నపిల్లలా నీకోసం కాదు కూర్చుంటారోయ్! లేటవుతూంది!"

వెంకట్రావు లేచి నిల్చున్నాడు.

అయ్యయ్యో! వెళిపోతున్నాడు ఇంట్లోకి!

"ఇదిగో, చూడుచూడు. ఆ విషయంసరించి వచ్చేనోయ్"

"ఏ విషయం?"

"అదేనోయ్! ఆవిషయం! మొన్నా...ఈమధ్య...ఆ రోజు ఇచ్చేస్తానన్నావు కదూ?"

"ఎన్నిసార్లు చెప్పినా నీ నసుగుడు మానవు! ఏమిటో అనుకున్నాను. స్పష్టంగా చెప్పకూడదూ ఆ సంగతేనని. అయితే ఇంతకీ ఏమంటావిప్పుడు?"

"వాడు తొందర చేస్తున్నాడు"

"ఆ వెధవ తొందరచేస్తే దేవేంద్రుడు తొందర చేసినట్టు చెప్తున్నావేమిటి!?"

"కాదోయ్ బాబూ! నన్నొదలకుండా ఉన్నాడోయ్"

"ఒదలకపోతే తొక్కలోల్చెయ్"

"అతనే నాని ఒల్చేస్తానంటున్నాడు"

"నీ అనువుమానీ ఏమైనా అంటాడా వెధవ! ...అయినా అయామ్ సారీ! అరనిమిషంలో ఇప్పుడు ఎక్కణ్ణించి తెస్తాను! నాల్రోజు లాగమను"

"ఆగనంటున్నాడు! ఏమిటిసాధనం?"

"ఆక్కపోతే చావమను, ఉరేసుకొని. ఆక్కపోతే ఇవ్వనే ఇవ్వనని చెప్పు. దిక్కున్న వాడితో చెప్పుకోమను."

అయ్యయ్యో! అనుకున్నట్టుగానే చేస్తున్నాడే!

"మరింక నువ్వు ఇంటికి వెళ్ళు"

వెళ్ళేడు, పోయేడు, వెళ్ళిపోయేడు.

వెళ్ళగానే అడుగుతుంది మేనక.

"పోయేడా లేదా" అని.

"పోయేడు"

"హమ్మయ్య" అని అతనిచుట్టూ మెత్తటి చేతులువేసి కౌగలించుకొంటుంది.

హుబ్బా! నాకు బాధగా ఉంది.

కాని చేసేదేముంది?

ఇంక పోవాలి. ఇంటికి పోవాలి.

కథల్లో కష్టాలుపడే సినీమా హీరోలాగ నడుచుకొంటూ ఆరాత్రి వెళ్ళేడు సుబ్బయ్య.

"నా దగ్గిర డబ్బుంటే ఇచ్చెయ్యనూ! లేన్దే ఏంచెయ్యడం? అయినా, అంత పసవలా ఉంటే ఎలా? కాస్త గట్టిగా ఆ వెధవతో కొన్నాళ్ళపాటు ఆగితే అను. లేకపోతే నీకు డబ్బా ఇవ్వను. గాడిద గుడ్డూ ఇవ్వను. దిక్కున్నవాడితో చెప్పుకో అంటే వాడు చచ్చినట్టు నోరుమూసుకుంటాడు. మా బావ ఒట్టి వంగిరి పింగిరిగాడు. అందులోనూ గవరయ్యగాణ్ణి చూస్తే ఎందుకో భయం! ఛహ్" అని ఇంట్లో వెంకట్రావు విసుక్కున్నాడు.

(సశేషం)








# తల్లి దీవన



శ్రీ చల్లా లక్ష్మీనారాయణశాస్త్రి




★

(యుద్ధమున కేగుచు వచ్చి నమస్కరించిన ఖడ్గతిక్కన్నను తల్లి ప్రోలమ్మ దీవించి పంపించిన సందర్భము)

వచ్చి నమస్కరించి సెల
　వా జననీ! యెఱగడ్డపాటికిం
జొచ్చి రణంబు సల్ప నయ
　శూన్యుని గాటమరాజు ద్రుంచి, సం
పచ్చయపారవంతము భ
　వత్పదయుగ్మముఁగొల్వ నీసుతుల్
జెచ్చెరఁ బంపుమంచు నిలి
　చెన్ రణతిక్కన తల్లి చెంగటన్.

నిలిచి ప్రియమ్మెలర్పఁగ వి
　నీతిఁ గరాంజలిఁబట్టి వేడు సు
ద్గుల పసికూన వట్టె కను
　దోయిట వెల్లువలొచుఁ బ్రేమవ
త్సల తల కివ్వి పాత్రులవఁ
　జారెడు వత్రులఁ జేవివల్చి వి
చ్చలవిడిఁ గ్రుచ్చి కౌఁగిలిడి
　సమ్మతిఁ దల్లి వచించె నిట్టులన్.

అనుకొన్నంత ఘటించెనోయి పని
　కూనా! యుద్ధమున్ సాపరిం
చెను గా — కాటమరాజుతోడ నిఁక నా
　జిన్ శత్రులన్ గెండి — నీ
వనుమానింపక భార్గవుండవయి మా
　కానందమున్ గూర్చి త
ల్లిని పేరున్ గనినట్టి రేణుకగ నే
　లీలన్ ననున్ జేసెదో.

ఇఁక నీతండ్రిని జామదగ్ని పితగా
　నీవెంచి మాయన్న! రే
ణుకగా నన్ దలపోయుమయ్య దిశలం
　దున్ గీర్తి చెంపొంద శ్రే
నికి మోసం బొనరింపకింతయును దం
　డ్రీ! కార్తవీర్యార్జునిన్
వికలున్ జేసిన భార్గవుండవయి గ
　ర్వీన్ శత్రు నిర్జింపుమా.

అనిలో నీ కెవఁ డడ్డువచ్చెడిని ఘా
　లాత్ముండవై యొప్పి కా
రణ జన్ముండవటంచు లోకులనఁ
　బుత్రా! నీవు నీ ఖడ్గ తి
క్కన నామమ్ము జగమ్మునన్ నిలుప
　శౌర్యంబున్ దగన్ జూపి ధం
సన పాండిత్యఫలమ్ము కీర్తి ధనమున్
　దారాకణమున్ జూపుమా.

తల్లికిఁ దండ్రికిన్ హితము
　దార్చు సుతుండు సుతుండుగాని దా
సెల్లవిధంబులన్ బితల
　కెగ్గదలంచెడువాఁడుఁ బుత్రుఁడే!

పిల్లలు జెల్లలున్ గలిగి
పెంపు వహించు చెదల్ దమంతఁదా
మెల్ల నశించిపోవు తుద
కెట్టులో యూరును పేరు లేకిలన్.

తాము సృష్టించినట్టి నందనుఁడు దల్లి
దండ్రులకు నెగ్గు దలపఁగా దలపడు నెడఁ
గొడుకువాఁ డెట్టులౌను దుండుడుకు గాని
తల్లి గొడ్డాలు, దండ్రి పుత్రవిరహితుఁడు.

అని చివాలున ఖడ్గతిక్కన్న కటిని
వ్రేలు యొరనుండి హుమ్మని వాలుదూసి
తన కరమ్మున గ్రుచ్చి రక్తమ్ముదీసి
విజయతిలకమ్ము దీర్చె నవ్వీరునుదుట.

అవల ఖడ్గమిచ్చి తన
యా! యిదె ఖడ్గమునంది స్వీయ దే
శావిధి మాతృదేవతే యొ
సంగిన భీకర ఖడ్గమందుఁ బ్ర
జ్ఞావిధి తల్లి సేవ రత
చండికకై బలిగా నొసంగి నా
శే విధి వీరమాతృ పద
మీవిడి తల్లికొంతఁ దీర్చుమా

తన జనయిత్రి యివ్విధిను
దంబున దీవనలిచ్చి ఖడ్గపు
త్రినిగయిసేసి గ్రక్కున వ
రిన్ ఛెగటార్చి జయేందిరామణిన్
గొని తనవెంత నిల్వుమనె
నో యన నీయ—మహో ప్రసాదమం
చనిగొని ఖడ్గతిక్కన ద్రి
యమ్మునఁ గన్నులకద్ది యిట్లనున్

ఎన్నడు లేని తేజమది
యేమొ శరీరములోనఁ జొచ్చె—న
న్నన్ని దిశాల నుండి జన
నీ! పులినోటఁ బురాణవాక్యముల్

విన్నది లేదు—కన్నదియు
లేదు—వచింతు వినన్ గదమ్మ—నా
కున్నది మాతృదేవత స
ముజ్జ్వల తేజ మమోఘ రక్తమై.

ఆ తేజంబిడె నొక్క పుత్రునకు నీ
వన్నట్టి యిల్లాలు—లో
కాతీత ప్రతిభుండు భార్గవుడు గాఁ
గా నామె ప్రఖ్యాతయై
ఖ్యాతిన్ గాంచెను వీరమాతయయి
లోకంబందు — బ్రజ్ఞావిధిన్
నీతిశ్లాఘ్య పరాయణత్వమున — నా
నిన్ మించెదన్ నీకృపన్

లేపకు దైవముండెనని
లేకుర బోవిడిచే చెరించు నే
వాపరతంత్రుఁ డట్టులని
వార్యత దైవమునమ్మి గాలిలో
దీపము పెట్టి దైవము! ప
దింబది నీఁకుది భారమంచు వి
జ్ఞాపన సేవి వేడుకొను
నా పను గావని నమ్మ మమ్మరో!

కదుకడిఁ బోఁవగా వలయుఁ
గాటము జేని వశింప నాజికిన్
దడవిదియేల బంపుము — ము
దమ్మున నేఁ జని వైరి ద్రుంచి నీ
యడుగుల యాన దిగ్విజయ
మంది పరాసరి వెమ్మెగమ్మ నీ
యడుగుల మోపి — తెల్పి ప్రమ
దాశ్రులఁ — జేసెద వీరమాతగా

అని పదముల వ్రాలిన తి
క్కన నటు లేవంగనెత్తి గారవమలరన్
"జని క్షేమమ్మున — లాభ
మ్మున ర"మ్మని పంచెఁదల్లి ముద్దుల తనయున్.

# చాళుక్య చోళులు ★

శ్రీ భావరాజు వేంకటకృష్ణరావు

## ౧. కులోత్తుంగ రాజేంద్రచోడుడు (క్రీ. శ.



★

(గత సంచిక తరువాయి)

వీరచోడుడు రెండవసారి వేంగీశ్వరుడైవచ్చి క్రీ. శ. 1089—1092 వ సంవత్సరములమధ్య (శ. 1011—1014) యించుమించుగా నాలుగేండ్లు రాజ్యమును పాలించెను. ఆకాలమునాటివి ఆ రాజేంద్రుడిచ్చిన దానశాసనములు మాత్రము లభించెను. అతడు సమస్త భువనాశ్రయుడన్న బిరుదము ధరించియు తన తండ్రి, తాతముత్తాతలవలె, "సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజాధిరాజ రాజ పరమేశ్వర పరమ భట్టారక, పరమ బ్రహ్మణ్యాది" రాజచాళుక్యాన్వయ పారమేష్ఠిత్వ సూచకములయిన బిరుదు వాక్యములతో వేంగీ మహీమహా సామ్రాజ్యమును సంరక్షించెను. అతడొసగిన దానశాసనములలో మొదటిది, చక్రవర్తి విజయరాజ్యవర్షములు 21 వ యేట శ. 1013 అగు (క్రీ. శ. 1091). సంవత్సరమునందు ఆజ్ఞాపింపబడిన చెల్లూరు తామ్రశాసనము1. వీరచోడుని బ్రాహ్మణ దండనాయకులలో ముద్గల గోత్రుడయిన మేడమార్యుడొకడు. మేడమార్యుని తండ్రి పోతన. అతడు రాజరాజనరేంద్రుని వలన గుణాధికుడని గుణజ్ఞుడని స్తుతింపబడి రాజరాజ బ్రహ్మమహారాజని బిరుదు నామముతో సన్మానింపబడెను. పోతనకు పుణ్యనిధియైన కన్నమాంబ భార్యయయ్యెను. ఆ దంపతులకు మేడమార్యుడను తనయుడుదయించెను. అతడు సత్యత్యాగపరాక్రమాది సమస్త గుణములు కలవాడు. 2 శ్రుతివిధి కృతయాగాచారపరుడు, ధీరుడు, నిశితమతి, బ్రహ్మవంశప్రదీపుడు, నయవినయనిధి, శాస్త్రశస్త్రప్రవీణుడు,

---

1. *SII. Vol. I No. 39. p. 49.* ఈ క్రింది శ్లోకములు దానమును తెలుపుచున్నవి.

22. 'మునీంద్రో ముద్గలో నామ క్షీరోద ఇవ చంద్రమాః.'

24 ........................................

జిష్ణో ర్విజయశో ధామ్నా ద్యోతయన్ పోతనాహ్వయః|

25 గుణాధికో గుణజ్ఞేన రాజారాజాధిపేన యః|
రాజరాజ బ్రహ్మమహారాజనామ్నా స్తుతో ముదా||

56 తస్య పుణ్యనిధేః పత్నీ కన్నమాంబా జగన్నుతా

........................................

27 సుతమివ వసుదేవాద్దేవకీ వాసుదేవం గుహమివ గిరికన్యా నందనం చంద్రమౌళేః|
అథ తనయ మసూత శ్రీనిధిం సాచ తస్మాదఖిల విబుధ సంఘైః ఈడిత మేడమార్యమ్||

2. శ్లో 30
ధీరో నిత్యమరక్తో దృఢనిశితమతి
బ్రహ్మవంశ ప్రదీపో
లక్ష్మీభూరిద్ధ తేజా నయ వినయనిధి
శ్శాస్త్రశస్త్ర ప్రవీణః
మాన్యః శైలేంద్ర సారస్థిర ఇతిమయా
సాదరం సప్రసాదం
సైనాపత్యేషిక్తో వహతి జనముదే
పట్టమారోపితం యః
శుశ్రూషయా గురుజనం ధృతి దేవలోకం దానేన
బంధుజనం ఇష్టఫలేన శిష్టాన్|
యో మామ్మదీయ నిఖిలక్షితి రాజ్యభార
క్షాంత్యాభినంద యతిభక్తి భరేణ శౌరిం|| 31
యస్య ప్రాంగణభూమిషు ప్రతిదినం ప్రక్షాల్యమానామిత
క్షోణీ దేవసమూహ పాదవిగలద్వార ప్రవాహైః స్ఫుటైః
శశ్వన్మార్గ సహస్రపూరాభిరహో గంగప్రవాహో
జితా|
దేవేష్వస్యతమస్య పాదగలితా మార్గానత యాయా
దాక్షారామే పావనే పుణ్యభాజా [సితా|| 32
పుణ్యక్షేత్రే కీర్తిపుణ్యార్జనాయేన
భోక్తుం ప్రీత్యా ప్రత్యహం బ్రాహ్మణానాం
కల్పాంతం కల్పితం సత్రయుగ్మమ్|| 33
చెల్లూరు నామప్రథితాభిరామ
శిష్టాగ్రహారోత్తర దిగ్విభాగే|
మహత్తటాకమ్మధురాంబుపూర్ణ
మచీకరద్యః కరుణారసాత్మా|| 34
మహారాజపాతేన మహోమహిమ్నా
గ్రామస్యతస్యాపర దిగ్విభాగే|
నిర్మాపితం ధర్మపరాయణేన
విష్ణోర్గృహం వైష్ణవపుంగవేన|| 35

మాన్యుడు. అతడు వీరచోడ నృపపుంగవుని చేత నాతని "నిఖిల క్షితిరాజ్య భారక్షాంతి" కొఱకు, సేనాపతిగా నభిషేకింపబడెను. అట్టి మేడమార్యుడు పావనమైన దాక్షారామమందు ఒక అన్నసత్రమును, పుణ్యక్షేత్రమైన శ్రీపిఠాపురమందొక అన్నసత్రమును బ్రాహ్మణులు ప్రతిదినమును కల్పాంతము వఱకు ప్రీతితో భుజించుటకు కల్పించెను. మరియు ప్రఖ్యాతమై అభిరామమైన చెల్లూరు శిష్టాగ్రహారమునకు ఉత్తర దిశాభాగమందు మధురములయిన నీటితో నిండిన మహాతటాకమును త్రవ్వించెను. ఆ గ్రామమునకు పడమటి దిశయందు ధర్మపరాయణుడై యా వైష్ణవపుంగవుడు మిక్కిలి రమ్యమైన విష్ణుగృహమును దేవాలయమును గట్టించెను. ఆ దేవాలయమునందు, శ్రీమన్మహావిష్ణువును శ్రీమహాలక్ష్మితో పాటు ప్రతిష్ఠించెను. ఆ శ్రీమహావిష్ణు దేవరకు ప్రతిదినమును చరు, బలి, పూజార్థము, ఖండస్ఫుటిత నవకర్మార్థమును, వీరచోడ మహారాజు గుద్దవాడి విషయము (నేటి రామచంద్రపురం తాలూకా) లోని కాలేరు గ్రామమును సర్వకరపరిహారముగా దేవభోగము చేసి ఉదకపూర్వకముగా ధారవోసెను. 1

వీరచోడుని పిఠాపుర తామ్రశాసనము చారిత్రక దృష్టిలో చాలా అమూల్యమైనది. ఆ శాసనమునుబట్టి యా కాలమున నూర్లకొలది బ్రాహ్మణ కుటుంబములు—అన్యవర్గముల వారిమాట యటుంచి నను—చోళమండలమునుండి, ఆంధ్రదేశమునకు వలస వచ్చినట్లు తెలియుచున్నది. చక్రవర్తి 23 వ విజయ రాజ్యవర్షమున శ. 1014 యగు ప్రజోత్పత్తి సంవత్సర కర్కాటక సంక్రమణపుణ్యకాలమందు వీరచోడుడు 27 గోత్రములకు చెందిన 528 బ్రాహ్మణోత్తములకు ప్రోలునాటివిషయములోని మాలపెల్లి

మహాగ్రామమును, దానికి చేరియున్న పండ్రెండు పూండ్లిగ్రామములను (శివారుగ్రామములను) పొన్నతోర్రగ్రామమును, ఉత్తరవరుస విషయములోని ఆలమి గ్రామమును కలిపి నొకమహాశిష్టాగ్రహారమును చేసి వీరచోడ చతుర్వేదిమంగలమను పేరుతో, సర్వకర పరిహారముగా దానముచేసి ధారవోసెను. నేడా వీరచోడ చతుర్వేదిమంగలము గానరాదు. ద్రావిడబ్రాహ్మణులట్లసంఖ్యాకములుగా నంధ్రభూమికివిచ్చేసి నిలచిపోవుట ఒక చిత్రమైన వృత్తాంతము. దానమిచ్చినది యింగ్లీషు లెక్క ప్రకారము క్రీ. శ. 1092, జూను 27 వ తేది అనుచున్నది. ఈ అగ్రహారము ధారవోసినతరువాతనే వీరచోడుడు కళింగముపైాద దండయాత్రకు బోయినట్లగపడుచున్నది.

శ. 1015 వ సంవత్సరమున (క్రీ. శ. 1093) వీరచోడ మహారాజు పరాజయము, పిమ్మట మరణముతో ప్రారంభమయిన కళింగయుద్ధము ఇంచుమించుగా, శ. 1017 సంవత్సరము సగము గడచు వఱకు (క్రీ. శ. 1095) రెండు సంవత్సరములు అతి ఘోరముగ సాగెను. కళింగ యుద్ధగతిని గూర్చి కళింగట్టు పరిణియను2 తమిళ పద్యకావ్య మొకరీతిని ఆంధ్రదేశపు శిలాశాసనము లింకొకరీతిని వర్ణించుచున్నవి. అతిశయోక్తులతో, నిబద్ధములు గాని మాటలతో పోషకుని పొగడి ధనార్జనము చేయుకవి యొక్క కావ్యముకంటె నితర ప్రయోజనార్థము వ్రాయింపబడిన శిలాశాసనములు ఎక్కువ సత్యపూరితమైన వృత్తాంతములతో నిండియుండును. అదిగాక కళింగట్టుపరిణిలోని యుద్ధవృత్తాంత మొకరీతిని శాసనములలోని చరిత్ర యింకొకరీతిని వివరించుచున్నవి. ఆ రెండింటిని సమన్వయించి పరీక్షించినపుడు యథార్థవృత్తాంతము తెల్లమగును.

జయంగొండానుకవి, కళింగమును ఒకప్పుడు ఉత్తరకళింగమని మరియొక సమయమున సప్తకళింగమనియు వ్యవహరించును. కాని, కళింగము లేక ఉత్తరకళింగముఅని ప్రస్తావించినపుడు అది దేవేంద్రవర్మ రాజ్యమైన కళింగదేశ భాగమనియు, సప్తకళింగమని తెలిపినపుడు ఆపేరు చక్రకూటమండలమునకు వర్తించుననియు నూహింపవచ్చును. చక్రవర్తి కులోత్తుంగు డొకనాడు కాంచీపురమున తన శ్రీకోవిల ప్రాసాదమున అస్థాన మండపమందు కొలువుదీరియున్నవేళ చారులు, వార్తాహరులు నేతెంచి రెండేండ్లనుండి కళింగాధిపతి, లేక సప్తకళింగాధీశుడు కప్పముగట్టుటమాని పారమేష్ఠిత్వమును బూని స్వతంత్రునివలె మెలగుచున్నాడని తెలిపిరట. చక్ర

1. చెల్లూరి తామ్రశాసనములోని పంక్తులు—౧౦౧—౧౦౯.

2. కళింగట్టు పరణిని, జయంగొండాను అను కవి తనకు పోషకుడైన కరుణాకర తొండెమాన్ పల్లవరాయరు యను ఒక చోళసేనాపతికి, అంకితమిచ్చెను. ఆ కావ్యమందు కళింగయుద్ధమంతయు నా తొండెమానునొక్క సేనాధిపత్యమున నడచెననియు జయమంతయు నాతడు సంపాదించినదే యనియు వర్ణించును. నిజమునకాతడు ఆంధ్రదేశమునుగాని, కళింగమునుగాని చూచినవాడు కాడు. ఆతని వర్ణనలు వ్రాతలు ఒకదాని కొకటి సరిపడవు. కళింగట్టు పరణి ఇంగ్లీషులోనికి అనువదింపబడినది. చూడుడు ఇండియన్ ఆంటిక్వేరి; సం 19 పుటలు 329 మొదలుకొని.

వర్తి యావార్తవిని కుపితుడై యా సప్తకళింగాధీశుని శిక్షింపదలచి కరుణాకరతొండైమాను పల్లవరాయరును ఆతని యభిలాషపై సర్వసేనాధ్యక్షునిగ నియమించి పెద్ద బలమునుగూర్చి కళింగముమీదికి బంపెనట! చోళసైన్య ప్రస్థానమునాటికి శత్రువులు గోదావరి పర్యంతము నాక్రమించుకొనిరని కళింగత్తుపరణి తెలుపుచున్నది. చోళసైన్యము గోదావరిని దాటి శత్రుసైన్యమును దార్కొనెను. అంతట గోదావరియొడ్డున ఘోర సంగ్రామము జరిగెను. శత్రువులోడి వెన్నిచ్చిపారిరి. చోళసైన్యముతో సేనాపతి కరుణాకర పల్లవరాయరు సప్తకళింగము (చక్రకూటమండలము) మీదికి నడచెను. సప్త కళింగాధిపతి, (సోమేశ్వరుడు) ప్రాకటముగ చోళసైన్యమున యుద్ధరంగమునందు ఎదుర్కొనజాలక బలిష్ఠమైన తన కోటయందు తలదాచుకొనెను. కాని చివరకు సోమేశ్వరుడు కోటవిడిచివచ్చి యుద్ధమునకు డీకొనక తప్పదయ్యెను. సోమేశ్వరు డోడిపోయి అడవులదారి బట్టెను. ఆతని గజసైన్యము చెల్లాచెదరయ్యెను. రథ పదాతివర్గములు కోలాహలమున కూలి వెన్నిచ్చి పారిపోయెను. సోమేశ్వరుని బలిమినించి జీవగ్రాహముగా బట్టుకొని కాంచీపురమునకు గొనిపోయి కులోత్తుంగునికి నప్పగించవలెనని కరుణాకరుడు ప్రయత్నించెనుగాని యా యభిలాష నెరవేరలేదు.

ఆంధ్రదేశపు శాసనములలోని వృత్తాంత మీరీతిగా నున్నది. వీరచోడదేవుని మరణముతో కులోత్తుంగునికి ఆతని విజయరాజ్యవర్షములు 28 గతించు నాటికి ఎదిగివచ్చి రాజ్యభారము బూనగల కుమారులు ముప్పురు వరుసగా గతించిరని యీవఱకు ఒకసారి తెలిసుకొంటిమి. వేంగీ సామ్రాజ్యమును బాలించుటకు రాజచాళుక్య వంశజుడు లేకుండెను. గోదావరి పర్యంతము వేంగీ భూమిని చక్రకూటాధీశుడు రాజభూషణ సోమేశ్వరదేవు డాక్రమించుకొనెను. కళింగరాజ్యము అనంతవర్మకు వైరియైన అపహర్త దేవేంద్రవర్మవశమందుండెను. వేంగీశ్వరత్వమే తన హస్తములనుండి జారిపోవుచున్నట్లుండెను కులోత్తుంగచోడదేవునికి. అట్టి విపద్దశయందు, నయశాలి గావున చక్రవర్తి వేంగీసామ్రాజ్యము పరాధీనము గాకుండ నుపాయ మాలోచించెను. వేంగీశ్వరుని పాదపద్మోపజీవులైన సామంత మాండలికులలో ప్రధానాగ్రగణ్యుడు వెలనాంటి గొంకరాజు. అతడు కూడ చోడగంగుని కాలమున సంవత్సర ప్రాంతమందు (క్రీ. శ. 1089) రణరంగమున ప్రాణములను విడచెను. అతడు చక్రవర్తిపై నత్యంత భక్తి గలవాడు గావున తన కుమారునికి చక్రవర్తి పేరు రాజేంద్రచోడుడని పెట్టెను. వెలనాంటి రాజేంద్రచోడునికంటె ఎక్కువ దృఢభక్తుడు ప్రభువిశ్వాసము గలవాడును కులోత్తుంగుని కింకొకడు ఆంధ్రదేశమున గానరాలేదు. వెలనాంటి రాజేంద్రచోడుడు చతుర్థాన్వయుడు. అయినను నిశ్శంకగా కులోత్తుంగుడా వెలనాటిరాజేంద్రచోడుని తన కుమారునిగా స్వీకరించి యా దత్తకుమారుని వేంగీ పదహారువేల మహారాజ్యమునకు పాలకునిగా నియమించి[1] రాజ్యాభిషేకము జరిపెను. వెలనాంటి రాజేంద్రచోడుడు "అగర్హణీయమైన స్వభావము" గలవాడు గావున "స్వతనయజన చిహ్నముల"ను ప్రసాదించెను.

చోళచక్రవర్తి ఆయత్తపరచిన చోళసేనతో కరుణాకర తొండమానుడు వేంగీశ్వరుడైన వెలనాంటి రాజేంద్రచోడుని వచ్చి గలసికొనెను. రాజేంద్రచోడుడు గూడ నొక మహా ప్రచండసైన్యమును సమకూర్చెను—దక్షిణాంధ్రదేశపు మాండలిక సామంతుల నేకులు, సేనలు గూర్చుకొనివచ్చి రాజేంద్రచోడుని గలిసికొనిరి. వారిలో పేర్కొనదగినవారు మహామండలేశ్వరకొండపడుమటి మన్మండరాజు,[2]—మహామండలేశ్వరకోనపోతరాజు,[3] మహామండలేశ్వర కోట భీమరాజు కుమారుడు గొంకరాజు,[4] మొదలైనవారు—వీరుగాక పెక్కండ్రు గలరు కళింగయుద్ధమునందు ప్రఖ్యాతులైనవారు—వేంగీశ్వరుని సేనలో బ్రాహ్మణసేనానులనేకులు గలరు. వారిలో నొకడు వంశక్రమానుగతమైన చాళుక్య నారాయణబ్రహ్మ మహాధిరాజు అను బిరుదుగల్గిన చమూపతి భీమనారా

---

1. వెలనాంటి పృథ్వీశ్వరుని పిఠాపురం కుంతీ మాధవస్వామి దేవాలయ శిలాశాసనము. *Ep. Ind. vol. IV.* పుట 32.

"అథపృథుతరకీర్తిః; శ్రీ కులోత్తుంగచోడః
పరనృపకులమాఘం గోంకభూపాల పుత్రం
సుతమివ పరిగృహ్య గర్హణీయ స్వభావం
స్వతనయ జనచిహ్నై శ్శోభితభూపం యుయోజ॥
శ్లో. 34.

2. *S. I. I. vol. IV. No. 662.* (నాదెండ్ల మూలస్థానేశ్వరుని గుడియందున్నది.) మరియు *S. I. I. vol. X. No.* 107. (నాదెండ్ల వేణులమ్మ గుడిలోనున్నది.)

3. *S. I. I. vol. IV. No. 1153.* (దాక్షారామమున భీమనాథుని గుడియందున్న దీ శాసనము.)

4. *S. I. I. vol. X. No. 64.* సత్తెనపల్లి తాలూకా వేల్పూరు రామలింగేశ్వరస్వామివారి గుడిలో ధ్వజస్తంభము.

యణుడు.* వెలనాంటి రాజేంద్రచోడుని సైన్యము మొదట ద్రాక్షారామము చెంతనుండి వజనవాథపురసమీపమునందు ఆనగరము నాక్రమించుకొనిన సోమేశ్వరునితో దలపడినట్లు ఊహించుట కవకాశములు గలవు. సోమేశ్వరు డోటువడి పలాయనమయ్యెను. అతని వెన్నంటి దఱుముచు రాజేంద్రచోడుడు కళింగమును జొచ్చెను. కోటగొంతేరాజును చోళదండనాథుడు కరుణాకర తొండైమానుని చక్రకూటము మీదికి రాజభూషణ సోమేశ్వరుని శిక్షించుటకు బంపె. వెలనాంటి రాజేంద్రచోడుడు కళింగముమీదికి ద్రోహియై ప్రవర్తించి అనంతవర్మ—చోడగంగదేవుని రాజ్యమును ఆక్రమించుకొన్న దేవేంద్రవర్మ మీదికి బాహాదర్పముతో నడచెను. సోమేశ్వరునితోడి యుద్ధము భీకరముగా గడచెను. చివరకు సోమేశ్వరుదోడి పట్టువడిరెను. జీవగ్రాహముగా పట్టువడిన అతడు కోటగొంకరాజు కరుణవలన వెలనాంటి రాజేంద్రచోడుని యనుగ్రహమును సంపాదించి మరల వేంగీశ్వరుని పాదపద్మోపజీవియై బ్రతికెననుటకు కారణములు గలవు.1

కళింగమున జరిగిన సంగ్రామవృత్తాంతము వెలనాంటి రాజేంద్రచోడుని వాహినీపతుల శిలాశాసనములను విస్తరముగ దెలుపుచున్నవి. వాటిలో ముఖ్యమైనది, తిరువరంగడను రెండవ పేరుగల పల్లవరాజుయొక్క దాక్షారామ శిలాశాసనము.2

పల్లవరాజుకు పండువరాజని మరియొక పేరును చోడచంద్రుడన్న బిరుదము కూడ గలదు. అతడు సద్వైష్ణవుడు. సచ్ఛూద్ర చూడామణి. చోళమండలమునుండి చోళసేనతో వచ్చిన నొక చమూపతి. వెలనాంటి రాజేంద్రచోడుని ఆశ్రయించి సామంత రాజచిహ్నములతో నొక మాండలికరాజ్యమును పారితోషికముగా సంపాదించుకొనెను. అతడు కళింగదేశ మఖిలమును వెలనాంటి మనుజేంద్రుని యాజ్ఞానుసారము భస్మీపటలము గావించి గంగవంశజులను దేవేంద్రవర్మ మొదలయినవారిని కోసలదేశమునుండి సహాయముగా వచ్చిన శత్రుసేనలను ఓడించి చంపివైచెను. ఆ వీరుడు అభిహితుడై వెలనాంటి రాజేంద్రచోడుని కీర్తిలతకు అంధ్ర ఓఢ్రసంధియందు శుభకరమైన జయస్తంభమును నాటెను.3

---

5. S. I. I. vol. IV. No. 1263 దాక్షారామమున గలదు.

1. కోటగొంకరాజు వేల్పూరు శిలాశాసనము పూర్వోదాహృతము. సోమేశ్వరుడు ఈ సంగ్రామము గడచినవెనుక చిరకాలము వఱకు బ్రతికియున్నట్లు శాసనము దెలుపుచున్నది.

2. S. I. Vol. IV. No. 1239. ఈ శాసనమును సంబద్ధిలేని ఊహలతో, చారిత్రిక దృక్పథమును విడిచి శ్రీ. కె. వి. సుబ్రహ్మణ్యయ్యరుగారు ఎపిగ్రాఫియా ఇండికా సం 21, పుటలు 138 మొ. యందు ప్రచురించినారు.

3. పల్లవరాజు, చోళమండలములోని తిరివణియూరునాండుకు చెందిన మన్దలంజేరి పురాధీశుడు. అతడు దాక్షారామము చెంతగల వెల్లిగ్రామమునందు శ్రీనివాసునకు విదితమైన దివ్యదేవాలయమును గట్టించి దానికి విశేషముగ దానములు చేసెను. అతని గూర్చి శాసనమునందుగల వాక్యములు:—

......శ్రితవీరలక్ష్మీ రాజేంద్రచోడ
  శరణాశ్రయ లబ్ధలక్ష్మీః॥
రాజేంద్రచోడ ధరణీపతికీర్తివల్లీ
  సత్పల్లవో...పల్లవరాజనామా।
శ్రీద్వారచామర ఘనాతపవారణైక
  శంఖధ్వజ ప్రముఖరాజిత రాజ్యబాహుః ॥2
కృత్వాదిగ్విజయం నిహత్య చరిపూన్
  రాజేంద్ర చోడాజ్ఞయా
వీరశ్రీ లలనాస్వయం వృతపతి
  ర్యశ్చోడ చంద్రప్రభుః।
యత్ప్రస్థాపిత దంతిదాన సలిలక్లిన్నం
  ప్రభోః ప్రాంగణం।
తచ్చార్యం ద్విషతాం కపాల నివహో
  గాయంతి వాయుధలాత్ ॥3
కర్షన్నశ్వఖురైర్ద్విషాం సురుధిరై
  రాపూరయ న్నాహవక్షేత్రం
తీవ్రకృపాణ కృత్తరిపువీరా
  న్ముక్తాంబికాన్ ఉప్త్వా కీర్తిలతాం
వివర్ధయతి యో రాజేంద్రచోడ
  ప్రభోస్సోయం పణ్డువరాజ
ఇత్యభిహితః సచ్ఛూద్ర చూడామణిః శ్లో ॥4
భస్మీకృత్య కలింగదేశ మఖిలం
  నిజరత్య గంగం
రణే భఙ్క్త్వా కోసల ఖణ్డపాల
  నివహాః దేవేంద్ర
వర్మాదికాన్ వీరః పల్లవరాజ
  ఇత్యభిహితో
రాజేంద్ర చోడప్రభోః కీర్తిస్తంభమి
  వోఢ్ర సంధిషు జయస్తంభం శుభం న్యస్త
  పర్ ॥5

కొండపడుమటి మన్మమండ భూపతి కళింగ యుద్ధమునందు రాజేంద్రచోడుని సేనానులలో నొకడు.1 అతడు యుద్ధరంగమున మొనయందు అతిభీకరుడై విక్రమించి పోరాడియుండుటవలన గాబోలు "అనియంకభీముడని బిరుదు గాంచెను. అతడు కాళింగ గంగకటకమును, కోటగోడలను నేలమట్టముజేసి, కటకమును దగులబెట్టెను. గంగకటకమును నేడు శిథిలావస్థయందున్న దంతిపురముతో ముడిపెట్టవచ్చును. అది ద్రోహి దేవేంద్రవర్మ రాజధానిగా నుండెను. మండ భూపతి వైరి సేనలను చిందరవందరజేసి మదించిన ఏనుగులను పెక్కింటిని బట్టుకొని వెలనాంటి రాజేంద్రచోడునికి గానుకవెట్టెను. మండభూపతి యేలిన కొండపడుమటి సీమ లేకగిరి పశ్చిమ త్రిసప్తతివిషయము, నరసారావుపేట తాలూకాయందు కోటప్పకొండకు పడమటగా నున్నది. దాని రాజధాని నాదెండ్ల.

మహామండలేశ్వర కోన పోతరాజు ఒకడు కళింగయుద్ధములందు వెలనాంటి రాజేంద్రచోడునికి భృత్యుడైనిలచి తన పరాక్రమవిశేషముచే ప్రఖ్యాతిగడించెను.2 కోనపోతరాజు లేక కొండ దేసటి కోనపోతరాజు, కళింగయుద్ధములందు త్రికలింగవల్లభుని జయించి కళింగములో మదపుటేనుగులను బట్టుకొనివచ్చి రాజేంద్రచోడ భూపతికి సమర్పించెను. కళింగయుద్ధమునందు కోనభూపతి చేసిన అత్యద్భుతమైన విక్రమైక సహాయమునకు కులోత్తుంగ చోళ చక్రవర్తి పరితుష్టుడై కరుణతో నాతనికి వేంగీ సహస్రగ్రామ విషయముపై అధిపత్యమును దానితోపాటు వేంగీంద్రుడను బిరుదమును ప్రసాదించెను.3

వీరచోడదేవుని మరణము కారణముగా శ. 1016 కు సరియైన క్రీ. శ. 1094 వ సంవత్సరమందు ప్రారంభమయిన కళింగదేశ దండయాత్ర రెండేండ్లలోపల విజయవంతముగా ముగిసెను. ఆ వృత్తాంతము కులోత్తుంగుని విజయరాజ్యవర్షము 26 వ యేట, 172 వ దినమున వేయించబడిన యొక దాన శాసనమందు తెలుపబడినది. 4 ఆ శాసనముయొక్క తిథివార నక్షత్రములను లెక్కించినపుడు, ఆ దినము 23 వ మార్చి 1096 కు సరిపోవుచున్నది—కళింగము మీద నడచిన దిగ్విజయయాత్ర ఫలితముగా వేంగి దేశము నిష్కంటకమయ్యెను. వెలనాంటిచోడ భూపతి ఆంధ్రదేశమును స్వర్గతుల్యమన్నట్లు పాలించెను—ఆ విషయము కుంతీ మాధవస్వామిగుడియందున్న వెలనాంటి పృథ్వీశ్వర మహారాజుయొక్క శిలాశాసనము వాకొనుచున్నది. 5

వెలనాంటి చోడభూపతి, ఇంచుమించుగా పది యేండ్లు రాజ్యమేలి చక్రవర్తి విజయ రాజ్యములు 34 కు సరియైన క్రీ. శ. 1104 సంవత్సరమున మరణిం

---

1. *S. I. I. Vol IV No. 662* :—
మండః సుభైరుణాగణైః స్తుతయాంచకార
భీమం భృగుం రఘుమపావనియంకభీమః ॥
కాళింగ గంగకటకం తటవద్విపాట్య
జిఘ్వాక్కంట కరవధారధటారి వీరాన్ !
ఉచ్ఛిద్య గజాలి శిరస్సరసీరుహాణి
లేపాంచ మండలిక మండనమదద్విపేంద్రః ॥
సాకం స్వకీర్త్యా సవృపాల సూను
ర్నీత్వా దిగంతావధి వైరిసేనాం ।
తత్ర గృహీతాన్మద శాలిగండా
న్రాజేంద్ర చోడాయ దదౌ గజేంద్రాన్ ॥

2. తత్రాపి స్మరణీయ కీర్తిలతికాకోకంబాలవాత్సల్ల సత్సౌజన్యాది మహాగుణైక వసతిః
శ్రీకోన పోతః కృతీ జిత్వాయః శ్రీకళింగ
మహారాజేంద్ర చోడాయ వ్యప్రాదాద్ధు।
ర్జయ రాజవంశతిలకః కాళింగ గంధద్విపాన్ ॥

3. యః కులోత్తుంగచోడస్య కారుణ్యేనాలభ ద్విభుః ।
వేంగీంద్ర నామధేయంచ వేంగీగ్రామ సహస్రకమ్ ।

4. *S. I. I. vol. III, Port II, No. 72*, 4 వ పంక్తి—ఈ శాసనము తంజావూరుజిల్లా కుంభకోణం తాలూకా తిరువడై మరుదూరు గ్రామమందున్న మహాలింగేశ్వర స్వామివారి ఆలయమునందున్నది.

5. సోయంచోడక్షితీశః ప్రతినృపతి కులోన్మూలనాభీలభీమః
శ్రీమద్వేంగీ ధరిత్రీ మభిమతఫలదాం పాలయన్ శైల ధీరః ।
దేజే రాజీవ రాజన్నిజనయనయుగో యోగ గమ్యే పురాణే ।
పుష్టస్విష్టావ భిత్త్వాన్నిఖిల నృపజనాధీశచింత భక్తియుక్తమ్ ॥ *Ep. Ind. vol. IV. p, 32.*

చెనని యూహించుటకు కారణములు గలవు[1]. ఆ రాజేంద్రచోడుని యనంతరము వేంగీ మహారాజ్యమును రక్షించుటకు మిగుల దక్షుడైనవానిని వెదకు కొనవలసిన స్థితి కులోత్తుంగునికి సంభవించెను. ఆనాటికింకను చక్రవర్తికి ఎదిగి యుక్తవయసు వచ్చిన కుమారులు లేరు. జీవించియున్న వారిలో పెద్దవాడు కుమార పరాంతకదేవు[2] డింకను బాలుడైనట్లు పదహారు సంవత్సరములు యీడు దాటనియట్లు గన్పడును. అంతటి పసివానిపై దుస్సాధ్యమైన వేంగీ సామ్రాజ్య రక్షణభార ముంచుటకు ఇష్టము లేక చక్రవర్తి తన కాప్తభృత్యుడును తన పాదపద్మోపజీవియునైన మహామండలేశ్వర కోన రాజేంద్రచోడుని వేంగీశ్వరునిగా నభిషేకించెను.[3] కోన రాజేంద్రచోడుడు ఆత్రేయగోత్ర సంభవుడైన హైహయ వంశజుడు. క్షత్రియుడు. అతని పూర్వులు విమలాదిత్యునికిని తరువాత వానిని తనయునకు రాజరాజు కాలమునాడును వేంగీశ్వరుల నాశ్రయించి యుండిరి. వారిలో మొదటి ముమ్మడి భీముడు కోన మండలమును సామంత నృపచిహ్నములతో బడసి నట్లగపడును. ఆనాటినుండి కోనమండలపు హైహయులు, వేంగీ చాళుక్య చక్రేశ్వరులకు అరిగాపులై యుండిరి. కోన రాజేంద్రచోడుడు ఇంచుమించుగా అయిదారు సంవత్సరములు క్రీ. శ. 1105 మొదలు కొని 1110 వఱకు ఆంధ్రదేశమును పాలించెను. అతడుకూడ కళింగ దండయాత్రయందు అనేక సమర సంఘట్టములందు పటువిక్రమ సాహసములతో పోరాడి విజయలక్ష్మిని కైవసము చేసికొనినట్లు ఊహింపవచ్చును. అతనికి విక్రమరుద్రుడనియు హైహయాదిత్యుడనియు గండపెండడువు అనియు బిరుదములు.[4] కోన రాజేంద్రచోడుని కాలముకూడ శాంతముగ గడిచిపోయెను. యుక్తవయస్కుడగుట వలన పరాంతకదేవుడు క్రీ. శ. 1110 ప్రాంతమున వేంగీశ్వరు డయ్యెను.[5]

కుమార పరాంతకదేవుని కాలమున ఆంధ్రదేశమున విపరీతములు పుట్టసాగెను. కృష్ణానది కుత్తరపు టొడ్డువరకు వ్యాపించెను. కుంతల చాళుక్యుల రాజ్యము—అది త్రిభువనమల్ల బిరుదాంచితుడైన ఆరవ విక్రమాదిత్యుని కాలము; (క్రీ.శ. 1076–1126) కృష్ణానది కుత్తరపుటొడ్డున చాలదూరమువఱకు ఆంధ్ర భూమి వ్యాపించియుండెను. నేటి మహబూబు నగరు, నల్గొండ, ఓరంగల్లు జిల్లాలోని చాలాభాగము ఆనాడు దుర్గయంశజులును తెనుగు చోడవంశజులనగు మహాసామంత మహామండలేశ్వరుల పాలనముక్రింద నుండెను.[6] అంధ్రులైన ఈ మహాసామంత మహామండలేశ్వరుల సాహాయ్యమున త్రిభువనమల్లుడు. పూర్వాంధ్రదేశభాగమును, వీలయినచో— సకల వేంగీ మహీమహారాజ్యమును గూడ జయించి ఆక్రమింప నుద్యమించుచుండెను.

కులోత్తుంగచోడుడును, ఆరవవిక్రమాదిత్యుడును అత్యంత ప్రబలవైరులు. దాక్షిణాత్యచోళులకును కుంతల చాళుక్యులకు నడుమ వర్థిల్లిన వైరము ఒకనాటిది కాదు. అది యట్లుండ ఆ యుభయచక్ర

---

1. తిరువరంగడైన దయాపతి పల్లవరాజ— చోడచంద్రుని ద్రాక్షారామ శిలాశాసనము (*S.I.I. Vol. IV. No. 1137*) నాటికికే అది చక్రవర్తి విజయ రాజ్యవర్షము 34 సంవత్సరమున (క్రీ. శ. 1104) వేయించబడినది. దీనినిబట్టి యూహింపవచ్చును.

2. చక్రవర్తియై చోళ సింహాసన మధిష్ఠించిన వెనుక పరాంతకుడు విక్రమచోడు డయ్యెను. అతనికి త్యాగసముద్రు డన్న బిరుదము కూడ గలదు.

3. *Ep. Ind. Vol. IV. pp.83 ff* కోన మల్లిదేవ యిమ్మడి సత్యరాజుల పిఠాపురమున కుంతీ మాధవస్వామి గుడిలోనున్న శిలాశాసనము. అది శ. 1117 నాటిది.

4. పూర్వోక్త ప్రమాణము; శ్లోకము 12.

దగ్ధ్వాయః ప్రబలప్రతాప దహనేనాసప్తార్చిః సా
విద్విషః।
ప్రాప్తోవిక్రమరుద్రతాం నిజకరస్పృష్టోర్వ్యతా
శేషభూ।
లోకస్యాస్య సమస్తభృత్తిరగమహాదోర్య హైహ
యాదిత్యతాం।
యాతోయః ఖలు గండపెండడువతాం ప్రోత్తండి
తారిశ్రియా॥

"గండపెండడును" అనగా శత్రువులకు తన పరాక్రమముచే భరింపరాని వేడిని గలిగించు వీరుడు అని అర్థమని తోచును.

5. బెజవాడ (*S. I. I. vol. IV. No. 787*) ద్రాక్షారామ (*S. I. V. vol. IV. No.*) శాసనములనుబట్టి యీ నిర్ణయము చేయబడినది.

6. అలంపురం, పిల్లలమఱ్ఱి, కొలనుపాక (తెలింగాణపు శిలాశాసనములు) మొదలయిన స్థలములందు కానవచ్చు శిలాశాసనములు, ఈ కాలమునాటివి, ఈ విషయమును తెలుపుచున్నవి.

వర్తులకును ప్రబలవైరము వచ్చుటకు కారణములు గలవు. ఉభయులును చోళభూపతుల అల్లుండ్రు: రాజేంద్రదేవునియల్లుడు, మేనల్లుడునుగూడ రాజేంద్రచోడుడైన కులోత్తుంగచోళ దేవుడు . వీరరాజేంద్రుని యల్లుడు ఆరవ విక్రమాదిత్యుడు. వారిరువురును దమబాంధవ్యమును పురస్కరించుకొని చోళ రాజ్యమును తమవశము జేయదలచిరి. కులోత్తుంగుడు చోళులదౌహిత్రుడగుటచేతను ముందుగా నతడు వేంగీ చాళుక్యచక్రేశ్వరుడగుటచేతను చోళరాజ్యమునకు విక్రమాదిత్యుని త్రోసిరాజని అధిపతియయ్యెను. విక్రమాదిత్యుడు తన భార్యతోడబుట్టిన అధి రాజేంద్రుని చోళసింహాసనస్థుని జేయజాలకపోయెను. పరస్పరముగల వైరమును బాటించుటకు కులోత్తుంగుడు త్రిభువనచక్రవర్తియయ్యెను, విక్రమాదిత్యుడు త్రిభువన మల్లుడయ్యెను. కులోత్తుంగునికి ఆ కారణములవలన మొదటినుండియు విక్రమాదిత్యుడు ప్రక్కలో బల్లెమై మెలగుచుండెను. కులోత్తుంగునిపై పగదీర్చుకొనుటకు విక్రమాదిత్యుడు ఎప్పటికప్పుడు తరుణమునకై వెదకుచు వేచియుండెను. కులోత్తుంగుని కడపటి రాజ్యకాలపు సంవత్సరములందు ఆతని కవకాశము లభించెను. అ వా డెట్లు వృత్తాంతములు నడచెనో తెలిసికొనుటకు అవకాశము లేదు. కాని కులోత్తుంగునికి యవసానకాలమున, క్రీ. శ. 1114—1118 సంవత్సరముల నడుమ అనారోగ్య మేర్పడియుండును. చోళరాజ్యము సంరక్షించుటకై పరాంతకుడు వేంగిని విడచి దక్షిణమునకు పోయెను. అది క్రీ, శ. 1117 సంవత్సరము గావచ్చును.

కులోత్తుంగచోళుని విజయరాజ్య వర్షములు 46 అగు మన్మథ సంవత్సరమున త్రిభువనమల్లు డాకస్మికముగ నంధ్రదేశముమీదికి దాడిచేసి పరాంతకుని సేనలు ఎదిరించునంతలోపల వెనుకకు మరలిపోయెను. అది శ. 1037 కు సరియైన క్రీ. శ. 1115 సంవత్సరమున జరిగెను. ఆనాడు త్రిభువనమల్లుడు కృష్ణకు దక్షిణమువనున్న ఆంధ్రదేశభాగమును ప్రచండసేనాసమేతుడై ప్రవేశించెను. కృష్ణానదియొక్క దక్షిణపుటొడ్డున, గుంటూరు జిల్లా తెనాలి తాలూకా, కొల్లూరు గ్రామమునకు వేంచేసియున్న అనంత భోగేశ్వరస్వామికి, ఉత్తరాయణ సంక్రమణ పుణ్యకాలమందు కొన్ని దానములు చేసెను. వాటిని బ్రాహ్మణదండనాథుడు అనంతపాలయ్య ఆజ్ఞాపించెను.[1] ఆ దానశాసనము [illegible] 1115 [illegible]ంబరు 25 వ తేదినాడు వేయించబడెను.

ఇంచుమించుగా కోన రాజేంద్ర చోడుడు వేంగీశ్వరుడుగా నభిషేకింపబడిన కాలమునాడు చక్రవర్తి కులోత్తుంగుడు వెలనాంటి చోడభూపతి అగ్రసుతుని మహామండలేశ్వర వెలనాంటి యిమ్మడి గొంకరాజును సమస్తసేనాధిపతిగా నియమించిన ట్లూహించుటకు కారణములు గలవు. వెలనాంటి చోడభూపతి కాలమునుండి రెండు దశల కాలము ఆంధ్రదేశము శాంతిభద్రతలు గలిగియుండిన కతన కోనెరిమ్మయింగొండారు శ్రీపరాంతకదేవుడు గాని యతని యాప్త మహాప్రధాన అమాత్య మహాసామంత వర్గము గాని త్రిభువనమల్లుడు దలపెట్టియుండిన వేంగీ దండయాత్రను ప్రమత్తులైయుండి యుపేక్షించి యుండిరి. గొంకరాజు సయితము కుంతల చక్రేశ్వరుని దాడిని గుర్తింపలేకపోయెను.

ఈ వృత్తాంతము లిట్లు నడచుచుండ ఆంధ్రదేశమున మహామండలేశ్వరులు మహాసామంత నృపులును రెండు చీలికలుగా నేర్పడిరి. అందొక చీలికవారు కులోత్తుంగునిపై పూర్వముండిన రాజభక్తి సడలెను. అతడు రాజచాళుక్య కులసంజాతుడును వేంగీశ్వరుడునై యుండియు చోళరాజ్యాభిలాషియై చాళుక్య వంశముపై అభిమానము వీడి చంద్రవంశమును పోద్రోసి "రవికులతిలక, చోడకులశేఖర, పాండ్యకులాంతక, విక్రమచోళ, విజయాభరణ, శ్రీరాజకేసరివర్మ్మ పెమ్మానడిగలు త్రిభువన చక్రవర్తి" ఇత్యాది చోళ వంశపు బిరుదులు స్వీకరించి పూర్తిగా చోళుడగుట ప్రధానకారణము. రెండవ చీలికవారు వేంగీచాళుక్య చక్రేశ్వరుల పాదపద్మోపజీవులై "చాళుక్య వంశ కాల" "చాళుక్యరాజ్యభవన మూలస్తంభాయమానులు" "చాళుక్యరాజ్య సముద్ధరులు" ఇత్యాది బిరుదులు గర్వముతో ధరించి కులోత్తుంగచోళునకు మూలభృత్యులై నిలిచిరి. చాళుక్య చోళులకు ప్రతికూలురైన వారిలో ముఖ్యులు రాజచాళుక్య వంశములోని పిఠాపురం, విడువోలు శాఖలకు చెందిన చిన్న వంశములవారు ముఖ్యులు. వారికి వారి బంధుకోటిలో చేరిన హైహయులు దుర్జయవంశజులైన త్రియమాండలికులు తెలుగు చోడవంశములవారు బాసటయై నిలచిరి. ఒకవిధముగా చతుర్థకులజులు కులోత్తుంగచోడదేవునికి స్వామిభక్తిపరాయణులై నిలచిరి. తు. త్రియమాండలిక శిఖామణులు వేంగియందు స్వతంత్ర రాజ్యమును స్థాపింప నుద్యుక్తులగుచుండిరి. అట్టి విపరీతసమయ

1. *S. I. I. Vol IX, Part I, No 193.*

మున కుంతలచాళుక్య చక్రేశ్వరుడు వేంగిపై దండయాత్ర దలపెట్టెను.

అట్టి విపరీతపరిస్థితులందు మహామాండలికు లనేకులు పరాంతక దేవునికి తమ రాజభక్తిని వెల్లడించుచు దక్షారామ భీమేశ్వర మహాదేవుని సన్నిధిని వింతపూనికలు పూనియుండిరి. ఆ పూనికలు శాసనములలోనికి ఎక్కియుండెను.1 అట్టి పూనికలు గొన్నవారిలో కొందరి మాండలిక ప్రభువుల నామములు ఒడ్డవాది చోడయ, వీరఘట్టం చోడయ, వీరగొట్టమున సూరయ, జంతుర్నాటిభీమన, తాపత్తి బేతయ, దిరుడనాంటి వీరచోడుడు మొదలయినవారివి, శాసనములందు గానవచ్చుచున్నవి. వారు పూనిన పూనికలలోని భావము భాషయు రెండును వింతగొలుపుచున్నది. అట్టి పూనికలు బూని దేవునిసన్నిధియందు సత్యము చేయుటయూడ నాకాలమున కొందర మాండలిక ప్రభువుల రాజభక్తివిశ్వాసములు సడలిపోవుచుండెనని యూహింపవచ్చును.

ఇది యిట్టులుండ ఆనాడు వేంగిదేశమునకు రాజధానియైన జననాథపురమున నొక వింతవృత్తాంతము నడచెను. దానినిబట్టి చూచి పరిశీలించినపుడు వేంగియందు చాళుక్యచోళభూపతియు నాతని ఆప్తమంత్రివర్గమును ప్రమత్తులైయుండిరి. అది చక్రవర్తి కులోత్తుంగుని విజయరాజ్యవర్షము 48, అనగా హేవిళంబి సంవత్సరమునకు సరియైన క్రీ. శ. 1118 నాటిది. అప్పటికి పరాంతకదేవుడు చోళమండలమునకు తండ్రి యవసావకాలము సమాపించువలన బోయియుండెను.

కుంతలేశుని పనుపున వేంగిపై దండయాత్ర సాగించి దేశము నాక్రమించుకొన దలచియున్న శ్రీమన్మహాప్రధానం బాణసు పెగ్గడ,—మహాప్రెగ్గడ దండనాయక అనంతపాలయ ప్రెగ్గడ చింతలూరి భీమరసు జననాథపురమున కేతెంచియుండెను. వేంగీ రాజధానియందును వేంగీదేశమందును రాజకీయ పరిస్థితులు ఎట్లుండెనో గూఢచారియై తెలిసికొని దండనాయక అనంతపాలయకు నివేదింపవచ్చియుండునట్లు గన్పడును—చింతలూరి భీమరాజువచ్చియుండిన రెండేండ్లలోపుగా, కులోత్తుంగచోళుడు మరణించుటయు నటుతరువాత అనంతపాల దండనాయకు డాంధ్రదేశముపై దాడివచ్చి వేంగీ రాజధానిని దానితోపాటు దేశమునంతయు నాక్రమించుకొనుటయు కుంతలచాళుక్య చక్రేశ్వరుని రాజ్యాధికారము నెలకొల్పబడుటయు నీ యూహకు గారణములు. చింతలూరి భీమరసు గడుసుతనముగ కులోత్తుంగుని విజయరాజ్యవర్షమును దెలుపుచు "శ్రీ భీమేశ్వర మహాదేవరకు సోమగ్రహణ నిమిత్తమున" అఖండవర్తిలో హుదణ్ణ దివియగా బెట్టి, దానికై "నెయి సరియించుటకు" 50 ఇవ్వయెడ్లను(గేదెలను) దేవర కిలరమునకు సమర్పించెను2. ఆ సోమగ్రహణమే మాసమునబట్టెనో వివరములు శాసనమందు గానరావు. కాని యది క్రీ. శ. 1117 లో ఆషాఢ పూర్ణిమాస్య నాటి (16 జూను) దో లేక పౌషపూర్ణిమనాటిదో (21వ డిసెంబరు) అయియుండును. ఏమయిననేమి, క్రీ. శ.1117 న, చింతలూరి భీమరసు జననాధపురమునసుండెననుట నిశ్చయము. అది దాక్షారామ చెంతనుండెను. అది ఎప్పుడో శత్రువులచే దహింపబడి రూపుచెడి లేచిరాకయ్యెను.

కులోత్తుంగచోళదేవుడు క్రీ. శ. 1118 వ సంవత్సరమున మరణించెను. ఆతడింకను ఒకటి రెండు సంవత్సరములకు చనిపోవుటకు బూర్వము చోళరాజ్య సంరక్షణార్థము పరాంతకదేవుడైన విక్రమచోళుడు తండ్రిసన్నిధి కరిగెను. ఆతడు చోళమండలమునకు పోవుటకుపూర్వము వేంగిదేశమునకు నాయకుని నియమించలేదు.3 వేంగిభూమి మరల నొకసారి

---

1. *S. I. I. Vol. IV. Nos, 1269–1274.*

ఉదాహరణమున కొక శాసనము:—

1 స్వస్తి సకలలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధనమ-
2 హారాజులు కో నేరిమ్మయిం గొణ్డారు శ్రీ
3 పరాంతక దేవరకు రాపత్తిబేత
4 య పూనిన పూనిక ఏను నావంశము
5 న వారును శ్రీపరాంతక దేవణ్డుగాక
6 ఒరుణ్డు మమ్మేలినవాణ్డు తినయా
7 లిమాకిచ్చేడు వాణ్డు మేము శ్రీపరాంత
8 క దేవనిగాక ఒరింగొలిచితిమేని మాయా
9 ణ్తివాని కిచ్చినవారము ఇమ్మార్గణము శ్రీభీ
10 మేశ్వర దేవరసన్నిధిని సత్యముసేసియో
11 సుం గొంటిమి లిఖితం ఏకరమి రాజేం
ద్రచోడ ఆచార్యః

2. S. I. I. *Vol. IV. No.* 1322.

3. పిఠాపురం మల్లపదేవుని శిలాశాసనము; *Ep. Ind. vol.* IV. *p.* 226 *ff.* శ్లోకము 24 : విక్రమచోళః—

తస్మింస్త్యాగసముద్రాపరనామని చోడమండలం త్రాతుం
గతవతి వేంగీనాయక రహితా; తదంతరే॥

అనాయక మయ్యెను. కులోత్తుంగుడు మరణించిన రెండేండ్లలోపల, ఆంధ్రభూమి కుంతలేశ్వరుని యధీన మయ్యెను. ఇంచుమించుగా, క్రీ. శ. 1120 (శ. 1041 కడపటిభాగమునుండి) మొదలుకొని రమారమి రెండు దశలకాలము ఆంధ్రదేశము కళ్యాణి చాళుక్యుల పరిపాలనముక్రింద నుండెను. ఆకాలమున క్రీ. శ. 1119 మొదలుకొని 1136 ఆంధ్రదేశము వర్ణింపరాని కడగండ్లపాలయ్యెను. త్రిభువన చక్రవర్తిని ఓడించి యాతనిపై పగ దీర్చుకోలేని త్రిభువనమల్ల విక్రమాదిత్యుడు ఆతడు చన్న వెనుక వేంగిని జయించి వేంగీశ్వరు డయ్యెను.

---

# ప్రబోధము



శ్రీ జాస్తి వేంకట నరసయ్య

శ్రీముఖ హాలాదిభూమీశ్వరక్షాత్ర - జీవిత కథలచే జేవనొంది
సిద్ధనాగార్జున శ్రీమల్లినాథార్య - పాండితీగరిమంబు బ్రస్తుతించి
నిద్రాణ లోకమ్ము నిత్యమున్ మేల్కొల్పు - జాతీయ రచనల సారమెఱిగి
రస లుబ్ధులకు సమారాధనీయంబైన - శిల్ప సంపత్తికి సేవ నెఱపి
మధుర గీతామృతంబు వేమాఱు గ్రోలి - విశ్వ విజ్ఞాన పటిమచే వెలుగునొంది
నిత్య కళ్యాణ రాశియై నెగడునట్లు - దిద్దుకొనుడయ్య! దేశమ్ము తెలుగులార!

కలవు సహస్రభాషలు జగమ్మున; సందొకడేని తేనియల్
చిలికెడి తెల్గుతోడ, సరిసేయగ - జాలదు; విశ్వమెల్లనీ
పలుకున కడ్డు సెప్పదు; సెబాసని - విజ్ఞుల మెచ్చ సుందరో
జ్జ్వల కవితన్ సృజించి మనజాతికి - నభ్యుదయమ్ము గూర్పుడీ
స్వీయము రాష్ట్రమున్ గడనసేయ - నిరంతర దీక్ష గంకణ
శ్రీయుతులై తనర్చి బుధసేవిత - ధర్మ పథాను రక్తులై
కాయము చెమ్మటల్ కురియ గష్టము - నోర్చుచు మాతృమండల
శ్రేయము గోరుచున్ బగలు రేయి - ప్రయత్నము సల్పుడా దృతిన్

కులమత వైరముల్ విడిచి కూడి - త్రిలింగ ధరిత్రి దాస్యమున్
దొలచి యశః ప్రవాహమున - దోగుచు నాటుడు తెల్గు టెక్కెమున్
కలిమిని సంస్కృతిన్ విపుల - గౌరవమొందుచు గార్య శూరులై
కలము హలమ్ము పట్టుడిక - గల్గును జాతికి దేజమెంతయున్

అజ్ఞానము దారిద్ర్య మవజ్ఞయు నశియించు - నట్లు వసుధా ప్రజకున్
విజ్ఞానబోధ మొసగుడు సుజ్ఞాన - రమానికాధ శోభలు గుల్కన్॥

---

# మహారాజ్ఞ కార్యం



శ్రీ సాళ్వ కృష్ణమూర్తి

'హోహోయ్! హో! మే మెప్పుకోం. మే మెందు కొప్పుకుంటాం?'

రంగి కుడిచేయి పైకి ఆడిస్తూ, అరుగుమీదనుంచి క్రిందవరదాకి 'మే మెప్పుకోం, మే మెప్పుకోం' అంటూ ఏడెనిమిది గజాలదూరంవెళ్లి ఒక పెద్దరాతిమీద కూర్చున్నాడు.

ఇంతవరకూ రెండు పక్షాలవాళ్ళ 'ఆర్గ్యుమెంట్సు' వింటూ, న్యాయనిర్ణయ పద్ధతిని గమనిస్తూన్న తక్కిన పిల్లలు తమ ఆసక్తినీ, దృష్టుల్నీ ఒక్కసారిగ రంగివైపే కేంద్రీకరించినారు.

రంగి మాట్లాడకుండా మాటిమాటికి తల పైకెత్తి చూస్తూ ఒక కంకరురాయి తీసికొని పెద్ద రాతిమీద కొడుతున్నాడు. వాడా క్షణంలో ఉద్వేగంగా వున్నాడు తప్ప వేరే యేమీ ఆలోచించడం లేదు. కొన్ని క్షణాలు గడిచినై. రంగి రాతిపై కొడుతూ నిప్పురవ్వ యెగిరినప్పుడల్లా జాగ్రత్తగా చూస్తూ, ప్రతిసారీ రవ్వ యెగిరేలాగ కొట్టాలని ప్రయత్నిస్తున్నాడు. ఈసారి వాడనుకున్నట్లు రవ్వ యెగిరింది.

రంగి తలయెత్తి చూచేవేళకు 'రాజి' అరుగు దిగి వస్తున్నాడు. రాజి వెంటనే తక్కిన పిల్లలూ దిగినారు. శేషఫణిమాత్రం అరుగు ఖాళీకావటంవల్ల కాళ్లు క్రిందికి వ్రేలాడవేసుకొని, తనకాళ్లు తానే పెనవేసుకుంటూ, విడదీసుకుంటూ, దగ్గరున్న తుమ్మకాయలను చూస్తూ, వాటి పొడవును వేళ్ళతో కొలుచుకుంటూ, వాటికి చెక్కిపెట్టిన తుమ్మముండ్ల పదును పరీక్షిస్తూవున్నాడు. కాని యెదురుగా బండ దగ్గర ఏం జరుగుతోందో వాడు గమనించక పోలేదు.

'హోహోయ్! హో! మే మెప్పుకోం, మే మెందు కొప్పుకుంటాం?'

ఆ గుంపులోనుంచి రంగి కంఠం ప్రత్యేకంగా, తన నిశ్చయాన్ని తెల్పుతూ వినిపించింది. మళ్లా రంగి మాట్లాడినప్పుడల్లా తక్కినవాళ్ళు నిశ్శబ్దంగా వుంటున్నారు. వాని మాటలు శేష ఫణికి బాగా వినిపిస్తూనే వున్నవి. ఈసారి రంగి తర్వాత నాలుగైదు గొంతుకలు వెంటవెంటనే రంగి మాటలనే మళ్ళీ ఉచ్చరించినవి. దీనితో శేషఫణికి పరిస్థితి బాగా అవగతమైంది.

రాజి వహించిన మాధ్యస్థం విఫలమైపోయింది. వాడు గుంపులోనుంచే ఒకసారి శేషఫణివైపు చూచినాడు. అందరికండ్లూ మళ్ళీ శేషఫణివైపు చూచినవి. అందులో కొన్ని స్వపక్షపు వాళ్ళచూపులు. కొన్ని విరోధిపక్షం వాళ్ళవి.

శేషఫణి అరుగు దిగివచ్చి ఆ గుంపుకు కొద్ది దూరంలో పోట్లాడ్యే వాడల్లా ఆగి నిల్చున్నాడు. పరిమాణ భేదాల్లో కూడుకున్న తుమ్మకాయలు, వాటికి యుద్ధంలో గోళ్ళలాగ, కోరల్లాగ, ఈటెల్లాగ పనిచేసే తుమ్మముండ్లు అక్కడే అరుగుమీద కుప్పగా పడివున్నయ్.

విడిపోయిన రెండు గుంపుల్లో రెండో గుంపు కదలిపోతున్నట్లనిపించింది గాని పోలేదు. శేషఫణి, వెంకటేశం, లచ్చన్న, పీరాన్, యింకా ఒకరిద్దరు అక్కడే వున్నారు. తన రాజీ కుదరకపోవడంవల్ల రాజన్న కూడా శేషఫణి పక్షమే చేరిపోయినాడు.

విరోధి పక్షం దూరంగా నిలవడంతో రంగి మళ్ళీ అరుగుమీదకే వచ్చినాడు. అనుయాయులంతా వాణ్ణే అనుసరించినారు. రంగి మళ్ళీ ఒక పెద్దతుమ్మకాయ తీసుకొని లావుపాటి ముల్లు ఒకటి దానికి గుచ్చి, అరచేయి, వ్రేళ్లక్రింద దాన్ని అదిమిపట్టి పనక్కులాగి ముల్లు లేకుండా వున్న ఒక కాయను

గురిచూచి బలంగా దానివైపు త్రోసినాడు. గురి కొత్త తప్పడంవల్ల ఈ ముల్లు దానిలోకి చొచ్చుక పోక, పై బూడిదవర్ణపు పేటు కొంచెం లేపి ప్రక్కకుపోయింది. ముల్లు తాకినచోట తుమ్మకాయ లోని పసిమి పచ్చగా కన్పిస్తోంది.

'నీ పుంజు గెలిచింది' 'సత్తి' అన్నాడు.

రంగి తల పైకెత్తిచూచి, దూరంగా వున్న విరోధి పక్షంవైపు దృష్టిపారించి అక్కడ నుంచి లేచినాడు.

ఇంతకూ అక్కడ ఆటలో రంగికి అన్యాయం జరిగింది. ఆ ఆటలో తుమ్మకాయలకు పుంజులని పేరు. కాయల పరిమాణాన్ని బట్టి ఒక పెద్దపుంజుకు రెండు చిన్న పుంజుల్నిచ్చి తీసుకోవడం వ్యవహారపు విషయం. ముండ్లు గుచ్చిన కాయల్ని ఇద్దరు పందెగాండ్రు చెరొకటీ తీసుకొని బండమీద పెట్టి పలకలవలె పెట్టిన చేతుల్తో వెనక్కులాగి ఒకేసారి ఒకదానిపై కొకటి బలంగా తోస్తారు. ఒక గజం దాక మధ్య దూర ముండటంవల్ల అవి గురితప్పి ఒక దానికొకటి తగలకపోవడం తటస్థిస్తుంది. ఒకవేళ తగిలినా, రెండుముండ్లూ ఒకదాంట్లో కొకటి చొచ్చుక పోవటం, గెలుపోటములకు సంబంధించదు. సమబలాలవుతయ్. అందుచేత మళ్ళీ ఆడవలసిందే. రెండవ దాని ముల్లు తన కడుపులోకి గుచ్చుకోకుండా దాని ముల్లు అవతలిదానికి గుచ్చుకుంటే ఆ పుంజు గెలిచినట్లు. ముల్లు బాగా దిగబడితే మంచిగెలుపు. రెండవ వాడికాయ కొంత పచ్చి ఆరిపోయివుంటే అది వెంటనే చీలిపోయి పాము తలవలె రెండు భాగాలుగ కనిపిస్తుంది. అటువంటప్పుడు చీల్చిన పుంజుకు మహావిజయమే! పొడుగాటి కాయల్ని బండమీద త్రోసినప్పుడు రాపిడితో వాటి అడుగుభాగం కొంత అరిగిపోయి పలకవలె అవుతుంది. అట్లాంటి కాయను ఆటలో ముందుకు త్రోసినప్పుడు అది వెల్లకిలా తిరిగిందా దాన్ని మళ్ళీ ఆటలో వాడరాదు. కాని అది ఓటమిక్రిందికి చేరికా కాదు. దాని ఉపయోగం లేదింక, అంతే. ముల్లు తగిలి పై బూడిదవర్ణంపోయి ఆకుపచ్చ రంగు కనిపించడం దెబ్బతీసినందుకు గుర్తు. గెలుపుకు కనీసపు చిహ్నమది. రెండు మూడు దెబ్బలటువంటివి తగిల్తే తర్వాత వాటిని గుర్తించుకోవడం కష్టం గనుక ఆ కాయలుకూడా తర్వాత ఆటలకు పనికిరావు. ఇందులోనే రంగికి జరిగిన



అన్యాయం. పైన చెప్పిన కనీసపు విజయచిహ్నం క్రిందటి ఆటలోని దంటాడు. శేషఫణి. ఇప్పుడు తాను తీసిన దెబ్బ అదేనంటాడు రంగి. శేషఫణి ఒప్పుకుంటే తన క్రియ రంగి స్వాధీనమైపోతుంది. శేషఫణికి సాక్ష్యంగా రాజి మాధ్యస్థం వహించినా అది ఫలించలేదు.

రంగి కూర్చున్నవాడు లేచివెళ్లి అరుగుమధ్యన వున్న వేపచెట్టు కొనుకొని అరుగు బండల్ని పరీక్షిస్తున్నాడు. బండలమీద వేప ఈనెలు, పండీ పండని కాయలు, పచ్చని కాయలు పడివున్నయ్.

రంగి బండమీదికి వంగి ఒక వేపయీనెను తీసుకొని మునిపంటితో కొరుకుతూ విరోధి పక్షం వాళ్ళవైపు చూస్తూన్నాడు. వాళ్లేదో మంత్రాంగం చేస్తున్నారు.

పచ్చియీనె కావటంవల్ల రంగి నాలుకకు చిలుచేదు తగిలింది. ఆ చేదు కొసనాలుక నుండి అంగిటిదాకా సర్రున ప్రాకి అక్కడ చేదు పుట్టించింది. అంతటితో పోక వాని శరీరంలో ప్రతి చిన్న నరంలోకి, రక్తంలోకి, కండరాల్లోకి ప్రవేశించి సన్నగా ప్రాకుతూంది. శరీరమంతా యీ చిలుచేదు సుండుసూది పోడుపువంటి స్పర్శశక్తితో పయనించి సర్వాంగాల్లోను నిశితమై, తీవ్రమైన ఒక నైతన్యాన్ని కలిగించింది. వేపయీనె కొఱికి నానన్న స్పృహ అప్పుడు కాని వానికి కలగలేదు. తల పైకెత్తి చెట్టువైపు చూచినాడు. వడి వసంతం కావడంవల్ల చెట్టుమీద యింకా కొంత పూత అక్కడక్కడ నిలచివుంది. వేపకాయలు పచ్చని ఆకుల మధ్యవున్నా, పచ్చదనమంతా నలుపుగా మారుతూ గుత్తులుగా కనిపిస్తూన్నయ్. ఇంతలో చిన్న గాలి వీచింది. గాలి చల్లగావున్నా అందులోనూ ఈషత్తు చిలుచేదును వాని ఘ్రాణేంద్రియం పసికట్టింది. ఆ గాలి పల్చగా లేక మందంగా వున్నట్టూ, బరువుగా వున్నట్టూ తోచింది వాడికి. చెట్టువైపు చూస్తే చెట్టు కూడా మందంగా, బరువుగా తల ఆడిస్తూంది.

పడమటి కొండమీద తొలకరి చినుకులకుపడిన గడ్డిమేసి ఆవులు తిరిగివస్తున్నయ్. పంజవేళ గాలి కూడా బలమైంది. ఆకాశంలో కావిరంగు అంతరిస్తూంది.

రంగి మళ్ళీ ఒకసారి విరోధిపక్షం వాళ్ళకోసం వెతికినాడు. కాని వాళ్లెప్పుడో వెళ్ళిపోయినారు. ఇంతలో కనుచీకటిపడింది. పడమట ఊరికోసను వున్న మేదర గంగడియింట్లో గింజలు తిని బలిసిన పందెపు పుంజు 'కొక్కొరో కో' అని కాహళం పట్టింది. రంగి తన గుంపుతో కూడా ఊళ్ళోకి వెళ్ళిపోయినాడు.

## 2

రంగి మరురోజు ఉదయం రెడ్డిగారి ఆవుదూడను వెదకుతున్నాడు. ఊరికి, గుట్టకూ మధ్యనే ఒక మామిడితోట వుంది. రంగి అటువైపే వెళ్లుతున్నాడు. ఆకాశం నిర్మేఘంగా వుంది. చల్లటిగాలి మాత్రం ప్రవాహంలాగ దూసుకపోతూంది. గుట్టమీదికి పోతూ మామిడితోటగుండా నడుస్తున్నాడు రంగి. ఆ తోటకు కంచె, గించె, యేమీ లేదు. చెట్లు పెద్దవి. చాల యెత్తుగా, గుబురుగా, వుంటయ్. చాలా యేండ్లనాటితోట అది. నడుస్తూవుంటే చెట్లలో ఆకుల సందున యెక్కడో కోయిల 'కోయ్' మన్నది. రంగి ఆగి ప్రతిగా 'కోయ్' మన్నాడు. మళ్ళీ అది కూసింది. తానూ మళ్ళీ కూసినాడు. నాలుగైదుసార్లు అయింతర్వాత రంగి చుట్టుప్రక్కల చూచినాడు. ఎవరూ లేరు. తాను చేసిన పనికి తానే నవ్వినాడు.

తోటదాటి గుట్ట యెక్కసరికి గాలి యింకా విశృంఖలంగా ఒసలంతా రాచుకుంటూ పోతూంది. కొంతదూరం యెక్కి రంగి నిలబడి దూడకోసం కలయజూచినాడు. దూరంగా యెడమచేతివైపు దూడ తెల్లగా కనిపించింది. 'సరే' ననుకొని రంగి నిదానంగా గాఢంగా ఒక్కసారి ఊపిరి పీల్చి వదిలినాడు ప్రయత్నపూర్వకంగా. ఆ గాలిలో యేదో విశేషం గోచరించింది వాడికి. తన శరీరపు లోపలిభాగాన్నంతా శుద్ధిచేసి వస్తూన్నట్టుందది. గుట్టమీది నుంచి ఊరి తలమీదుగా చూచినాడు. ఊరు, చెట్లూ అన్నీ తన దృష్టికి దిగువలోనే వున్నయ్. ఊరంతటినీ జయించినవాడివలె, ఆకాశంవైపొక్కసారిచూచి దూడ కోసం వెళ్ళినాడు.

నడుస్తున్నంతసేపూ తనకు తెలియని యేదో శక్తిహృదయంలోనించి తరంగాలు తరంగాలుగా పైకుబికివస్తున్నట్లున్నది. దాని శక్తికి తన కాళ్ళు బలంగా నేలమీద ఆనుకోలేకపోతున్నయ్. ఇంతవరకూ రంగికి 'తాను' అంటే తన శరీరమన్న భావన తప్ప, వేరే తెలియదు. కాని యిప్పుడు తనలోని యేదో శక్తి ఉత్సవ ద్భంగాలుగా పైకి లేస్తూంటే శరీరం దాన్ని అనుసరించలేక, పైపెచ్చు దాన్ని నిరోధిస్తున్నట్ల ప్రేలాడబడుతూన్నట్లు అనిపిం

చింది. 'తన' లో యీ శరీరం కాక వేరే యింకొకటి కూడా యేదో వున్నదన్న జ్ఞానం అప్పుడే. కలిగింది వాడికి. కాని అర్థమూ కాలేదు నమ్మకమూ కుదర లేదు. కనపడని రెక్కలు తన రెక్కల్లో వచ్చినట్లు మాత్రం వాని కనిపించింది.

దూడను తోలుకొని వస్తూ రంగి దానిమీద ఒరగబడి కొంతదూరం నడిచినాడు. అది నడుస్తూంటే దానితోక పట్టుకొని దాన్ని వెనక్కులాగి 'ఏడిపించినాడు.' చిన్న గుండ్రాళ్ళు తీసుకొని రాళ్ళకేసి బాదినాడు. నిప్పురవ్వ పడితేగాని ఒక్కొక్క రాతిని వదలటం లేదు. వాడేం చేస్తూన్నాడో వాడికే తెలియదు. ఎండ బాగా యెక్కింది. మామిడితోటగుండా వస్తూ మళ్ళీ కోకిలమ్మతో పందెం వేసినాడు. అందు తుంచుకొన్న మామిడికొమ్మ అందినదాకా యెగిరి ఒకటో, రెండో ఆకులుపట్టుకొని, ముదురాకు కొరికి పారవేసి, వగరు చప్పరిస్తూ, మామిడి వాసనను పీలుస్తూ, లేత చిగురుటాకును పెదిమల దగ్గరగా పెట్టి గాలివూది 'కీచు' మని శబ్దం చేయిస్తూ, దాన్ని ముద్దు పెట్టుకుంటూ వస్తున్నాడు. దూడ ఒకే గమనంలో నడుస్తున్నా, రంగి గమనము ఒకసారి నడక, ఒకసారి పరుగుగా నడిచింది. వానికి తానేదో చెయ్యాలని మాత్రముంది. ఆదేమిటో వానికే సరిగ్గా తెలియదు.

ఊళ్ళోకి వచ్చేముందుగా మళ్ళీ వేపచెట్టు దగ్గర విరోధపక్షం వాళ్ళు కనిపించినారు. శేషఫణి, వెంకటేశం, లచ్చన్న, పీరాన్. తాను దూడను తోలుకవస్తూవుంటే వాళ్ళంతా పొడిచే యెద్దుల్లాగా కోరచూపులు చూస్తున్నారు తనవైపు. తాను వాళ్ళకి దూరంగానే వెళ్ళాలనుకున్నాడు. కాని దూడ వాళ్ళ ప్రక్కగా వెళ్ళింది. లచ్చన్న దాన్ని 'ధాయ్' మని అదలించబోయి చేతి కందగానే దాని వీపుమీద చరిచినాడు. అది వీడు చెయ్యెత్తడం చూడగానే నక్కి వంచి పరుగెత్తింది.

'అదేం చేసింది నిన్ను. ఎందుకు కొడతావ్?' రంగి నిలబడి ప్రశ్నించినాడు.

'మా యిష్టం' లచ్చన్న కీచిగా అన్నాడు.

'ఏది నీయిష్టం. ఏదీ కొట్టుచూతాం యీసారి' రంగి సవాల్ చేశినాడు. దూడ యాభైగజాలు దాటి పోయింది.

'మమ్మల్ని రాచుకపోతే మేం కొడతాం. దూడైతే మాకేం. నీవైతే మాకేం.'

'ఏదీ కొట్టుచూతాం'

'ఏదీ రాచుకొని పో—'

ఇంతలో దూడ మేదరగంగడి యింటిముందు యెండపోసిన గింజలు తినేవేళకు వాళ్లు దాన్ని తోలి కేక లేస్తున్నారు.

రంగికి దాని వెంట పరుగెత్తక తప్పిందికాదు. వాడు వెళ్లుతూంటే పీరాన్—

'మగసిరి వుంటే యెల్లుకోవాలి' అన్నాడు.

'నీ రంగం నా రంగం బాయికాడా బైరంగం' అభినయంతో పాడి హాస్యం చేసినాడు వెంకటేశం.

కొంచెం దూరంపోయి రంగి ఆగి వెనక్కు వచ్చే వాడల్లా మళ్ళా తమాయించుకొని—

'పొద్దు తిరిగినాక-ఎల్లుకోండి మీ జట్టంతా.' అని కేక వేసి పరుగెత్తినాడు దూడవెంట.

## 3

వైరం సాధించడంకోసం శేషఫణి ఆవేళ బడికి నామాలు పెట్టినాడు. ముందురోజు ఆలోచించిన పన్నగడ ప్రకారం ఈరోజు రంగినీ, వాని జట్టునీ చిత్తుచేసి పారేయ్యాలని. కరణంగారి పిల్లవాడవడం చేత బడికి వెళ్లినట్లేవెళ్ళి కడుపు నొప్పూందని దర్జాగా సెలవు తీసుకొని వచ్చినాడు. వెంకటేశం, లచ్చన్న, పీరాన్ అనే వీళ్లలో పీరాన్‌కు బడీ బాదరబందీ యేమీ లేదు. వెంకటేశం, లచ్చన్న, యింట్లో బడికి వెళ్ళుతున్నామని చెప్పి ఎగ్గొట్టినారు. ఏదో గిల్లి కజ్జా పెట్టుకొని ఎట్లాగైనా రంగి నాయకత్వాన్ని పడద్రోయాలని వీళ్ల ఆలోచన.

శేషఫణి మంచి ఆలోచనకర్త. తన ఆలోచనంతా తన జట్టువాళ్ల తలల్లోకి నూరి పోసినాడు.

రంగికిమాత్రం బడితొందర అంతగా లేదు. అయినా కాయకష్టం చేసుకొని బ్రతికే సుబ్బులు కొడుకు చదువుకుంటే యెవరికొక్కవాలి? చదువుకోకుంటే యెవరికొక్కవాలి? ఎప్పుడో యిష్టమైనరోజు వెళ్ళడం, లేనిరోజు మానడం. అయినా శేషఫణికి అంటినంత చదువు రంగికి విశేషప్రయత్నమేమీ లేకుండానే అంటింది. ఇంక రంగి జట్టులో తక్కిన వాళ్లూ అనామకులే. అందుచేత వాళ్ళ చదువులూ అంతే.

శేషఫణి జట్టువాళ్ళ ప్రయత్నం చూడగానే రంగికి చేతినిండా పని దొరికినట్లయింది. దూడను

తోలుకొని వెళ్ళి రెడ్డిగారింట్లో కట్టివేయించి, రెడ్డి సాని కొట్టిడీ దొంతికుండల్లోనుంచి కొంచెం బెల్లం పెడితే అది చప్పరిస్తూ వీధిలోకి పరుగు తీసినాడు. తన జట్టులో వాళ్ళకోసం నాలుగు వీధులూ, సందులూ గాలిస్తే చిన్న సుబ్బులూ చంద్రుడూ దొరికినారు. వాళ్ళను కలుపుకొని రంగి దేవాలయంలోకి వెళ్ళి నాడు.

మధ్యాహ్నమవుతూంది. క్రమంగా క్షీణించి పోతూన్న గోపురం నీడలో తక్కిన యిద్దరూ 'పులి జూదం' ఆడుతున్నారు.

'ఏంరోయ్! రంగీ పొద్దుట్నుంచీ లేవే?' ఒకడు తలెత్తకుండానే ప్రశ్నించినాడు.

'రెడ్డిగారి దూడకోసం వెళ్ళాను. మా నాయన పనికెల్లినాడు.'

'శేషఫణి నీల్గుతుండాడే' రెండోవాడందు కున్నాడు.

'అందుకే వచ్చింది. ఎల్లుకోమని చెప్పివచ్చినా' రంగి అన్నాడు సాభిప్రాయంగా వాడి ముఖంలోకి చూస్తూ.

అంతా కలసి తర్వాత యేదో మంత్రాంగం చేసినారు.

చిన్న సుబ్బులు దగ్గరలో పడివున్న పాడు గాటి కల్లు చెప్పు నొకదాన్ని తీసుకొని, ఒక చివర అరచేతిలో పట్టి, పిడికిలిమూసి, రెండవచివర వేల మీద తాకిస్తూ పెట్టి, కుడిచేతిపిడికిటితోను గట్టిగా సవరిస్తూ అన్నాడు—

'ఈ చెప్పు అయిదుతుంటలవుతే మనం గెలిచి నట్లు. చూడండి' వేళ్ళకు దెబ్బ తగలకుండా బొటన వ్రేలుకూడా లోపలికి మడిచి, చేయెత్తి, పిడికిట వేసినాడు. కల్లురాయి పెళ్లుమంటూ ముక్కలు ముక్కలైంది. చంద్రుడూ, మరొకడూ ఆ తుంటలను లెక్క పెట్టినారు. చిన్నవాటితోకూడా కలుపుకొని పదకొండు!

చిన్న సుబ్బులు రంగి ముఖంలోకి చూచి నాడు. రంగి ముఖం వికసించింది. మాట్లాడకుండా అందరూ కార్యాంతరమగ్నులై తుమ్మల్లోకి వెళ్ళి పోయినారు.

శేషఫణి జట్టువాళ్ళక్కడనుంచి కదల్లేదు. శేషఫణి చాల మొండివాడు. అదే వేపచెట్టు క్రింది అరుగుమీద కూర్చొని తనకాళ్లే చుట్టూ అష్టకట్టుగా పెట్టుకొని, జేబులోవున్న వస్తువులన్నీ క్రిందపోసి పరిశీలించి యేరి పెడుతున్నాడు. క్రొత్తగా మింట్ అయివచ్చిన రెండు కానీలు, నాలుగు బలపపు తుంటలూ, ఒక మీసమున్న పుముకొక్క, చతురస్రంగా వున్న అరచేతి వెడల్పు నీలపు సిల్కుగుడ్డ, యింకా యేవేవో సామాన్లందులో వున్నయ్.

సాయంత్ర మవుతూంది. పదిగంటల వేళ భోజ నానికి వెళ్ళడం తప్పితే వాళ్లెక్కడకూ కదల్లేదు. ఉదయంనించీ యీ 'ఎదురొక్కలు' కుదరనూ లేదు. తక్కినవాళ్ళకు విసుగు కలుగుతూంది.

'భయపడిపోయినారు. ఇంకరారు' లచ్చన్న అన్నాడు.

శేషఫణి పలుకలేదు. అరుగుమీద వెల్లకిలా పండుకొని వాళ్లెలా యెదురొక్కవడెమో ఆలో చిస్తూన్నాడు. ఒకరినొకరు యుద్ధాని కాహ్వానించు కున్నారు గనుక వేరే మిష యేమీ అక్కర్లేకుండానే రంగంలోకి దూకవచ్చునని శేషఫణి నిర్ణయం. ఇంకొక చేతైనా క్రొత్తది రావాలన్న కోరిక లేదు వాడికి. నిజంగా లోపల యేదో బెరికిగా వుంది. ఎదు రొక్కవడంలో క్రమ మిట్లా వుండాలనుకున్నాడు. తామే ముందు పైన బడాలి. లచ్చన్న, పీరాన్ ముందు కలియబడతారు. తర్వాత తాను. తనకు సాయం వెంకటేశం.

రంగి జట్టు తుమ్మల్లోనుంచి తిరిగి వస్తున్నది. వాళ్లు ఒకరిభుజాలమీద ఒకరు చేతులు వేసుకోవడం లేదు. విడివిడిగా నడుస్తున్నారు. ఆలయంప్రక్క నుంచివస్తూ గోపురాన్ని చూడగానే రంగికి సంవ త్సరం క్రిందటి ఎంకటిచావు గుర్తు కొచ్చింది. గోపురం పైన్నుంచి ఎంకటి పడి చచ్చినాడు. ఆవేళ తానుకూడా వాడితోపాటు పందెం వేసుకొని గోపుర మెక్కినాడు. కాని తానెలాగో జాగ్రత్తగానే దిగి వచ్చినాడు. చచ్చిపోయిన తర్వాత ఎంకటి యెక్కడికి పోయినాడో తనకేమీ అర్థం కాలేదు. ఇన్ని విషయాలు ఆలోచించే బుద్ధికి దాన్ని కను క్కోలేకపోయ్యేటప్పటికి వానిగుండెల్లో యెక్కడో ఆకాశంవంటి అఖాతం యేర్పడి, తెలియని దేదో అటూ యిటూ కొడుతూ నొప్పి కలిగిస్తూంది. రంగికి భయమూ, దుఃఖమూకూడా కలిగినయ్. తర్వాత గూడా రమణప్ప తాత ఎంకటినిగురించి చాల మంచిగా మాట్లాడుతూంటే తాను విన్నాడు. 'ఎంకటి దేవుడికోసం గోపుర మెక్కినాడన్నాడు' తాత ఒకసారి. అయితే తానుగూడ ఆవేళ యెక్కిన

కుడు చిరకాలము వెలనాంటి రాజేంద్ర చోడునితో పోరుచు యుద్ధరంగమునం దాతని నెదిరింపజాలక, చివరకు కొల్లేటికోటయందు తలదాచుకొనెను. వీర రాజేంద్ర చోడుడు అంతట కొల్లేటికోటను ముట్టడించెను. పూర్వము దేవతలు త్రవ్వినట్టి సముద్రమువంటి (దేవపుష్కరిణిని) కొల్లేటిని అగస్త్య డాపోశనముపట్టినరీతిని శోషింపజేసి ఎండగట్టి అందున్న కోటలో దాగియున్న భీముని జంపెను. కోలను భీముడు భయంకరమైన రూపుగలవాడు![1] రావణసన్నిభుడు, మహాబలవంతుడు పరాక్రమశాలి. దుర్గాంతర నిలయుడైయున్న కోలని మాండలిక భీముని యాతనికి సహాయముగావచ్చిన యెల్లరను జీవగ్రాహముగా బట్టుకొనెను కులోత్తుంగ వీరరాజేంద్ర చోడుడు. అంతట భయంకరమైన ఆ భీముని పుత్రమిత్ర బాంధవ సమేతముగా శిరచ్ఛేదముచేసి శత్రునిర్మూలనము గావించెను. కోలని మాండలిక భీముని శిరచ్ఛేదము శ. ౧౦౫౫ కు సరియైన క్రీ. శ. ౧౧౩౩ సంవత్సరమున చైత్రమాసమున జరిగెను. ఆభీకర వృత్తాంతములో సంధ్రదేశము ఇంచుమించుగా చాళుక్య చోళచక్రవర్తికి వశమయ్యెనని చెప్పవచ్చును.

కోలని మాండలిక భీముని శిరచ్ఛేదనమునకు పూర్వము, తన కత్యంత భక్తివిశ్వాసములుగల వెలనాంటి కులోత్తుంగ చోడ గొంకరాజుకు తోడ్పాటుకై చోళసైన్యములతో సంధ్రభూమికి వచ్చియుండెను. భీమనమాండలికుడు ఎదుటనిలిచి పోరాడజాలక కళింగమునకును, ఇతరమండలములకు పాఱిదాగికొనినప్పుడు ఆదేశభాగమును చోళసైన్యములు కాల్చి భస్మీపటలము[2]చేసెను. భీముని శిరచ్ఛేదక వృత్తాంతము నడిచినవెనుక విక్రమ చోడుడు తన కుమారుని రెండవ కులోత్తుంగ చోడుని విష్ణువర్ధన నామముతో వేంగీశ్వరునిగా నభిషేకించెను. ఆ రాజ్యాభిషేకము శ. ౧౦౫౫కు సరియగు పరీధావి చైత్రమాసాంతమున(క్రీ. శ. ఏప్రిల్ ౧౧౩౩ నందు జరిగియుండెను.[3] కుమారుని పట్టాభిషేకానంతరము విక్రమచోడుడు చోళమండలమునకు దిరిగిపోయెను. అది మొదలు విక్రమ చోడ కులోత్తుంగ చోడదేవు లిరువురును చోళ వేంగీ రాజ్యములను సమిష్టిగా ఏకస్థులై పాలించిరి. ఆ సమిష్టి రాజ్యపాలనము క్రీ. శ. ౧౧౩౩ ఏప్రిలు నెలతో ప్రారంభమయ్యెను.

విక్రమ చోళునకు ఏడుగురు రాణులుండిరి. వారిలో ముగ్గురిపేర్లు మాత్రము మనకు దెలియవచ్చుచున్నది.[4] అగ్రమహిషి ముక్కోకిలానడి., రెండవ రాణిత్యాగపతాక, ఆమెకు త్రిభువనముళుదుడైయాల్ యని యింకొకపేరు. మూడవ యామె పేరణి ముళుదుడైయాల్. కులోత్తుంగుడు ముక్కోకిల (ముద్దుకోకిలాంబ)మ్మ కుమారుడని యూహింపవచ్చును. విక్రమ చోళుడు మరణించుటకు రెండవ కులోత్తుంగుడు జననాథపురము రాజధానిగా సంధ్రదేశము నేలినట్లు ఆంధ్రదేశపు శిలాశాసనములవలన దెలియుచున్నది. విక్రమచోళుడు ౧౭ సంవత్సరములు రాజ్యము చేసెను. అతడు శ. ౧౦౫౬ యొక్క కడపటి దినములలో (క్రీ. శ. ౧౧౩౫ మార్చి) మరణించియుండును. మరణించునాటికి ఆ చక్రవర్తికి నలుబదిమూడు సంవత్సరములు వయసుండవచ్చును.

1. దేవబ్రాహ్మణకంటకః పృథుతర
   శ్శైలేయేణ సమానీఖలో
   దుర్గాంతస్థిలనో భయంకరవపుః
   శ్రీరామతుల్యో జపా
   యేనాకో కోలనాంటి భీమనృపతిః
   పుత్త్రైశ్చ మిత్త్రైస్సహా।
   కృద్ధో రావణసన్నిభో భుజబలా
   న్నిర్మూలమున్మూలితః॥

వెలనాంటి వీరరాజేంద్ర చోడుని శ. ౧౦౯౧ నాటి సందూరి తామ్రశాసనమునుండి గవర్నమెంటు ఎపిగ్రాఫిస్టువారి అనుమతి ననుసరించి గైకొనబడినదీ శ్లోకము. *C. P. No. 23 of 1916—17.*

2. *S. I. I. Vol. II. No. 68*, మరియు *S. I. I. Vol. III. No. 19.*

3. ఆంధ్రదేశమున బాపట్ల, నిడుబ్రోలు, మున్నగు తావులందు లభించిన శిలాశాసనములను (*S. I. I. Vol. VI. No.* 129, 123. 133, 134, 136, 137, 141, 142, 149 మొదలయినవి) బట్టిచేయబడినదీ యూహ. విక్రమచోళుని 17 వ రాజ్యవర్షమును రెండవ కులోత్తుంగ చోడుని మొదటి రాజ్యవర్షమును ఒక్కటే. అది శ. ౧౦౫౫ కు సరియైన పరీధావి సంవత్సరము.

4. రెండవ కులోత్తుంగచోడుని చెల్లూరి తామ్రశాసనముకూడ నీవాదమునే బలపఱచుచున్నది.

చింది. 'తన' లో యీ శరీరంకాక వేరే యింకొకటి కూడా యేదో వున్నదన్న జ్ఞానం అప్పుడే. కలిగింది వాడికి. కాని అర్థమూ కాలేదు నమ్మకమూ కుదర లేదు. కనపడని రెక్కలు తన రెక్కల్లో వచ్చినట్లు మాత్రం వాని కనిపించింది.

దూడను తోలుకొని వస్తూ రంగి దానిమీద ఒరగబడి కొంతదూరం నడిచినాడు. అది నడుస్తూంటే దానితోక పట్టుకొని దాన్ని వెనక్కులాగి 'ఏడిపించినాడు.' చిన్న గుండ్రాళ్ళు తీసుకొని రాళ్ళకేసి బాదినాడు. నిప్పురవ పడితేగాని ఒక్కొక్క రాతిని వదలటంలేదు. వాడేం చేస్తూన్నాడో వాడికే తెలియదు. ఎండ బాగా యెక్కింది. మామిడితోటగుండా వస్తూ మళ్ళీ కోకిలమ్మతో పందెం వేసినాడు. అందు తుందనుకొన్న మామిడికొమ్మ అందినదాకా యెగిరి ఒకటో, రెండో ఆకులుపట్టుకొని, ముదురాకు కొరికి పారవేసి, వగరు చప్పరిస్తూ, మా మి డి వా స న ను పీలుస్తూ, లేత చిగురుటాకును పెదిమల దగ్గరగాపెట్టి గాలిపూది 'కీచు' మని శబ్దంచేయిస్తూ, దాన్ని ముద్దు పెట్టుకుంటూ వస్తున్నాడు. దూడ ఒకే గమనంలో నడుస్తున్నా, రంగి గమనము ఒకసారి నడక, ఒక సారి పరుగుగా నడిచింది. వానికి తానేదో చెయ్యాలని మాత్రముంది. ఆదేమిటో వానికే సరిగ్గా తెలియదు.

ఊళ్ళోకి వచ్చేముందుగా మళ్ళీ వేప చెట్టు దగ్గర విరోధిపక్షంవాళ్ళు కనిపించినారు. శేషఫణి, వెంకటేశం, లచ్చన్న, పీరాన్. తాను దూడను తోలుకవస్తూవుంటే వాళ్ళంతా పొడిచే యెద్దుల్లాగా కోరచూపులు చూస్తున్నారు తనవైపు. తాను వాళ్ళకి దూరంగానే వెళ్ళాలనుకున్నాడు. కాని దూడ వాళ్ళ ప్రక్కగా వెళ్ళింది. లచ్చన్న దాన్ని 'ధాయ్' మని అదలించబోయి చేతి కందగానే దాని వీపుమీద చరిచినాడు. అది వీడు చెయ్యెత్తడం చూడ గానే నడ్డి వంచి పరుగెత్తింది.

'అదేం చేసింది నిన్ను. ఎందుకు కొడతావ్?' రంగి నిలబడి ప్రశ్నించినాడు.

'మా యిష్టం' లచ్చన్న ఠీవిగా అన్నాడు.

'ఏది నీయిష్టం. ఏదీ కొట్టుచూతాం యీసారి' రంగి సవాల్ చేశాడు. దూడ యీ తైగజాలు దాటి పోయింది.

'మమ్మల్ని రాచుకపోతే మేం కొడతాం. దూడైతే మాకేం. నీవైతే మాకేం.'

'ఏదీ కొట్టుచూతాం'

'ఏదీ రాచుకొని పో—'

ఇంతలో దూడ పేరరగంగడి యింటిముందు దొండబోసిన గింజలు తినే వేళకు వాళ్లు దాన్ని తోలి కేకలేస్తున్నారు.

రంగికి దానివెంట పరుగెత్తక తప్పిందికాదు. వాడు వెళ్లుతూంటే పీరాన్—

'మగపిరి వుంటే యెల్లుకోవాలి' అన్నాడు.

'నీ రంగం నా రంగం బాయి కాడా జైరంగం' అభినయంతో పాడి హాస్యం చేసినాడు వెంకటేశం.

కొంచెం దూరంపోయి రంగి ఆగి వెనక్కు వచ్చే వాడిల్లా మళ్ళా తమాయించుకొని—

'పొద్దు తిరిగినాక—ఎల్లుకోండి మీ జట్టంతా.' అని కేక వేసి పరుగెత్తినాడు దూడవెంట.

## 3

వైరం సాధించడంకోసం శేషఫణి ఆ వేళ బడికి నామాలు పెట్టినాడు. ముందురోజు ఆలోచించిన పన్నగడ ప్రకారం ఈరోజు రంగినీ, వాని జట్టునీ చిత్తుచేసి పారేయ్యాలని. కరణంగారి పిల్లవాడవడం చేత బడికి వెళ్లినట్లే వెళ్ళి కడుపు నొస్తూందని దర్జాగా సెలవు తీసుకొని వచ్చినాడు. వెంకటేశం, లచ్చన్న, పీరాన్ అనే వీళ్లలో పీరాన్‌కు బడీ బాదరబందీ యేమీ లేదు. వెంకటేశం, లచ్చన్న, యింట్లో బడికి వెళ్ళు తున్నామని చెప్పి ఎగ్గొట్టినారు. ఏదో గిల్లి కజ్జా పెట్టుకొని ఎట్లాగైనా రంగి నాయకత్వాన్ని పడద్రోయా లని వీళ్ల ఆలోచన.

శేషఫణి మంచి ఆలోచనకర్త. తన ఆలోచనంతా తన జట్టువాళ్ల తలల్లోకి నూరి పోసినాడు.

రంగికిమాత్రం బడితొందర అంతగా లేదు. అయినా కాయకష్టం చేసుకొని బ్రతికే సుబ్బులు కొడుకు చదువుకుంటే యెవరికి కావాలి? చదువుకో కుంటే యెవరికి కావాలి? ఎప్పుడో యిష్టమైనరోజు వెళ్ళడం, లేనిరోజు మానడం. అయినా శేషఫణికి అంటినంత చదువు రంగికి విశేషప్రయత్న మేమీ లేకుండానే అంటింది. ఇంక రంగి జట్టులో తక్కిన వాళ్లూ అనామకులే. అందుచేత వాళ్ళ చదువులూ అంతే.

శేషఫణి జట్టువాళ్ళ ప్రయత్నం చూడగానే రంగికి చేతినిండా పని దొరికినట్లయింది. దూడను

తోలుకొనివెళ్ళి రెడ్డిగారింట్లో కట్టివేయించి, రెడ్డి సాని కొట్టిడీ దొంతికుండల్లోనుంచి కొంచెం బెల్లం పెడితే అది చప్పరిస్తూ వీధిలోకి పరుగు తీసినాడు. తన జట్టులో వాళ్ళకోసం నాలుగు వీధులూ, సందులూ గాలిస్తే చిన్న సుబ్బులూ చంద్రుడూ దొరికినారు. వాళ్ళను కలుపుకొని రంగి దేవాలయంలోకి వెళ్ళి నాడు.

మధ్యాహ్నమవుతూంది. క్రమంగా క్షీణించి పోతూన్న గోపురం నీడలో తక్కువ యిద్దరూ 'పులిజూదం' ఆడుతున్నారు.

'ఏంరోయ్! రంగీ పొద్దుట్నుంచీ లేవేకి!' ఒకడు తలెత్తకుండానే ప్రశ్నించినాడు.

'రెడ్డిగారి దూడకోస మెళ్లాను. నా నాయన పని కెళ్లినాడు.'

'శేషఫణి నీల్గుతుండాడే' రెండోవా డందుకున్నాడు.

'అందుకే వచ్చింది. ఎల్లుకోమని చెప్పివచ్చినా' రంగి అన్నాడు సాభిప్రాయంగా వాడి ముఖంలోకి చూస్తూ.

అంతా కలసి తర్వాత యేదో మంత్రాంగం చేసినారు.

చిన్న సుబ్బులు దగ్గరలో పడివున్న పాడు గాటి కల్లు చెచ్చు నొకదాన్ని తీసుకొని, ఒక చివర అరచేతిలో పట్టి, పిడికిలిమూసి, రెండవచివర వేల మీద తాకిస్తూ పెట్టి, కుడిచేతిపిడికిటికిలు గట్టిగా సవరిస్తూ అన్నాడు—

'ఈ చెచ్చు అయిదుతుంటలవుతే మనం గెలిచి నట్లు. చూడండి' వేళ్ళకు దెబ్బ తగలకుండా బొటన వ్రేలుకూడా లోపలికి మడిచి, చేయెత్తి, పిడికిట వేసినాడు. కల్లురాయి పెళ్లుమంటూ ముక్కలు ముక్కలైంది. చంద్రుడూ, మరొకడూ ఆ తుంటలను లెక్కపెట్టినారు. చిన్నవాటితోకూడా కలుపుకొని పదకొండు!

చిన్న సుబ్బులు రంగి ముఖంలోకి చూచి నాడు. రంగి ముఖం వికసించింది. మాట్లాడకుండా అందరూ కార్యాంతరమగ్నులై తుమ్మల్లోకి వెళ్ళి పోయినారు.

శేషఫణి జట్టువాళ్ళక్కడనుంచి కదల్లేదు. శేషఫణి చాల మొండివాడు. అదే వేపచెట్టు క్రింది అరుగుమీద కూర్చొని తనవాళ్లే చుట్టూ అష్టకట్టగా పెట్టుకొని, జేబులోవున్న వస్తువులన్నీ క్రిందపోసి పరిశీలించి యేరి పెడుతున్నాడు. క్రొత్తగా మింట్ అయివచ్చిన రెండు కానీలు, నాలుగు బలపపు తుంటలూ, ఒక పీమకున్న పుముకొక్క, చతురస్రంగా వున్న అరచేతి జిసల్పు నీలపు సిల్కుగుడ్డ, యింకా యేవేవో సామాన్లందులో వున్నయ్.

సాయంత్ర మవుతూంది. పదిగంటలవేళ భోజనానికి వెళ్ళడం తప్పితే వాళ్లక్కడకూ కదల్లేదు. ఉదయంనించీ యీ 'ఎదురొక్కలు' కుదరనూ లేదు. తక్కువవాళ్ళకు విసుగు కలుగుతూంది.

'భయపడిపోయినారు. ఇంకరారు' లచ్చన్న అన్నాడు.

శేషఫణి పలుకలేదు. అరుగుమీద వెల్లకిలా పండుకొని వాళ్లెలా యెదుర్కొవడమా ఆలోచిస్తూన్నాడు. ఒకరినొకరు యుద్ధాని కాహ్వానించుకున్నారు గనుక వేరే మిష యేమీ అక్కర్లేకుండానే రంగంలోకి దూకవచ్చునని శేషఫణి నిర్ణయం. ఇంకొక వేదైనా క్రొత్తది రావాలన్న కోరిక లేదు వాడికి. నిజంగా లోపల యేదో బెరికిగా వుంది. ఎదుర్కోవడంలో క్రమ మిట్లా వుండా లనుకున్నాడు. తామే ముందు పైన బడాలి. లచ్చన్న, పీరాన్ ముందు కలియబడాతారు. తర్వాత తాను. తనకు సాయం వెంకటేశం.

రంగి జట్టు తుమ్మల్లోనుంచి తిరిగి వస్తున్నది. వాళ్లు ఒకరిబుజాలమీద ఒకరు చేతులు వేసుకోవడం లేదు. విడివిడిగా వస్తున్నారు. ఆలయంప్రక్క నుంచివస్తూ గోపురాన్ని చూడగానే రంగికి సంవత్సరం క్రిందటి ఎంకటి చావు గుర్తుకొచ్చింది. గోపురంపైనుంచి ఎంకటి పడి చచ్చినాడు. ఆవేళ తానుకూడా వాడితోపాటు పందెం వేసుకొని గోపుర మెక్కినాడు. కాని తా నెలాగో జాగ్రత్తగానే దిగి వచ్చినాడు. చచ్చిపోయిన తర్వాత ఎంకటి యెక్కడికి పోయినాడో తన కేమీ అర్థం కాలేదు. ఇన్ని విషయాలు ఆలోచించే బుద్ధికి దాన్ని కనుక్కోలేకపోయ్యేటప్పటికి వానిగుండెల్లో యెక్కడో ఆకాశంవంటి అఘాతం యేర్పడి, తెలియని దేదో అటూ యిటూ కొడుతూ నొప్పి కలిగిస్తూంది. రంగికి భయమూ, దుఃఖమూకూడా కలిగినయ్. తర్వాత గూడా రమణప్ప తాత ఎంకటినిగురించి చాల మంచిగా మాట్లాడుతూంటే తాను విన్నాడు. 'ఎంకటి దేవుడికోసం గోపుర మెక్కినాడన్నాడు' తాత ఒకసారి. అయితే తానుగూడ ఆవేళ యెక్కిన

వాడే. తాను దేవునికోసమెక్కలేదే. ఆ సంగతి తనకు బాగా తెలుసు. అయినా ఈ రమణప్పతాత ఒకడు! రానుదాను దేవాలయంలో స్వామికి, తాతకూ ఆట్టే భేదం కనిపించకుండా వస్తూంది రంగి మనస్సుకు. ఇద్దరూ తన కర్థం కావటంలేదు! ఇద్దరూ యెప్పుడూ ఆలయంలోనే వుంటారు!!

ఆలోచిస్తూ వస్తూన్నవాడల్లా రెండోపక్షం వాళ్ళను చూచేసరికి మరో ప్రపంచంలో పడినాడు రంగి. సరిగా క్రిందటిదినపు వేళ అయింది. శేషఫణి జట్టు యేదో సన్నాహంలో వుంది. పీరాన్ బలపాలను బండమీద సన్నగానూరి, బుగ్గలనిండా గాలి పూరి, నున్నటి బుగ్గమీద బలపపు కొస తాకించి, దాన్ని తిప్పుతూ వాడి పరీక్షిస్తున్నాడు.

వీళ్లనిచూచి వాళ్ళు అగుడు దిగినారు. కంఠం సవరించుకోవడాలూ, కేకరింతలు మొదలైనవి. రంగి పక్షంవాళ్లు మాట్లాడకుండా చెట్టుదాటి నడుస్తున్నారు. మళ్ళీ చల్లగాలి చిలుచేదుతో ప్రారంభమైంది. బాగా వీస్తున్నది.

రంగి జట్టుకు ప్రక్కగానే కొంత దూరంలో వాళ్ళూ వస్తున్నారు. దగ్గరలోనే వున్న మైదానంలోకి పోవాలని రెండుపక్షాలకూ తెలుసును. నడక బరువుగా, మందంగా సాగుతూంది.

ఇంతలో రంగి ఒకపని చేసినాడు. వంగి ఒక రాయి తీసుకొని ముందురోజు తాను కూర్చున్న పెద్ద బండను గురిచూచి బలంగా విసిరినాడు. రాయి ఫట్‌మంటూ ఢీకొని నిప్పు రవ్వ యెగిరింది. రెండో పక్షంవాళ్ళు చూచినారు. రంగి పక్షం గర్వంగా మార్గోన్ముఖమైంది. శేషఫణి జట్టులో లచ్చన్న జేబులోనుంచి చిన్న వరిత్రాడు తీసి తన యెడమ కాలికి చుట్టుకున్నాడు. శేషఫణి గర్వంగా చూస్తున్నాడు. కుమారాస్త్ర విద్యా ప్రదర్శనంతో నే కురుక్షేత్ర ఘట్టం ప్రారంభమైందని వాడికేం తెలుసు?

'ఏయ్ వరిత్రాడు తీస్తావా లేదా?' దూరం నుంచే రంగి గద్దించినాడు. రంగి పక్షంలో వాళ్ళు తటాలున ఆగి చూచినారు. రంగి జట్టులో రంగి, చంద్రుడు ముందున్నారు. తక్కిన యిద్దరూ రెండవ వరుసలో వున్నారు. అయినా రంగికాని చంద్రుడుకాని చలించలేదు. గంభీరంగా నిదానంగా వున్నారు. వాళ్ళిద్దరి చొక్కాలు గాలికి పూరిన వానివలె ఎత్తుగా వున్నయ్.

'మగసిరి వుంటే గెల్చుకోండి' శేషఫణి అన్నాడు. లచ్చన్న మాట్లాడలేదు. 'ఎవడికిరా మగసిరి?' రంగి జంటలో వాడు లచ్చన్నమీద పడినాడు. శేషఫణివాడిమీద పడగానే రంగి వాళ్ళలో పరికి శేషఫణిని వెనక్కులాగి పెనవేసుకున్నాడు. ఇంతలో పీరాన్, వెంకటేశం కలయజేసుకోగా రంగి జట్టులో తక్కినవాళ్ళు హుంకరించి, ఊరుఘట్టనం చేసి యెగిసినారు. అంతే!!

శేషఫణి కళ్లు నెత్తురులు చిమ్ముతూ, అర్చి, నాల్క జాపి విషం కురుస్తున్నాడు. పల్చగా వున్న శరీరంలో ప్రతినాళ మూలంలోనుంచి శక్తిని లాగుతున్నాడు. కాని చాలటం లేదు. రంగి శరీరంలో శక్తి అన్ని భాగాల్లోను సమానంగానే ప్రసరిస్తూండా అన్నట్లు అంతగా చలించడం లేదు.

రంగి శేషఫణి చొక్కా కాలరువద్ద చేయివేసి యీడ్చినాడు. వాడు క్రిందికి వంగి రంగిని కాలుపట్టి క్రింద వేయబోయేసరికి ఒకరి శరీరాలొకరికి గాఢంగా హత్తుకున్నయ్. శేషఫణికి కడుపుమీదంతటా సన్నని బాకులతో గ్రుచ్చినట్లయ్యింది. కాని పట్టు విడిపించుకోను సాధ్యపడలేదు. మొండిగా లాగేవేళకు తన చొక్కా భుజాలక్రిందుగా చినిగి రంగి గోళ్లు చీరుకపోయినయ్. నెత్తురు పల్చగా కనిపిస్తూంది. శేషఫణి క్రిందబడినా రంగి వదల్లేదు. అవతల లచ్చన్న, పీరాన్, వెంకటేశంతో తన జట్టువాళ్లు పోరాడుతున్నారు. చేతికందగానే లచ్చన్న కాలుబట్టి లాగేవేళకు వాడు నేలపైబడినాడు. కాలికున్న వరిత్రాడు రంగి చేతులోకి వచ్చింది. వాడూ లేచేవేళకు చిన్న సుబ్బులు వాడి డొక్కపోటు పొడిచినాడు. 'అమ్మా' అంటూ లచ్చన్న కడుపు పట్టుకొని కూర్చున్నాడు.

కొంతసేపటికి కొట్లాట ముగిసింది. శేషఫణి యేడుపు లంకించుకొని ఊళ్ళోకి వెళ్ళిపోయినాడు. వానికడుపుమీదంతా సన్నటి దద్దురులూ, నెత్తురు చుక్కలూ. లచ్చన్న కుంటుతూ మరొక త్రోవ తీసినాడు. తక్కినవా ళ్ళెట్లా పోయినారో తెలియదు.

జట్టు చెదరి మన్ను పూసుకున్న బట్టలతో రంగి జట్టువాళ్ళుమాత్రమే మిగిలినారు. రంగీ, చంద్రుడూ జాగ్రత్తగా చొక్కా క్రింద పెట్టుకొని వచ్చిన సన్నటి తుమ్మకంపతీసి దూరంగా విసరినారు!!

వరిత్రాడు చేతబట్టుకొని రంగి ఊళ్ళోకి నడిచినాడు. వాడికీ, కాళ్ళూ, చేతులూ రాచుకపోయినయ్. వరిత్రాడు రాచుకున్నప్పుడల్లా శరీరంమీద

యెక్కడో ఒకచోట చర్రుమంటూంది. ఒకరి చొక్కా దుమ్మొకరు విదులుస్తూ తక్కినవాళ్ళు రంగి ననుసరించినారు.

చావట్లో అటుకేసి మొహంచేసి మాట్లాడుతుంటూన్న వాళ్ళల్లో రంగి వీపు 'ఫడీల్' మనేవరకు చైతన్యం కలిగింది. రంగి కండ్లల్లో నీళ్ళతో యెగిరిపడి లేచినాడు. యెదట కరణంగారేమో ననుకున్నాడు. రంగి వాయచే! సుబ్బులు!! తుంట పగ్గంతో ఒకటే బాదటం. రంగి రాగాలుపెట్టి యేడ్చినా వదల్లేదు. తక్కినవాళ్లు వుడాయించినారు. రంగి వీపు మ్రోగి పోతున్నది.

'కరణంగా రబ్బాయిని కొట్టి యీవూళ్ళో బ్రతుకుదామనేనా...' మధ్యమధ్య మాటలు వినిపిస్తున్నయ్. వీధిలో వాడివిలాగగా, వాడి బరువుకుపడిన జాడ కనిపిస్తూంది.

రంగికి దెబ్బలు వినిపించటం లేదు వాటి ప్రతిధ్వనులే వినిపిస్తూన్నయ్. ఇంతలో యెక్కడనుంచో రమణప్ప తాత దేవుడివలె కనిపించినాడు. సుబ్బులు చేతుల్లో త్రాడు లాగి అవతల పారవేసినాడు.

'నీకేమైనా మతిపోయిందా పిల్లవాడి నంతగా బాదితే వాడేమైనా బ్రతికాలా?' తాత తీవ్రంగానే అన్నాడు.

'కరణంబాబు గారి అబ్బాయిని కొట్టేవాడండి... వాళ్ళజోలికిపోతే మనకీవూళ్లో నిలువనీడుంటుందా?' సుబ్బులు తీవ్రంగా శ్వాస పీలుస్తూ, మధ్య మధ్య రంగిపై వురుముతూ, తాత పారవేసిన తుంటపగ్గం మళ్లీ తెచ్చుకున్నాడు. కాని కొట్టలేదు.

శేషఫణి కథాపద్ధతి యెట్లా నడిచి వుంటుందో రంగి వూహించుకున్నాడు!

'లేదుతాతా వాళ్ళే మమ్మల్ని కొట్టాలని చూచినారు. మమ్మల్ని యెల్లకొమ్మంటే...కొట్లాడినాము...పైగా లచ్చిగాడు మమ్మల్ని చూచి కాలికి వరంటు యేసుకున్నాడు' రంగి సగం యేడుపూ సగం మాటలుగా చెప్పుకపోయినాడు.

'పరిత్రాడేసుకున్నాదూ! అరి భడవా!!... అయితే తీయించినావా?'

రమణప్ప తాత అడిగినాడు రంగి వీపుమీద దెబ్బలు చూస్తూ.

రంగిచేతులోనుంచి యింకా వదలని పరిత్రాడు చూపించినాడు. హాసరేఖ ఈషత్తుగా వాడి మొఖంలో కనిపించి అదృశ్యమైంది.

'భేష్! మనమడు మహారాజ కార్యంచేసి సాధించినాడోయ్ సుబ్బులూ.

వాణ్ణింక నీవేమీఅనకూడదు...పిల్లలుచేసేవన్నీ మహారాజ కార్యాలే.'

తాత రంగి తల నిమురుతూ నవ్వుతో అన్నాడు. సుబ్బులు సగం చల్లారి విసురుగా వాడి వైపొకసారి చూచి వెళ్లిపోయినాడు.

'గట్టివాడవురా మనమడా! ఇంకెప్పుడూ కొట్లాడకు' సుబ్బులు పోగానే రమణప్ప తాత ముందుకు పోయినాడు.

ఐదునిముషాలకు గాని రంగి బాగా తేరుకో లేదు. చూచేవేళకు కనుచీకటి పడింది. చుట్టూ యెవరూ లేరు.

తాత తనను మహారాజన్నాడు. రంగి మనస్సులో యేదో తృప్తి, అహంకారమూ తాండవించినయ్. ఇంతలో పరిత్రాడు జ్ఞాపకం వచ్చింది.

రమణప్ప తాత తీసుకపోయినాడు!

తన విజయాన్నెవరో అపహరించినట్లయింది రంగి మనస్సులో.

తానెవరికోసరం పోరాడినట్టు? దేవాలయంలో గంట మ్రోగింది.

అయితే ఎంకటి యెవరికోసం చచ్చిపోయినట్టు? మళ్లా ఆలయఘంటిక మ్రోగింది. రంగి చెవులు గింగురుమంటున్నయ్. ఇంతలో దగ్గరలో యెక్కడో ఒక పందెపు కోడి కొక్కొరోకో అని కాహళం పట్టింది.

ఆలయ ఘంటిక మళ్లా మ్రోగింది!!!



# అలంకారములు






శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

ముప్పదియారు లక్షణములను, ప్రధానము లగు నాలు గలంకారములను భరతుడు చెప్పినాడు. భరతునితర్వాత కొన్నిలక్షణము లలంకారముల శ్రేణిలోనికి ప్రవేశించసాగినవి. లక్షణము ఆశీస్ కొందరిచే నలంకారముగా గణించబడినదని భామహుం డనినాడు. దండి, భట్టి దీని నలంకారమనినారు. భామహుడు నిరసించిన హేతువను లక్షణమును దండి ఉత్తమభూషణమనినాడు. వాస్తవాలంకారవర్గములోనిదిగా రుద్రటుడు దీని నంగీకరించినాడు. ఉద్భట మమ్మటులు దీనిని నిరసించినారు. రాను రానలంకారముల సంఖ్య విపరీతముగా పెరిగిపోయినది. ప్రతిఆలంకారికుడు తన ఇచ్చవచ్చినట్లు తన బుద్ధికుశలతను ప్రదర్శించి ప్రతి అలంకారమును విశ్లేషించుటచే నలంకారశాస్త్ర మొక క్లిష్టతర్క గ్రంథముగా నైనది. కాని అతిప్రాచీనుల వ్రాతలలో నిన్నియలంకారములుగాని, ఇవి జూపు క్లిష్టకావ్య రచనగాని కన్పించవు. పైగా శబ్దాలంకారములు, అర్థాలంకారములు, ఉభయాలంకారములునని మూడు రకములుగా వేరు వీటిని మనము వ్యవహరించుచున్నాము. ఇది యుక్తిపై నాధారపడి యున్నవా? లేక ప్రాచీన విమర్శకుల వ్రాతలపై నాధారపడి యున్నవా? అను ప్రశ్నలను వివేచింపవలసి యున్నది.

భరతుడు యమకమను శబ్దాలంకారము నొకదానిని, మూడర్థాలంకారములను చెప్పియున్నాడు. దశవిధయమకములను వివరించినను ఇది శబ్దాలంకారమని, భరతు డనలేదు. భామహోద్భటులుగూడ ఈ శబ్దార్థవిభాగము నలంకారములలో గ్రహించినట్లు కన్పించదు. కాని

"రూపకాది మలంకారం
బాహ్యమా చక్షతేపరే
సుపాంతిఙాంచ వ్యుత్పత్తిం
వాచాం వాంఛం త్యలంకృతిమ్
తదేతదాహుః సౌశబ్ద్యం
నార్థ వ్యుత్పత్తిరీదృశీ
శబ్దాభిధే యాలంకార
భేదాదిష్టం ద్వయంతునః"

అని భామహుడనినాడు. రూపకాద్యలంకారములు బాహ్యములగుటచే నంత ప్రధానములు కావని, సుశబ్దముల నుపయోగించుటయే వాగలంకృతి యని కొందరనివారట. సౌశబ్ద్యమే ప్రధానాలంకారమని వీరి భావము. ఈ ప్రాచీనవాదము నంగీకరించ జాలని మాఘుడు "శబ్దార్థౌ సత్కవిరివద్వయం విద్వా నపేక్షతే" (2.86) యనినాడు. మాఘ, భామహులు శబ్దము నొక్కదానినే గాని, అర్థము నొక్కదానినే గాని ప్రధానముగా గ్రహించజాలనివారు. శబ్దార్థములకు సమప్రాధాన్యము గలదు. ఐనను సౌశబ్ద్యమును, అనుప్రాస, యమకము అను శబ్దాలంకారములను, కొన్ని అభిధేయాలంకారములను లేక అర్థాలంకారములను భామహుడు ప్రస్తుతించినాడు.

గౌడీరీతిలో అనుప్రాస ప్రధానమని చెప్పి, దీనిని దండి వివరించినాడు. మూడవ ప్రకరణమున యమకమును, చిత్రమార్గములను విశదముగా చెప్పినాడు. గుణదోషాలంకారములను శబ్దార్థపరములుగా విభజించినవాడు వామనుడు. కాని ఉద్భటు నిశ్లేషాలంకార నిర్వచనోదాహరణములు ఈ విభాగమునకు మూల భూతిమైనట్లు రాజానక తిలకుని వివృతి యందు కన్పించుచున్నది. తిలకుని వ్యాఖ్యనుండి ఆశ్రయాశ్రయి భావవాదము, అన్వయ వ్యతిరేక వాదము బయలుదేరినవి. తిలకుని కుమారు డగు రుయ్యకుడాశ్రయాశ్రయి వాదమును, మమ్మటుడు అన్వయవ్యతిరేకవాదమును చేబట్టిరి. తిలకుడు రెండు వాదములను స్వేచ్ఛగా ప్రయోగించినట్లున్నది. శ్లిష్ట పరంపరిత రూపక వ్యాఖ్యావసరమున శబ్దముద్వారా అర్థ మలంకృతమగుచున్న దని చెప్పుచు, అలంకారార్థము శబ్దముపై కవి వ్యాపృతుడగుటచే నిట శబ్దాలంకారమే గలదని చెప్పు తిలకుడు

"అత్రశబ్దముఖేనార్థస్యవిచిత్రత్వేఽపి ముఖ్యతః కవి ప్రతిభాసంరంభ గోచరస్యశబ్దస్య వైచిత్ర్య మితి శబ్దాలంకారత్వం యుక్తమ్"
అనినాడు. శ్లేషాలంకారవ్యాఖ్యలో నింకను స్పష్టముగా తన భావమును వ్యక్తపరచినాడు.

అలంకార మొక వైచిత్ర్యము. ఈ వైచిత్ర్యమును రూపుటకు కవి భావనవ్యాపృతి మగును. కవి ప్రతిభా సంరంభగోచర మగు అర్థ మలంకార్యము, తద్ధర్మ మలంకారము. ఉద్దిష్టార్థము శబ్దమైన నిచట శబ్దాలంకారము రాగలదు. కవి అర్థము నుద్దేశించి వ్యాపృతుడైన నర్థాలంకారము సిద్ధించును. కవి దేని నుద్దేశించి వ్యాపృతుడైనాడో తెలియవలెనని అన్వయ వ్యతిరేక భావము సంశయ నివృత్తి చేయగల దని చెప్పుచు

"కావ్యే దోష గుణాలంకారాణాం శబ్దార్థగతతయా అన్వయ వ్యతిరేకాభ్యాం విభాగః క్రియతే. నచ భానుదీప్యమానాదిశబ్దపదావ్యావేఽలంకారోఽన్యత్రేతి శబ్దాన్వయ వ్యతిరేకాను విధాయినోఽస్యశబ్దాలంకారత్వ మేవయుక్తమ్"
అని తిలకు డనినాడు. అన్వయ వ్యతిరేక వాదములో గుణదోషాలంకారములు శబ్దపరము లైనవి, కానివి తెల్పవలెను. "స్వయంచ పల్లవా తామ్ర భాస్వత్కర విరాజితా" అను శ్లోకములో "భాస్వత్కరవిరాజితా" అనుటకు బదులు "భానుదీప్యమానా" అను పర్యాయ పదములతో నీ శ్లోకమును పఠించితి మేని ఇచట గల అలంకారము మాయ మగును. ఇచట శబ్దమే ప్రధాన మగుటచే నిది శబ్దాలంకారమే కాగల దని భావము. ఉద్భట, ప్రతీహారేందురాజు లీ శ్లోకము నర్థాలంకార మనిరి. కాని తిలకు డీ శ్లోకమును శబ్దాలంకారముగా వ్యాఖ్యానించినాడు. శబ్దములను మార్చినను శ్లేష నిలచినచో అర్థాలంకారమగు శ్లేష రాగలదు.

కాని ఈ అన్వయ వ్యతిరేకవాదము నంగీకరించితి మేని శబ్దాలంకారమనగా శబ్దమూలమగు అలంకారమనవలెను. శబ్దముద్వారా మన కలంకారము వేద్యమగును. అంతేగాని శబ్దముయొక్క అలంకార మనరాదు. ఈ ఆశంకకు తిలకుడిచ్చిన సమాధానమంత తృప్తిగా లేదు. అలంకారమనగా వైచిత్ర్యమగుటచే, వైచిత్ర్యము శబ్దనిష్ఠమైన శబ్దాలంకారమని, అర్థనిష్ఠమైన అర్థాలంకారమని తిలకుని సమాధానము.

"ఏవ మాదౌ శబ్దమూలోఽలంకారః, నతు శబ్దస్యాలంకార ఇతిచేత్, ఉక్తమత్ర-వైచిత్ర్య మలంకార ఇతి; యద్వైచిత్ర్యం తస్యాలంకార ఇతి యథోక్తమేవ"
అనినాడు. ఏది వైచిత్ర్యహేతువో, తత్సంబంధమైనది అలంకార మంటిమేని వైచిత్ర్యాశ్రయమును మనము గమనించవలెను. కావున ఆశ్రయాశ్రయిభావమే అలంకారమును నిర్ణయించగలదను తాత్పర్యము రాగలదు. తిలకుడు చూపిన శబ్దశ్లేషలలో వైచిత్ర్య మర్థధర్మముగా గూడ గలదు. ఈ స్థలములలో అలంకారత్వము శబ్దాన్వయమునుగూడ వదలజాలదు గనుక ఇచట ఉభయాలంకారములను చెప్పవలసి వచ్చును. కావున

"భవంతువా పరమేవంభూతా ఉభయ స్యాలంకారః, నార్థస్యేతి, విచార్యమేతి ద్విద్వద్భిః; నతు స్ఫుటత్వేనా యుతిత్వమ్"

అని చివరకు తిలకుడనినాడు.

మమ్మటు డన్వయ వ్యతిరేక వాదము నంగీకరించెను. నవమోల్లాసమున

"ఇహ దోషగుణాలంకారాణాం శబ్దార్థ గతత్వేన యో విభాగః సోఽన్వయ వ్యతిరేకాభ్యామేవ వ్యవతిష్ఠతే. తథాహి కష్టత్వాది గాఢత్వాద్యను ప్రాసాదయో వ్యర్థత్వాది ప్రౌఢ్యాద్యుపమాదయ స్తద్భావతదభావాను విధాయిత్వాదేవ శబ్దార్థ గతత్వేన వ్యవస్థాప్యంతే"
అని తన సిద్ధాంతమును సూక్ష్మముగా వివరించి, శ్లేషాలంకార నిర్వచనమునకు బయలుదేరినాడు. వైచిత్ర్య మలంకారమని, కవి ప్రతిభాసంరంభ గోచర మేదియగునో తన్నిష్ఠమలంకారమని అంగీకరించనిచో శబ్దగుణాదులు అర్థగుణాదులు కావలసి వచ్చునని నాడు. అను ప్రాసాదులకు శబ్దగుణదోషములకు అర్థాపేక్ష యుండుటచే నివియన్నియు అర్థాలంకారములే కావలసివచ్చును. కాని శబ్దములేనిదే అర్థపరామర్శయే సంభవించకపోవుటచే నన్నియు శబ్దాలంకారములే కావలెను. శబ్దాలంకారమగు పునరుక్తవదాభాసను, ఉభయాలంకారమగు పునరుక్తవదాభాసను చెప్పి

"అత్రవికస్మిన్ పదపరివర్తితే నాలంకార ఇతి శబ్దాశ్రయః, అపరస్మింస్తు పరివర్తితేఽపి సన హీయతే ఇత్యర్థనిష్ఠ ఇత్యుభయాలంకారోఽయమ్"
అనినాడు. శ్లేషవిషయమునగూడ నిదేవాదమును చేబట్టినాడు. శబ్దపరివర్తమైనను శ్లేషత్వఖండన లేనిచో నర్థశ్లేషయని చెప్పవలెనని నాడు.

రుయ్యకుఁ డాశ్రయాశ్రయిభావము నంగీకరించి, తన అలంకార సర్వస్వమున

"లోకవదాశ్రయాశ్రయి భావశ్చ తదలంకార నిబంధనమ్. అన్వయ వ్యతిరేకాభ్యాం తత్కార్యత్వే ప్రయోజకో న తదలంకారత్వే. తదలంకార ప్రయోజకత్వేతు శ్రౌతోప మాదేరపి శబ్దాలంకారత్వ ప్రసంగాత్, తస్మాదాశ్రయాశ్రయిభావే నైవచిరంతనమతాను సృతిరితిభద్రమ్"

అనినాఁడు. ఆశ్రయాశ్రయి భావమే అలంకారనిబంధనము. అన్వయి వ్యతిరేకవాదముద్వారా శబ్దములంకార కారణమా? లేక అర్థములంకార కారణమా? యను సమస్యను తేల్చఁగలము. కాగా శబ్దకార్యమగు నలంకారమని, అర్థకార్యమగు నలంకారమని చెప్పఁగలము. శబ్దాలంకారమున శబ్దముతోటి అన్వయముండవలసినచో 'ఇవ' శబ్దాన్వయము కలిగిన శ్రౌతోపమను శబ్దాలంకారమనవలసివచ్చును. కాని ఈ 'ఇవ' (= వలె) శబ్దముతో విశిష్టమగు వైచిత్ర్యమేమియు శ్రౌతోపమకు రాకపోవుటచే నిట అలంకారమే లేదనవలెను. పైగా శ్రౌతోపమ నర్థాలంకారమని నిర్వివాదముగా వ్యవహరించుచున్నాము.

కర్ణాశ్రితమైన కుండలము కర్ణాలంకారమని లౌకిక వ్యవహారముగలదు. ఇట్లే శబ్దాశ్రితమైన అలంకారము శబ్దాలంకారమగును. ఆశ్రయాశ్రయి భావమనగా ఉపస్కార్యోపస్కారక భావమగుటచే

"యోఽలంకారః యదుపస్కారకః, సతదలంకారః"

అని జయరథుఁడు రుయ్యకుని వ్యాఖ్యానించెను. 'ఇవ' శబ్దము వైచిత్ర్యవహము కాదుగాని శ్రౌతోపమా కారణమగుచున్నది. శబ్దములంకృతమైనచో నలంకరించునది శబ్దాలంకారమగును. ఇట్లే అర్థములంకృతమైన నలంకరించునది అర్థాలంకారమగును.

ఆశ్రయాశ్రయి భావమును నిర్ణయించుటకైనను అన్వయ వ్యతిరేకవాదము నవలంబించక తప్పదని దశమోల్లాసాంతమున మమ్మటుఁడనినాఁడు. అన్వయ వ్యతిరేకభావము ననుసరించి శబ్దాలంకారముల నర్థాలంకారములనుండి విభజింప నెంచితిమేని పునరుక్తవదాభాస, పరంపరిత రూపకములవలె అర్థాంతరన్యాసాదులుగూడ నుభయాలంకారములు కావలసి వచ్చును. అర్థవైచిత్ర్యమే ఇచట ప్రధానముగా నున్నంత మాత్రమున అర్థాలంకములుగా వీటిని గ్రహించుట ప్రామాదికమగును. కావుననే మమ్మటుని వ్యాఖ్యానించుచు నాగోజీ భట్టు అలంకారము లన్నియు ఉభయాలంకారము లనినాఁడు.



# విధురగీతము



శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి

ఎదనుడికించు నీ బ్రతుకు కేడ్పుల త్రోవలబోయి పోయి, యే
యుదయము గానరాని మరణోదధి గ్రుంకిన రాగరేఖలన్
బొదవెను నైల్యముల్ వికృత ఘూత్కృతులం బొనరించి నిచ్చలున్
మది నురియింప, నేపరమ మాధురి పల్కుల దేలి వచ్చెడిన్!

జీవితమంత దంతురిత చిత్ర నియంత్రిత యంత్ర దంష్ట్రిలన్
చావయి, సారముల్ దొలగు చప్పిడి పిప్పయి, రాగజుష్ట ధీ
శేవధి యూటెసంగునొకొ! శిష్టకళా కమనీయ కాంతి రే
ఖావధు లూహితంబయి వికాసము దేరునొకో సిసృతులో!

తూరుపు కొండ నెత్తముల దోరముగా నొక ప్రావృడభ్రమే
పార, దమింజలింతు కవిభావన క్రొమ్ముడి విప్పినంచు, పొం
గారిన నామెడంద నెదొ కాటిక పెట్టెడు నాచి, యంత నీ
నీరవమూర్తి కన్నులకు నీరదపంక్తి కలంచు చామెయా!

జీర్ణ గృహాంగణమ్మున విచిత్రముగా చివురాకు మోది వి
స్తీర్ణమునన్ వసంత మధుజీవన రక్తుల నామతించి, యు
త్తీర్ణ కళా విజృంభణల దేరిన యీ మెలమాపు మోకయే
శీర్ణ హృదంతరమ్ము నను చిక్కని కోర్కుల పూంత వెట్టదో!

నిచ్చలమైన కాంతి రమణీయముగా నెద జాజి వాలి, నే
యచ్చపు భావపఙ్క్తిమ విహారములన్ లసమాన చారి మో
ద్యచ్ఛ తురప్రగల్భ తరహావములన్ దులకించి, నాకృతుల్
విచ్చిన పాలవెల్లి తెలి వేకువ రేక హొయల్ జిగుర్చునో!

అసమాన మైన బ్రతుకుల
పినమున్ బునకొట్టు జంతు భేదమ్ములతో
ననలుకొను మనికి గదల వొ
యొనపరి కవితావధూటి యొయ్యారమ్ముల్!

—•—

# నిజమయిన కల



శ్రీ కలపటపు రామగోపాలరావు



అంతా విని పక్కున నవ్వేసింది పార్వతి!

సమయం, నాలుగో ఝాము రాత్రి. స్థలం, గుమాస్తా గురునాథం నెలకి నలభైరూపాయలవొప్పున అద్దెకు సంపాదించిన గదిలో పడకభాగం. విషయం, అంతక్రితమే అతనికొచ్చిన కల—

అతిఉత్సాహంగా లేచి కాళ్లు కడుక్కొని కూచున్నాడు, మళ్లీ పడుకుంటే ఫలితం దక్కదని. అప్పటికే, పక్కమీద పార్వతి కదలడం గమనించి, ధైర్యంచేసి మెల్లిగా తట్టి లేపాడు.

"నిజంగా ఎంత బాగుందనుకున్నావా పట్టుచీర!—"

"పట్టుచీరా? ఏం పట్టుచీర?" అని లేచికూచుంది పార్వతి.

అయినా, కొంత ఉపోద్ఘాతం ఉంటేనేగాని అసలు గ్రంథానికి విలవుండదని—

"అదే, నువ్వు కట్టుకున్న బనారసు పట్టుచీర!" అని కొంటెనవ్వొకటి విసిరాడు.

"చాల్లెద్దురూ, మీ హాస్యాలూ మీరూను! అర్ధరాత్రివేళ అంకమ్మ శివాలని యిందుకేనా యేమిటి ప్రత్యేకంగా పనిగట్టుకు లేపారు? పన్నెండేళ్లనించి కాపురంచేస్తుంటే, పట్టుమని పుత్రి మైనవి నాలుగు కట్టుడుచీరలైనా కొనిపెట్టలేకపోయారుగాని, పట్టుచీరకూడాను యీ మొహానికి? ఏదో, పక్కయింటావిడ కొనుక్కుందంటే, పోనీ సంవత్సరాదిపండగ వస్తోందని, నోరు చేసుకొని అడిగాను. ఎల్లాగూ మీవల్ల కావప్పుడీ ఎత్తిపొడుపులుకూడా ఎందుకు పైగాను?"

"అబ్బా, ఎత్తిపొడుపు కాదే! నిజంగా నాకళ్ళతో నేను చూశానంటుంటే! సరిగ్గా ఆ వెంకుబాయమ్మ చీరలాగే నెమలిపింఛంరంగా ఆవేళ నువ్వు 'కన్నాటుప్లేసు' దుకాణంలో బొమ్మనిచూసి విస్తుపోయావే, అల్లాంటిదే పమిటంచూ, జరీపోదలూను! పైగా, అంతా ఏదో వన్నెల పులిమినట్టు మసలితేమసలికే మిసమిసలాడిపోతూ వుంది. ఆ చీర కట్టుకుని, నువ్వాకారులో పక్కనే కూచున్నావు, పోలిక తెలియలేదంటే నమ్ము!"

"కారా?—మీకేమన్నా కలవచ్చిందా యేమిటి ఖర్మం?"

"కర్మమేమిటి? నాలుగో ఝాము కల వూరికే పోదంటారు!—అంబాసిడేనుగలాగ ఎంత హుందాగా వుందనుకున్నావా కారు? నల్లగా నిగనిగలాడిపోతూ వుంది!...లోపలేదేదెనా...మెత్తటి పట్టుపరుపులు!...గాలిమీద తేలినట్టుందేగాని, ఎక్కడా కూచున్నట్టేలేదు అంతసేపూను!—" అని కలలో పట్టిన కారు యోగం వివరంగా వర్ణించి చెప్పాడు. అంతా విని పక్కున నవ్వేసింది పార్వతి.

"ఎందుకా వెర్రినవ్వు? ఏమో, నాకూ కారెక్కే యోగంవుందేమో ఎవరు చూడొచ్చాడు?"

"నాకా వెర్రి, మీకా?......మన చూపుమేర దూరంలో వున్నవాళ్ళకైనా అట్లాంటి యోగం కనిపించ లెక్కడాను!...ఏమిటో, పుట్టెగరలేనమ్మ స్వర్గానికెగరబోయిందనీ— చంటిపిల్లకటీని చిన్నరం బంగారం పెట్టలేకపోయారు...కుర్రవెధవలిద్దరికీ స్కూలుజీతాలు ప్రతినెలా 'ఫైను'లతో గాని కట్టడం పడటంలేదు...ఆఖరికి, వున్న నాలుగు చీరెలూ చిరుగెట్టాయంటే, యిదుగో అదుగో అని యిప్పటికి మూడునెలలనించి జరుపుతున్నారు. అటువంటిది—"

"అంతేలే, ఎంతసేపూ నీ గొడవా నీ పిల్లల గొడవాను, అక్కడికి నేనేదో మహా అనుభవించేస్తు

న్నట్టు!......బస్సుకి డబ్బు పొయ్యలేక, రోజూ పన్నెండుమైళ్ళు సైకిలుమీద వీకుస్తుంటే అక్కర లేదు...రెండోకోటయినా లేకుండా—"

"అందుకే, ఎక్కడున్నావే గొంగళీ అంటే, వేసినచోటనే కంబళీఅని వూరుకోక, యీ పిచ్చిపిచ్చి వూహాలు దేనికంట!... పెద్దకారుట!...నాకు బనారసు పట్టుచీరట!...అంతే లెండి, అటువంటివన్నీ, కలలో చూసి సంతోషించాల్సిందే యీ జన్మకింక!"

"అదుగో, ఆమాటే అనవద్దన్నాను! అదృష్టం మారితే ఎంతసేపు కావాలి చెప్పిరావా? నిచ్చెనెక్కడం ఒక బ్రహ్మాండమా?—మనకీ మంచిరోజులొస్తున్నాయి. అందుకు సూచనగానే—"

"యీ నాలుగోఝాముకల!...బాగుందివరస! పగలు రోజూ కంటున్న కలేగా, యివేళ రాత్రి కూడా వచ్చినట్టుంది!......'కారుకావాలి, కారుకావాలి' అని కలవరిస్తుంటే కలేనా రావద్దూ ఖర్మం!"

"అదికాదే, వచ్చేనెలే నా 'యింక్రిమెంటు' కూడా—"

"అయిదు రూపాయలు! దాంతో మీకో కారూ, నాకో పట్టుచీరా, దుకాణంవాడి బాకీ యాభయ్యో—"

"చాల్లే వూరుకో! ఎద్దేం అంటే తెడ్డెం అంటూ దిగనార్చడంతప్ప, ఎప్పుడుమాత్రం మహా భాగన్నావు నామాటకి? అందుకే యిల్లా నీళ్ల గారిపోతోంది బ్రతుకు! — అయినా, ఆడదానితో యిల్లాంటి వ్యవహారాలు చెప్పడం నాదే బుద్ధి పొరపాటు—!"

"పోనీ, యింతోటి మహావ్యవహారాలూ నాతో కాకపోతే, వున్నాడుగా మీకు తగ్గట్టే ఆ సింగ గాడు—వాడు కొనుక్కోలేని సైకిలూ, మీకు కలలొచ్చే కారూగురించి, యిద్దరూ గంటలతరబడి కబుర్లు చెప్పుకోవచ్చు" అంటూనే అవతల పాలవాడికేక విని తలుపు తియ్యడానికి వెళ్ళిపోయింది పార్వతి—

గురునాథానికి మనస్సు చివుక్కుమంది. 'అయినా, గుమాస్తాగాడికి కల లేమిటి'నిపించింది. ఇంతకీ, వెంటనే కారుకొంటానని తా నెన్నడూ అనుకోలేదు — ఎవ్వరితోటీ అనాలేదు. అసలు, ఏమనుకోడానికీ వొడితెరిపి యేదీ బ్రతుక్కి? ప్రతి రోజూ, వుదయాస్తమయాలు, యింట్లో పప్పులేదనో, పాలవాడు మళ్ళీ వచ్చాడనో, సంసార జంఝాటంతోటే సరిపోరా! ఆఫీసులో అడుగు పెడితే, 'ఫైళ్లూ', పైవాడి కేకలూ, తోటివాళ్ళ గుసగుసలూ, — అదో లోకం! — ఎటొచ్చీ, యింటినించి ఆఫీసుకీ, ఆఫీసుబయటబడి యింటికీ, యీదురోమని సైకిలు తొక్కుకొస్తున్న కాస్సేపే మనస్సుకి కొంత ఖాళీ! ...అందులోనూ, వుదయంపూటయితే, రాజధానికొత్తఢిల్లీ, 'దస్తరు'కి వెళ్ళే రహదార్లనిండా, ఓ, అవి సైకిళ్లు కావు!—కాళ్లు కావు!—కార్లు కావు!... వేలకువేలు సైకిళ్ళు, వొంటరిగా, జంటలుగా, రోడ్డు పక్కలమ్మట, పొంగిన సైకు కాలవల్లాగ ఏకప్రవాహమే!...ఏ ప్రపంచ యుద్ధమో అప్పుడే ముగిసి, పటాలాలు సైకిళ్లమీద పరుగెత్తుకొస్తున్నట్టువుంటుంది ...వాటిపక్కనే, యింకా బాగా దుమ్ముపడ్డరోడ్డు అంచులని పట్టుకొని, చీమలబారులలాగ, పదాతి దళాలు—'చప్రాసీ'లనబడే బంట్రోతులు!.. ఆ మహాసముద్రంమధ్యపడి సైకిలుమీద పోతూవుంటే ఏవేవో వూహాలు వుప్పెనలాగ పొంగిపోయేవి అతని మనస్సులో—కనీసం వొక మోటారుసైకిలయినాఅయితే, యింత అవిధి వుండదనిపించేది......కాని, వెనక మోటారుసైకిలు, యెప్పుడైనా కులాసాగా భార్యనీ పిల్లలనీ ఏ షికారుకో, సినీమాకో తీసుకుపోవాలంటే వీలుండదు ... కారే వుండాలి ... చిన్నకారు ... 'సెకెండుహేండు'దయితే, మూడు నాలుగువేలల్లో రావచ్చు...అయితే, దానికి రోజూ ఏ మరమ్మతో, త్రోవమధ్య తొయ్యడమో — హాయికంటె అవిధే యెక్కువ ... ఉంటే, శుభ్రమైనది ఓ కొత్తకారే వుండాలి!...పదివేలు!...పన్నెండువేలు! — దాని ముందా మొయ్యూ, వల్లమాలిన ఖరీదులుగదా!... ఇంతలో సైకిలు వెనకచక్రం గరగరమనేది. దిగి, 'మడ్ గార్డు' మళ్ళీ తాడుపెట్టి కట్టుకుంటూ, వచ్చే నెలజీతం రాగానే మొట్టమొదట తప్పకుండా సైకిలు మరమ్మతు చేయించాలని (నాలుగు నెలలలోనూ పదియొవ్వసారిగా) గట్టి నిశ్చయం చేసుకుంటూ బయలుదేరేవాడు...మధ్యని హంసపాదు లేకుండా వుంటే, తన 'స్కేలు' పరమావధి రెండువందల యిరవై రూపాయలూ చేరుకోడానికి, యిరవై రెండు సంవత్సరాలు పడుతుంది. ఆ వుద్యోగం అయినా, యిప్పటికి యేడేళ్ళనించి చేస్తూవుంటే, యెప్పుడు పీకేస్తారో ననే భయమే నానాటికీ! ... ఆ, తనకి భయమేమిటి? మొన్ననే 'అసిస్టెంటు' పరీక్షకి కూర్చున్నాడు... 'అసిస్టెంటు సెక్రటరీ'వరకూ అదును దొరికినప్పుడల్లా

పలాములు కొడుతూనే వున్నాడాయె! ... 'సూపరెంటు' సిఫార్సు చేశాననే చెప్పాడు కూడా ... ఆ మెట్టుదాటితే, బండి పట్టాలమీద పడ్డట్టే!... నిజమే, 'అసిస్టెంటు సూపరెంటు'న్నా అవాలంటే, కనీసం పలఖైముగ్గురు పైవాళ్లు 'హరీ' మనడమో, మరోరకంగా తప్పుకోడమో జరగాలి! ఏమో, ఒక్క కొరియా యుద్ధంలోనే వేనకువేలు చావటం లేదూ? ...ఈమధ్య, రోజులూ లేకుండానే, యెంతమందో గమ్మున అవులించేస్తున్నారు! ... ఛీ, ఛీ, వాళ్ళు వీళ్ళూ చావడం దేనికి తన 'ప్రమోషను' కోసం?... తన అదృష్టమే తన్నుకొడుతుంది పైకి...మరో నాలుగయిదేళ్లు యీకష్టం...నాలుగైదువందలన్నా వస్తూ వుంటే యీ దరిద్రం వుండదు...ఒక చిన్న కారూ తీసుకోవచ్చు ఎల్లాగో—అని వచ్చేకారూ, పోయే కారూ పరకాయించేవాడు మళ్లీ...కార్లనిగురించి, సింగుగాడిదగ్గర నేర్చుకున్న సంగతులు నెమరుకొచ్చి, ఒక్కొక్క దాని బాగోగులూ, ధరవరలూ, అంచనాలు వేసుకునేవాడు...అందులో ఒక్కొక్క కారు చూస్తే, "ఆహా, అందులో పోతే ఎంతబావుంటుంది?" అని మురిసిపోయేవాడు...అంతలో ఆఫీసో, యిల్లో, వచ్చేసేది—తానింకా గుమాస్తామాత్రుడేనన్న సంగతి పునశ్చరణయి, మామూలు తాపత్రయంలో నిమగ్నుడయేవాడు......

కారుకొనుక్కోడం తీరని కోరికని అతనికి తెలియక పోలేదు. అయితేమాత్రం అనుకోడానికి కూడా హక్కులేదూ? ఇదివర కెన్నిసారులో, భార్యతో యీ ప్రమోషను గొడవో చర్చిస్తూ, "అయినా, యీ వెధవపూళ్ళో కారులేనివాడి బ్రతుకు కానీకి కొరగాద"ని ఆఖరి కోమాట విసురుతూనే వుండేవాడు. ఆమాట వినిపించుకోనట్టే, పార్వతి మాత్రం, చంటిపిల్ల మెడలోకి గొలుసుగురించో, తనకో పట్టుచీరగురించో, మరోసారి ముక్తాయి వేస్తూ వుండేదిగాని, యింత యీసడింపుగా యెప్పుడూ యెత్తిపొడవలేదు...ఆమాటకొస్తే ఆ సింగుగాడు—రతన్‌సింగు—వాడే నయం!... ఆఫీసులో బంట్రోతయితే నేంగాక, వెనక సైన్యంలో మోటారుడ్రైవరుగా పనిచేసిన అనుభవం పురస్కరించుకుని, సరదాగా కార్ల భోగట్టాలు చెబుతూ వుంటాడు... పాపం, కడుపుడుపిల్లలు వాడికీని!...రోజూ ఆఫీసుకి కాళ్ళీడ్చుకుంటూ నడిచిపోలేక, ఒక్క సైకిలు వుంటే బాగుండునని ఆశ! ఒకసారి, ఆఫీసులో సైకిలుకని అప్పు తీసుకుని, ఆ డబ్బు కాస్తా, పెళ్లానికి పురుడొచ్చి ప్రాణంమీదకొస్తే డాక్టర్లక్రింద వాడేశాడు. ఇల్లు దగ్గరగానే వుండడంవల్ల, సాయంకాలంపూటవచ్చి యేమన్నా చిల్లరపనులుంటే చేసిపెడుతూ వుండేవాడు. "నాకు కారొచ్చినప్పుడు, సైకిలు నీకిచ్చేస్తానులే!" అంటే, వెర్రిముండావాడు, అప్పుడే తొక్కుకుపోతున్నట్టే సంబరపడేవాడు! కాస్సేపు వాడితో సైనా కులాసాగా వుండటమేమిటనే నా పార్వతి అక్కసు?...

గురునాథానికి భార్యమీద కోపమే వచ్చింది. ఉదయం అంతా ఏదో వంకని ఆవిడపైన చిరాకుపడుతూనే వున్నాడు. ఎంతతోసేసినా, కలొచ్చిన కారు మాత్రం అతని కళ్లముందు పరుగెత్తటం మానలేదు. దొడ్లోకి వెడుతూ, మామూలు మోతాదు ఒక్క సిగరెట్టుకి బదులు మూడుదాకా తగలబెట్టాడు. స్నానంచేసి, తువ్వాలులో తెల్లగా వున్న భాగం వెతుక్కోకుండానే తుడిచేసుకున్నాడు. పప్పులో వుప్పులేని సంగతి పెద్దకుర్రవాడు చెప్పేవరకూ అతనికి రుచే తెలియలేదు. పంట్లాము బొత్తాలస్తానే పిన్నులకోసం వెతుక్కుని, చిరుగు కనిపించకుండా 'క్లిప్' పెట్టుకుని, తీరా పోసి సైకిలు సమీపించేసరికి, వెనకచక్రంలో గాలి నిండుకునివుంది!...అప్పటికే ఆలశ్యం అయిపోయిందని సైకిలుమీద పళ్ళుకొరకబోయాడు. సరిగ్గా ఆ సమయానికే "రెండు నిముషాలుండండి—ఫలహారానికి వాయి పకోడీలు తీసిస్తా"నని పొయ్యిదగ్గరనించి పార్వతి కేకేసింది. దాంతో, "యీ దరిద్రపు మొహానికి ఫలహారం కూడా యెందుకు? వెధవ పకోడీలు నువ్వే తినొచ్చు"నని నేలతగిలిన బాంబులాగ పేలేసి, సిద్ధంగావున్న కాఫీ గ్లాసుక్కూడా వదిలేసి, సైకిలీడ్చుకుంటూ, వెళ్ళిపోయాడు గురునాథం......

అతడన్నమాట బాణంలాగ గుచ్చుకుంది పార్వతి గుండెల్లో. అసలే, వుదయంనించీ భర్త కస్సుబుస్సుమంటూ వుండడం, ఆవిడ మనస్సు పరిపరివిధాల బాధపడింది. తయారుగావున్న కాఫీకూడా దిగబెట్టి పోయినందుకు నొచ్చుకుంది. దానికి తోడు, ఫెడేలున 'వెధవ పకోడీలు' అంటారా అని కంటతడిపెట్టుకుంది. ఎన్నివిధాలసరిపెట్టుకున్నా అదేమాట పదేపదే పైకుబికి, గుండించడం మొదలెట్టింది. అంత కోపం రావడానికి తానుచేసిన అపరాధం యేమిటో ఆవిడకి బోధపడలేదు. ఆ కలసంగతి విని తానూ కాళ్లు కడుక్కుని కూచోలేదనా? ఉన్న సంసార పరిస్థితి మళ్ళీ ఒకసారి మననం చేసినందుకా? ఏదో మంచీ చెడ్డా, యిదివర కెన్నిసార్లు మాట్లాడుకోలేదు?.........అందుకయి వుండదా ఆగ్రహం

అంతేను...ఆ వంకని, తన పట్టుచీర సంగతి మళ్ళీ ప్రస్తావించినందుకయి వుండాలి...పాపం, ఆయన మాత్రం ఏంచేస్తారు? కొనిపెట్టాలనే వుంటుంది... ఆఫీసులో కడుతున్న 'చీటీ' యీ నెల తనకి పడితే, తప్పకుండా కొంటాననే అన్నారుకూడా!...అదీ, యివేళో రేపో తెలుస్తుందన్నారు!...ఈలోగానే, మళ్ళీ తొందరపడి వేధించడం తనదే పొరబాటు!...అయితే, అంతమాత్రానికే అంత కోపం రావాలా? అయినా, యెప్పుడూ లేనిది అంతలేసి మాటలనేస్తారా?...

రోజంతా, పార్వతి మనస్సు మనస్సులో లేదు. ఏపనీ తోచలేదు. పోనీ, గది సర్దుదామని ప్రారంభించి, సగం కాకుండానే దిగబెట్టేసింది. పొరుగింటావిడ, మామూలుగా మధ్యాహ్నం పిలిస్తే వెళ్ళింది గాని, పదినిముషాలలోనే ఏదో వంకపెట్టి తిరిగి వచ్చేసింది. చంటిపిల్ల గొడవతో గంట గంటన్నర యెల్లాగో గడిచింది. కాని, ఎన్నిసార్లు వాచీ చూసినా, అయిదున్నర కాలేదు!...అయిదున్నరయితే, పిల్లలొస్తారు స్కూలువించి. ఇంకో గంటయించుమించులో ఆయనా వస్తారు...కాస్త కాఫీ యిచ్చాక, నింపాదిగా చాలాగూ అడిగెయ్యొచ్చు! ఆయన తత్వం తనకి బాగాతెలుసు...అప్పటికి ఆయనే పశ్చాత్తపపడి, లాలనగా పలకరించబోతారు. కాస్సేపు తాను మూతి బిగించుకుంటుంది...గునుస్తుంది...చివరికి అంతా హాయిగానే వుంటుంది...

ఎల్లాగో, సాయంకాలం అయింది. పిల్లలు రావడం, కాఫీని పకోడీలు తిని ఆటలకుపోవడం జరిగింది. ఆపైన గంట అయింది...గంటన్నర అయింది ...పిల్లలు తిరిగొచ్చేశారు...అన్నాలు తిన్నారు... పెద్దవాడు మాత్రం, తల్లిమనస్సులో మాట అందుకుని, "నాన్న యింకా రాలేదేం, అమ్మా?" అని రెండు సార్లు అడిగాడు. "ఆఫీసులో పనివుండి వుంటుంది," అని ఒకసారీ, "ఏ సినిమాకో వెళ్ళారో" అని యింకోసారీ సమాధానం చెప్పిందే గాని, అది ఆవిడకే సంతృప్తికరంగా లేదు. అటువంటి సందర్భం యేదున్నా వుంటుందంటే, ముందే యింటిదగ్గిర చెప్పేవాడు గురునాథం...అంతగా అనుకోని అవాంతరం యేదన్నావస్తే ఏదరతన్‌సింగు చేతో కబురు పెట్టేవాడు...అటువంటి దివేళ, తొమ్మిది కావస్తున్నా రాకపోవడం, పార్వతి కేమీ పాలుపోలేదు...

పిల్లలు నిద్దరోయారు. చంటిపిల్లకూడా యేడిచేడిచి పడుకుంది. ఇంటి పనంతా ముగించుకుని యెదురు చూస్తూ కూచుంది పార్వతి. కాలుగాలిన పిల్లిలాగ, వీధిలోకి యెన్నిసార్లు వెళ్ళిచూసిందో లెక్కలేదు... తొమ్మిదిన్నర దాటింది...పది కావస్తోంది...ఇంక వుండబట్టలేకపోయింది పార్వతి...రతన్‌సింగు యింటికెళ్ళి కనుక్కొమ్మందామని పెద్దపిల్లవాడిని లేపబోయింది. అంతలో—"బాం, బాం" మని బయట మోత! క్షేమంగా వచ్చాడు!—గమ్మున తలుపుతీసి చూసింది పార్వతి. తన కళ్ళని తానే నమ్మలేకపోయింది. బొమ్మలాగ గుమ్మందగ్గరే నిలబడి పోయింది!

కలకాదు...నిజమే! పెద్దకారు!...వల్లగా నిగ నిగలాడిపోతోంది...లోపల వేసివున్న 'లైటు' కాంతిలో పట్టుపరుపులు తళతళలాడుతున్నాయి...

రేడియో మెల్లగా పాడుతోంది. అందులోంచే దిగుతున్నాడు భర్త!...

"నమస్తే" అంటూ లోపలమనిషి అందిచ్చిన కాగితం సంచీ పట్టుకున్నాడు...

మెల్లిగా వరండా మెట్లెక్కి వస్తున్నాడు... కారు అల్లాగే నిలిచివుంది—

చరచర రెండడుగులు ముందుకెళ్ళింది పార్వతి—

"ఇదేమిటండీ?—సరిగ్గా మీరు చెప్పిన కల—"

"అవు నదే, యిల్లా నిజమయింది—" అని నవ్వుతూ కాగితం సంచీ అందిచ్చాడు గురునాథం.

అవతల, కారు బయలుదేరింది. వెనక మాపులు చూస్తూనే పార్వతి భర్త ననుసరించింది గదిలోకి. అప్పుడు చేతిలోవున్న సంచీ గుర్తుకొచ్చి తీసి చూసింది— నెమిలి కంఠం రంగూ, జరీపోచలూను! మడత మడతకీ వెన్నెల మిసమిసలాడడమే తరనాయి!—

"నిజంగా—బనారసు— పట్టుచీరే!—ఏమిటండీ, యిదంతా...?"

"ఇందాకటిది నిజమయిన కల — ఇది కల అయిన నిజం!—ఆఫీసులో యివేళ చీటీ మనకి పడుతుందనే, పొద్దున్న అలా కలలో కనిపించింది! కాని, యీ చీర కట్టుకున్న అమ్మాయికూడా ఆ కారులో వుంటే తీరిపోయేది!—"

"చాలెండురూ, మీ హాస్యాలూ మీరూను! అసలీ కారేమిటో, గొడవేమిటో చెప్పకుండా—"

"చెప్పకేం?—కాని, యిది కలేనని మాత్రం యీపడించుకోకుండా వుండాలి? ఒక గంట ముందరే

ఆఫీసునించి సెలవు తీసుకుని, చీర కొనుక్కుని వస్తుంటే, కలొచ్చిన కారూ ఎదురుపడింది తోవలో. కాని, అక్కడే పదిగజాల దూరంలో రతన్‌సింగూ కనపడడం విచిత్రమే!...కల సంగతి తర్వాత చెప్పినా, కారు మాత్రం అదేనని చూపించాలని కేకేశాను. నే నిటూ, వాడటూ, ఆ సైకిళ్ళ సముద్రానికి అడ్డం పడబోయాం...గమ్మత్తుగా కారు వేగం అందుకుంది...కారు గుద్దుకుని సైకిలు, సైకిలు కడ్డంగా సింగూ, పడిపోయారు. కాస్తలో ప్రమాదం తప్పి, నేను, పక్కనేవున్న కంకరగుట్టమీద పడ్డాను. కారు ఆసామీ మంచివాడు కాబట్టి కొద్ది గాయాలతో ఆ కారులోనే ఆసుపత్రి కెళ్ళొచ్చాను నేను! పాపం, రతన్‌సింగుమాత్రం, కాలిమీద కాస్త మోపుగా దెబ్బతగలడంవల్ల, యింకో నాలుగురోజులు ఆసుపత్రిలోనే వుండాలన్నారు. అంతటితో ఆ కల కంచికీ, మనం యింటికి" అంటూ చొక్కా విప్పాడు గురునాథం.

"అమ్మో! ఏ దెబ్బకన్నా విరగలేదు గదా? అయినా, ఆ వెధవ సైకి లెక్కకండింక!" అంది పార్వతి అతని చేతులమీద కట్లు నిమురుతూ.

"ఎక్కాలనుకున్నా ముప్ఫయి నలభై రూపాయలుంటేగాని, మళ్ళీ నడిచేస్థితిలో లేదులే సైకిలు!— అంటే కొన్నాళ్ళవరకూ మనకి బస్సుయోగం అన్న మాట! చెప్పానుగదూ, మనకీ రోజులు మారుతున్నాయనీ—"

అంటూ భార్యతోపాటు పట్టుచీరపరిశీలనకి దిగాడు గురునాథం.

రతన్‌సింగుమాత్రం యిప్పటికీ నడిచేపోతూ వుంటాడు ఆఫీసుకి.







# నటన



శ్రీ ముదిగొండ లింగమూర్తి

'నటన' అనేది అత్యుత్తమమైనకళ. అంతేకాదు మిక్కిలి కష్టసాధ్యమైన వ్యాపారం. ఒక వ్యక్తి తన వ్యక్తిత్వాన్ని మరుగుపరచుకొని వేరొక వ్యక్తి వ్యక్తిత్వాన్ని ప్రదర్శించడం "నటన" అని స్థూలంగా చెప్పవచ్చు. ఆ ప్రదర్శనం కేవలం ప్రయత్నం మాత్రమే కావడం, ప్రారంభ దశలో వుండడం, పరిణతదశ నందుకోవడం, చిట్టచివరకు వెర్రితలలుకూడా వెయ్యడం అనే భిన్నభిన్న దశా విశేషాలలో నుండవచ్చు. మొత్తంమీద ఏ దశలో వున్నా 'నటన' అనిపించుకోకమానదు. ఏదోవిధంగా నటన అనిపించుకున్న ప్రతీదీ ప్రయోజనాన్ని సాధించి తీరుతుందనడానికి వీల్లేదు. కేవలం అత్యుత్తమ పరిణామదశ నందుకున్న నటనమాత్రమే ప్రయోజనాన్ని సాధించి తీరగల్గుతుందంటే అతిశయోక్తి కాదు. ప్రయోజనాన్ని సాధించగలిగిన ఆ ఉత్తమ పరిణామస్థితి నందుకోవడం ఎలాగ నన్నదే సమస్య. ఆ సమస్యని సాధించడానికి సాధనమైనది నటుని ప్రయత్నం —అన్వేషణ. ఆ ప్రయత్నం సఫలీకృతం కావడానికి మూలం, తదేకదీక్ష—ఆంతరంగికానురక్తి. అంతేకాదు ఆజన్మసిద్ధమై, బీజప్రాయమై, వాసనారూపమై, నిద్రాణమైన నటనాసంబంధి సహజలక్షణం —పూర్వజన్మసంస్కారం.

'నటన' అనేది మానసికము దైహికమునై ఏక కాలికమైన వ్యాపారద్వయానికి గల అవినా భావ సంబంధాన్ని ప్రదర్శించే ఒకానొక విచిత్రప్రక్రియ. ఒకానొక అత్యద్భుతానుభూతికి ప్రతిఫలం—మూల కారణం. అందుచేత నటన కత్యావశ్యకమైనవి మానవ మనస్తత్వపరిశీలనా పరిచయం — హావభావ విలాస ప్రకటనాది దైహిక చేష్టా వ్యాపారాదిక పరిజ్ఞానం. ఉభయపరిజ్ఞాన సమ్యక్సమన్వయావసర ప్రతిభా విశేషం.

'నటన' అనేది ప్రపంచ మానవజీవితంలోని సుఖదుఃఖ సమ్మిశ్రమైన వివిధానుభవాలకు సంబంధించిన పునస్స్మరణ—ప్రతిబింబం. అందుచేత నటన కత్యావసరమైనవి నిత్యమానవజీవిత సంబంధ వివిధానుభవ విశేష పరిశీలనాపరిజ్ఞానం, ఆత్మానుభవ పాండిత్యం, స్వపరానుభవ విశేష సమీహా సంలబ్ధ విజ్ఞానం, ప్రపంచానుభవం, అనుభవజ్ఞానం.

'నటన' అనేది ఒకవిధమైన పరకాయప్రవేశం. ఆత్మవ్యక్తిత్వంతో ఆత్మేతరవ్యక్తులను ప్రేక్షకుల కట్టెదుట సాక్షాత్కరింపచేయడం. పాత్రానుభవ ప్రదర్శనంలో ప్రేక్షకులను సమ్మోహితులనుచేసి రససిద్ధికి జీవగఱ్ఱ కావడం. ఆనందతన్మయులను చేయడం. అందుచేత నటన కత్యంతావసరమైనవి ఆత్మవ్యక్తిత్వ గోపనం. పాత్రానుభవ ప్రదర్శననైపుణ్యం. కేవల ప్రతిభావిశేషం.

'నటన' అనేది నటునకు నిత్యనటనమై, నిర్వహణాత్మకమై, బాహ్యతాయుతమై—ప్రేక్షకులకు పర

మసత్యమై బ్రహ్మానందదాయకమై అనుభవైక వేద్యమైన వ్యాపారం.

'నటన' అనేది అసత్యంతో పరమసత్యాన్ని సాధించే పరమరహస్యం.

'నటన' అనేది ఉపాసనా విశేషం. ఈ ఉపాసనలో సిద్ధిపొందడం నటుని పురాకృత సుకృతం.

'నటన' నటాశ్రయం. నటనకు ప్రధానమైన అంశాలు రెండు. ఒకటి నటుడు. రెండవది నటించవలసిన పాత్ర.

'నటనకు' ప్రయోజనాలు రెండు. ఒకటి రససిద్ధి. రెండు రసహృదయులైన ప్రేక్షకులను రంజింపచేయడం.

ఈవిధమైనపరిశీలనవల్ల తేలేసారాంశం నటుడు తన పాత్రానిర్వహణంవల్ల రసానుభూతిని కల్గించి ప్రేక్షకులను రంజింపచేయడం. ఈ రసానుభూతి ప్రేక్షకులకేగాని నటున కెంతమాత్రం కాదన్న సత్యం మరువరానిది.

ప్రేక్షకరంజకంగా పాత్ర నిర్వహించవలసిన నటుని బాధ్యతలు అసంఖ్యాకాలు. ప్రప్రథమంగా నటుడు తాను నిర్వహించవలసిన పాత్రను సంపూర్ణంగా అర్థం చేసుకోవడం అవసరం. అంటే ఆపాత్ర ఆదినుండి అంత్యంవరకు ఏయేవిధమైన పరిణామాలను పొందుతోందో గుర్తించడం—ఆపాత్ర పొందే క్రమ పరిణామాలలో సంభవించే సంఘటనలు, సన్నివేశాలు, అవాంతరదశావిశేషాలు, అవస్థాభేదాలు, వాటివాటి సూక్ష్మతర సూక్ష్మతమ ప్రత్యయాలతో సహా అవగాహన చేసుకోవడం అవసరం. దీన్నే సూత్రప్రాయంగా చెప్పాలంటే నిర్వహించవలసిన పాత్ర ప్రకృతిని ఆమూలాంతం యథాతథంగా జీర్ణం చేసుకోవడం నటుని ప్రథమ కర్తవ్యం.

ఆవిధంగా జీర్ణం చేసుకోగలిగిన నటునికి తాను ప్రదర్శించవలసినపాత్రయొక్క స్వరూప సాక్షాత్కారం సంభవిస్తుంది. సహజప్రకృతితో సాక్షాత్కరించిన ఆపాత్ర స్వభావస్వరూపాలను హృదయ ఫలకంలో చిత్రించుకోగలిగినప్పుడు—మనోనేత్రంలో నిల్పుకోగలిగినప్పుడు తిరిగి ఆపాత్ర ప్రేక్షకుల సమక్షంలో నిజస్వరూపంతో ప్రత్యక్షమయేటట్లు ప్రదర్శించడానికి నటుడుచేసేప్రయత్నం ఫలించే అవకాశం యేర్పడుతుంది. ఈ సందర్భంలో ఒక ముఖ్య విషయం. నటుడు తాను సాక్షాత్కరింపజేసుకొని ప్రేక్షకులసమక్షంలో సాక్షాత్కరింప జేయదలచిన పాత్రయొక్క స్వభావస్వరూపాలను ప్రదర్శించడానికే ప్రయత్నం చెయ్యాలిగాని ఆ పాత్రలో తాను లీనమై తన్మయస్థితిని పొందకూడదు. తత్ఫలితంగా రూపొందే పరిణామం నటనకాక యదార్థమై వ్యర్థం కాకమానదు. రసాస్వాదనకు మారు రసాభాసము తప్పదు. అంటే నటుడు పాత్రను నిర్వహించాలిగాని తానే ఆపాత్రగా మారిపోకూడదు. ఆపాత్రకన్న భిన్నుడైన తానాపాత్రను ప్రదర్శిస్తున్నాడన్న విషయం మరువకూడదు.

పాత్ర, ప్రేక్షకుల సమక్షంలో ప్రత్యక్షమయేటట్లు ప్రదర్శించడమంటే—నిర్వహింపబడే పాత్ర ఆయా దశావిశేషాలలోనూ అవస్థాభేదాలలోను పొందే మానసికములు—కాయికములునైన వికారములను, మానసిక వికార స్ఫోరకములైన దైహిక చేష్టారూపంగా బహిర్గతం గావించి ప్రేక్షకుల హృదయాలలో చొచ్చుకొని, నాటుకొని పోయేటట్లు చెయ్యడం. అనాడే పాత్రానుభవాలతో ప్రేక్షకాంతఃకరణలు లీనమై రసానుభూతిని పొందడం జరుగుతుంది నటుని ప్రయత్నం సార్థకమౌతుంది. నటుడు కృతార్థుడౌతాడు.

పాత్రయొక్క అంతరంగికములైన మానసిక వికారములకు స్ఫోరకములు, ప్రతిబింబములు, బహిరంగములైన దైహికచేష్టలను నటుడు ప్రదర్శించి ప్రేక్షకులను తన్మయులనుజేసి రసానుభూతిని కలిగించడానికి చేసే ప్రయత్నంయొక్క సార్థక్యం, అతని ప్రదర్శనంలోని సహజత్వ వాస్తవికత్వాదుల మీద ఆధారపడివుంటుంది. అంటే నటుని ప్రదర్శనం "మితి" అయినప్పుడు రసోత్పాదకం కాకపోవడం "అతి" అయినప్పుడు హాస్యాస్పదమై రసాభాసం కావడం సంభవిస్తుంది. అందుచేత నటుని ప్రదర్శనం కేవలం సహజము — వాస్తవికము గాక తప్పదు. అంటే నటుని ప్రదర్శనం నటింపబడే పాత్రయొక్క స్వభావ స్వరూపాదులకు సహజమైన వాస్తవికమైన ప్రతిబింబం కాకతప్పదు.

మనస్సును శరీరాన్ని తన స్వాధీనంలో వుంచుకొని ప్రదర్శించే పాత్రయొక్క మానసిక దైహిక



నవల:



# శాఫో



★

## ఆల్ఫాంజ్ డాడె(ట్)

### 9

మామూలుగా ఈ కలహ కల్లోలాలు ఎక్కువ కాలం నిలిచి ఉండేవి కావు. ఫాన్ని కాస్త మెత్తపడి, అనునయంగా అతన్ని లాలిస్తూ ఒక్క చక్కని పాట పాడేటప్పటికి ఆ రసార్ద్రతలో అన్నీ కరిగిపోయేవి. కాని ఈసారి అతనిలో కోపం తీవ్రంగా ప్రకోపించి, చాలా రోజులదాకా, మొగాన్ని గంటు పెట్టుకొనే, కోపంతో మూగనోము పట్టినట్టు, ముభావంగా అట్టే ఉండిపోయాడు. భోజనం ముగియగానే సరాసరి ప్లానులు గీయడంలో మునిగిపోయి, చివరికి ఆవిడ షికారుకు పోదామని పిలిచినా పోకుండా అట్టే ఉండిపోయేవాడు.

అసలు తన జీవితపరిస్థితుల దుర్భర దైన్యం అంతా అకస్మాత్తుగా తన్ను ఊపడించి కొట్టినట్లయిపోయాడు. అడివిలో ఎప్పుడైనా ఆ పిల్లల బండి, నిత్యం స్మృతిలో వెంటాడుతున్న ఆ పెద్ద పిల్ల చిర్నగవు మళ్ళీ కనబడి ఊపడిస్తాయేమో అని భయపడుతూన్నట్లయిపోయాడు. రాను రాను ఆ స్వాప్నిక దృశ్యం రేఖాస్ఫుటత్వం కోల్పోయి, నాటకంలో ఒక దృశ్యం తెర తీసేసి మరో దృశ్యం తెర అమర్చుకొన్నట్లుగా, ఆ అడవి అగాధంలో నిమగ్నమై మాయమైపోయింది. జీవం మళ్ళీ ఆ దృశ్యం కన్నుల ఆడలేదు. కాని ఏదో దిగులు మాత్రం మనిషిలో అల్లానే మిగిలిపోయింది. ఆ దిగులుకు కారణం అర్థం చేసుకొన్నా ననుకొని, నివారించటానికి నిశ్చయించుకొంది ఫాన్ని.

“అమ్మయ్య, తీర్చేశాను” అంటూ ఒకనాడు సంతోషంతో వచ్చి చెప్పింది అతనితో. “దెషిలెట్‌ని చూశాను. అతని డబ్బు అతనికి తిరిగి ఇచ్చేశాను. అతను కూడా నువ్వన్నమాటే అన్నాడు. అల్లా తీర్చేయటమే మంచిదన్నాడు. ఆ మంచి ఏమిటో నాకుమాత్రం బోధపడటం లేదు! ఏమయితే యేంలే, అయిపోయింది. పోనీ తర్వాత నేను ఒంటరిదాన్నయినప్పుడు పిల్లడి విషయం అతనే ఆలోచిస్తాడు. ఏం! నీకు సంతోషమయిందా! ఇంకా నామీద కోపం అల్లాగే ఉందా?”

అని తను, రూ. డి. రోమ్‌లో అతనింటికి వెళ్లిన సంగతంతా చెప్పసాగింది. ఇంటిదగ్గర మునుపటి సందడి, వింతవింత వ్యక్తుల పిచ్చిమెచ్చి కోలాహలాలు, ఏమీ వినబడక కనబడక పోయేటప్పటికి ముందర చాలా ఆశ్చర్యపోయిందట. ఇల్లు కూడా మునుపటి విచ్చలవిడిరూపంలో గాక చాలా సాంప్రదాయపు పెద్దమనుష్యుల ఇంటిలాగా మారిపోయింది. గేటుదగ్గర నౌకర్లు, మునుపటిలాగ ప్రతీవాళ్ళని లోపలికి రానీయటం లేదు. బహుకొద్దిమంది పరిచయస్థులు, మర్యాదస్థులూ, అయినవాళ్ళని మాత్రమే, యజమాని అనుమతితో నౌకర్లు లోనికి రానిస్తున్నారు. మునుపటి విందులు మారువేషాల నృత్యాలూ, ఉత్సవాలూ అన్నీ ఆపు చేశారు. ఆయింటి సంతర్పణలు మరిగి ఇప్పుడక్కడ ప్రవేశం లేకుండాపోయిన ఒక సోంబేరి, ఉడుకుమోతుతనం పట్టలేక బైట గోడ మీద “బుతుకాలం కావున ఇతరులు లోనికి రాకూడదు” అంటూ వ్రాశాడు.

"అసలు నిజంకూడా అదేనోయ్! డెషిలెట్ ఈమాటు తిరిగి వచ్చి రావటంలోనే, సరాసరి ఆలీస్ డోర్ అనే ఒక భోగంపిల్ల వలపులో పడిపోయాడు. నెలరోజుల్నించీ తన దగ్గిరే ఉంచుకొన్నాడు. ఇద్దరూ కలిసే ఉంటున్నారు. కాపురమే పెట్టేశాడు! పిల్ల ముచ్చటగా ఉంటుంది. "అతి నెమ్మదస్తురాలు, సాధువు, ఇద్దరి మధ్యా కాస్సైనా కీచులాటకూడా వినబడదు. ఎప్పుడైనా ఇద్దరం కలిసి వాళ్ళింటికి వస్తామని మాట ఇచ్చివచ్చాను. ఈ కొమ్ము బూరాల, ఏలపాటల విసుగైనా తప్పుతుంది.

చివరికి చూసుకొంటే అందరిదీ ఒకటే రీతి కాదూ! వేదాంతులూ, వాళ్లతత్వాలూ! 'రేపు లేదు!' 'ఎవరి వాడనూ కాను!' అనేవాడే! ఓ అన్నీ జ్ఞాపకం చేసి భలే ఎత్తిపొడిచానులే!"

అవినాతో కలిసి డెషిలెట్ దగ్గరకు వెళ్లటానికి ఒప్పుకొన్నాడు. ఆనాడు క్వాయ్ డి ఆర్సేలో హోటలు బైట కాపుసెల్‌తో కూర్చుని ఉన్నప్పుడు డెషిలెట్‌ను కలుసుకోవటం తప్ప, మళ్ళీ ఈమధ్య ఎప్పుడూ అతన్ని జీన్ కలుసుకోనే లేదు. తనప్రియురాలిని వ్యామోహరహితంగా, నిరసనంతో, పూర్వం ఒకప్పుడు చేరదీసిన, ఈ వ్యక్తి ఇంటితో, తను ఇంత రాకపోకలలోకి వస్తాడని, అతనితో అంత ఆంతరంగిక స్నేహం కలుస్తుందని, ఎవరైనా ఇంతకు ముందు చెప్పి ఉంటే జీన్ ఆశ్చర్యపోయి ఉండేవాడు. ఈమాటు మొట్టమొదటిసారి ఆ ఇంట అడుగెట్టినప్పటినుంచీ కూడా జీన్‌కు ఆ ఇంటివాతావరణం అతి ఆత్మీయంగా కనబడసాగింది. డెషిలెట్ సాధుత్వం, పసిపాప నవ్వులా హృదయపూర్వకంగా కనిపించే అతని నవ్వులోని మార్దవం, ఎంతటి శారీరకమైన, మానసికమైన బాధకూడా కనిపించనీయని అతని శాంతస్వభావం, అన్నీ జీన్‌ను ముగ్ధుణ్ణి చేశాయి. డెషిలెట్‌కు లివర్ జబ్బుంది. మాటిమాటికీ తీవ్రంగా తిరగబెడ్తూ ఉంటుంది. అందువల్లే చర్మం పచ్చబారి, కనుగుంటలు నల్లబారిపోయినవి. కాని ఆ జబ్బు చిరాకు ఈషణ్మాత్రము అతని స్వభావంలో కన్పించదు.

ఇల్లాంటివ్యక్తి, ఆలీన్‌డోర్, అన్న ఈస్త్రీలో అపరిమిత భక్తిభావము కల్పించగలగటంలో ఆశ్చర్యమేమీ లేదు. ఆలీస్, కోమల రూపంతో, కనరాని చక్కదనంతో, అతి ఒదుగుబాటుగా ఉంటుంది. ఆమె ఒళ్ళు పల్చగా సువర్ణచ్ఛాయని ఉంటూ, ఆమె ఫ్లెమిష్ జాతిని వ్యక్తపరుస్తూంటుంది. పేరులోలాగే, ఆమె కేశపాశంలో, కంటిపాపలలో, పక్ష్మలాంచలాలలో, వపువంతటా, చివరికి గోటి చిగుళ్ళల్లో కూడా బంగారునీరుపోసిన కాంతి ప్రతిఫలిస్తూంటుంది.

డెషిలెట్‌కు ఆమె, ఒక హీన క్రీడా గృహపు పడుపుశాలలలో దొరికింది. ఆ వృత్తిగృహాల దుర్భర పాశవిక ధూమాచ్ఛాదిత వాతావరణంలో, మొగాలకు మెరుగు పూసికొన్న ఆ పడుచులు తమ వెల చెప్పుకొంటూంటే మొగాళ్ళు తుపుక్కున ఊసే మొరటు పశువుల, మూర్ఖక్రీడల మధ్యంలో, ఈ పిల్లకు డెషిలెట్ తారసిల్లాడు. అతని అతిమర్యాద ప్రవర్తనం చూసి ఆ పిల్ల విభ్రమాశ్చర్యచేతస్కురాలు అయింది. ఇన్నాళ్లూ పురుష విలాసార్థమే బ్రతికిన ఆ జంతువు కాక, తానూ మానవస్త్రీనే అని ఒక్కసారైనా అనుకోగల్గింది. ఆ మర్నాడు ప్రొద్దుటి ఫలహారం ఇప్పించి, గుప్పెడు నాణాలు ఆమె చేతబెట్టి, ఆమెను పంపించేద్దామనుకున్నాడు డెషిలెట్, తన మామూలు పద్ధతిలో! కాని అతనిపట్ల కృతజ్ఞత నిండిన హృదయంతో, బహు జాలిగా, అనునయంగా అతన్ని ప్రార్థించింది. "ఇంకొంచెం కాలం నన్ను ఉంచుకో" మని. ఆ సాధు విన్నపాన్ని నిరాకరించలేకపోయాడు. ఆనాటినుంచీ, కొంత ఆత్మగౌరవ ప్రపత్తుల ప్రేరణమూలానా, కొంత పూర్వజీవితం అంటే విసుగువల్లా, అలనామెతోనే ఉండిపోయి, తనయింట రంగేళీ ఉత్సవాలన్నీ ఆపు చేసేశాడు. సుఖలాలసజీవనానికి అతి అనుకూలమైన ఆ వేసవి క్రీడాగృహంలో ఇద్దరూ ఏకాంత ప్రేమజీవన మనుభవింపసాగారు. ఇద్దరూ కూడా ఆనంద సాగరంలో ఓలలాడుతున్నారు. ఈ భాగ్యజీవనంలో తనకు జరుగుతున్న ప్రతి చిన్నమర్యాదా, ప్రతి స్వల్ప ఆదరణా జీవితంలో అంతకుముందు ఏనాడూ ఎరిగియున్నది కాదేమో, ఆమె అతి ఆప్యాయంగా ఆనందిస్తూంది. ఒక దిక్కులేని దానికి సుఖసంపత్తులు చేకూర్చటంలో కల తృప్తి, అందుకు ప్రతిగా, పసిమనస్సుతో హృదయపూర్వకంగా ఆమె చూపిస్తున్న కృతజ్ఞతా, అతన్ని ఆనంద పరవశుణ్ణి చేస్తున్నాయి. ఆవిధంగా స్త్రీ సాన్నిహిత్య జీవనప్రభావం, స్త్రీ మధుర మృదుల కరుణోపచారాల ఇంద్రజాలం, దుర్భేద్యమైన ఆ జీవితమాయా ప్రభావం, అతని ఎరుక లేకుండానే అతన్ని కైసేసుకొంటూంది.

అల్పపు గుమాస్తా జీవితపు దౌర్భాగ్యంలో అస్తవ్యస్త కాపురపు పాప పంకిలంలో, పడి కొట్టుకొంటూ జీవితం ఈడ్చుకువస్తూన్న జీన్ గాసిన్‌కు, రూడిరోమ్‌లోని డెషిలెట్ స్టూడియోకు వెళ్ళటమంటే, కాస్త విశ్రాంతిగా, ఆటవిడుపుగా, ఆనందంగా ఉండేది. విస్తృతపాండిత్యం, సంస్కృతి, అత్యుత్తమ కళాభిరుచీ గల, ఈ వేదాంతితో సంభాషించటం జీన్‌కు మహదానందదాయకంగా ఉండేది. డెషిలెట్, వదులుపాటి పారశీకపు టుడుపులు ధరించేవాడు. జీవితం విషయంలో అతని దృక్పథంకూడా అంత అంటీ అంటనట్టుగా వదులుగానే ఉండేది. డెషిలెట్, తన పర్యటనల విశేషాలు, అతిముక్తసరిగా అతి చక్కగా వర్ణించగలిగేవాడు. ఆ యింటి వాతావరణంకూడా అతని కథల వాతావరణానికి తగినట్టు ప్రాచ్యదేశ వస్తు విశేషాలతో—బుద్ధవిగ్రహాలు, చైనీయ రాక్షసుల కంచుప్రతిమలు, పారశీక తెరలు-మొదలైనవాటితో ప్రాచ్యదేశభ్రమను గొల్పుతుండేది. విశాలమైన హాలులో పడికప్పునించి వచ్చే వెలుగొక్కటే నిండి ఉండేది. చిట్టడివిలో వెదురుపొదల అల్లికల మధ్యనుంచి, సరస్సుఅంచు లతాగుల్మాలపైది నీటిలతలమీద మిలమిలలాడుతూన్న వెలుగు చీకట్ల భ్రమలతో ఎక్కడో, ఉష్ణదేశపు టడవులమధ్య కాసారతీరాన ఉన్నట్లనిపించేది.

ఆదివారాల మధ్యాహ్నం వేళల, వేసగి ఎండ విల్లివిరుస్తూంటే, ఆ ఇంటి ఆరామం ప్రక్కన బాట అంతా నిర్జనంగా ఉండేది. అక్కడి చెట్లఆకులనీడలు, పూలకుండులలో క్రొత్తగా త్రవ్వి పోసిన మట్టి వాసనా, అన్నీ ఛాదిల్లీ చిట్టడవి వాతావరణాన్నే స్ఫురింపచేసేవి. అక్కడికన్నా ఇక్కడ లాభం; హిట్టిమాల లాలస మూర్తులు, వాళ్ళ కొమ్ముబూరా ఉండేవి కావు. ముసుపటిలాగా విందులంటూ ఈ యింట ఇప్పుడు ఉండటమే లేదు.

ఒకనాడుమాత్రం డెషిలెట్ ఇంట్లో భోంచేద్దామని ఇద్దరూకలిసివస్తూంటే గుమ్మంలోకి రాగానే లోపల చాలామంది గొంతుకలు వినిపించాయి. సాయంత్రమయిపోయి ఎండకూడా దిగజారిపోతోంది. ముందుతోటలో లతాగృహంలో అందరూ పానీయాలు ఆరగిస్తున్నారు. ఏదో తీవ్రముగా వాదోపవాదాలు జరుగుతున్నాయి.

"కేవలం మోహాంధకారంలో పడిపోయి, ఏమిచేస్తున్నదీ తెలియని స్థితిలో చేసిన పనికోసం, పాపం, జీవితవృత్తి పోగొట్టుకొని, పరువుప్రతిష్ఠలు కోల్పోయి, ఐదేళ్ళ కఠిన నరకం అనుభవించటం, అపరాధానికి మించిన శిక్ష అనుభవించటమే అని నా అభిప్రాయం, డెషిలెట్! నీ అర్జీమీద నేనూ సంతకం చేస్తానోయ్"

ఫానీ్న సన్నగా వణుకుతూన్న కంఠంతో, "ఆ మాట్లాడేది కౌపుడల్"అంది.

ఇంతలో ఎవరో, కరుకుగా నిరాకరిస్తూన్న కంఠం వినిపించింది. "నేను మాత్రం ఎక్కడా సంతకం పెట్టేది లేదు. అల్లాంటివాడితో నేను ఏ సంబంధమూ ఏవిధంగానూ పెట్టుకోదలచుకో లేదు."

"ఈమాట లాసుర్నేరీది" అని ఫానీ్న అతనికి దగ్గరగా హత్తుకొని సన్నగా గొణిగింది. "వాళ్ళను చూడటానికి నీ కిష్టం లేకపోతే వెనక్కి వెళ్ళిపోదాము"

"ఎందుకూ ? నాకేం అభ్యంతరం లేదు"-నిజానికి ఈమనుష్యులను ముఖాముఖి కలుసుకొంటే ఎల్లా ఉంటుందో అతనికి పూర్తిగా తెలిసిరాలేదు. కాని ఎంతకష్టమయినా, వెన్నిచ్చిపారిపోవటం అతని కిష్టం లేదు. అదీకాకుండా, తన దౌర్భాగ్యపు ప్రేమకు ఈ గతిపట్టించిన తనలోని ఈర్ష్యాక్రోధాల యథాప్రమాణమెంతో తెలుసుకోవాలన్న కుతూహలం కూడా బహుశా ప్రేరేపించి ఉండవచ్చును.

"రా, పోదాం" అంటూ ఆమెను లాక్కొని పోయాడు.

డెషిలెట్ స్నేహితులంతా కాఫీ బల్లచుట్టూ ఎత్తుతక్కువ సోఫాలలో విస్తరించుకొని జార్లగిలబడి ఉన్నారు. సాయంసంధ్యారాగం, వాళ్ల బట్టతలల్లో చిరుసు గడ్డాలలో కెంపురంగులు ప్రతిఫలిస్తోంది. కాఫీ టేబిల్ మీద ఐదారుగ్లాసు లున్నాయి. ఆలీస్ బల్లదగ్గిరనుంచుని వేడివేడి కాఫీ, నురుగు పొంగేటట్టుగా గ్లాసుల్లో పోస్తోంది. స్త్రీలిద్దరూ పరస్పర ఆలింగన చుంబనాదు లొనర్చుకొన్నారు. "నీకు అందరూ తెలుసను కొంటాను, కాదూ, గాసిన్!" అని డెషిలెట్ తన పడక కుర్చీలో ముందుకూ వెనుకకూ ఊగుతూ గాసిన్ నడిగాడు.

ఆహా! నిజంగా అతను అందరినీ ఎరిగే ఉన్నాడు. అధమం అందులో ఇద్దరైనా, బజారు కిటికీలలో వేలాడగట్టిన మహాపురుషుల బొమ్మలలో వాళ్ళ బొమ్మలకేసి చూస్తూ గడిపిన రోజులనుంచీ కూడా చిరపరిచితులే. వాళ్ళు తనను ఎంత బాధపడేట్టు చేశారు! వాళ్ళను ఎంతగా ద్వేషించు

కొన్నాడు—వాళ్ల తరువాతివాడుగా కావలసివచ్చి నందుకు! ఆ ద్వేషంలో వాళ్లు వీధిలో కనబడితే మీద కురికి చీల్చి చెండాడి గుండెలు పెరికివుండే వాడేమో! కానీ "అదే తగ్గుతుందిలే" అన్న ఫాన్ని మాటలే నిజమయాయి. ఇప్పుడు వాళ్ళ ముఖాలు, చిన్నప్పుడు ఎప్పుడో ఎరిగున్న వాళ్ళ ముఖాల్లాగ, ఏదో దూరపు బంధువులు, తరాలు విడిపోయినవాళ్ళ, ముఖాలలాగ మాత్రమే కనిపిస్తున్నాయి.

"ఇంకా అంత అందంగానే ఉన్నావే! ఏం లేదూ?" సోఫామీద సాక్షిగా వెల్లకిలపడుకొని కంటికి ఎండ తగలకుండా చిన్న విసనకఱ్ఱ అడ్డం పెట్టుకొని ఇద్దరివంకా చూస్తూ అంటున్నాడు, కాడల్. "ఊ! మరి, ఫానీ, ఫర్వా లేదు." అంటూ మోచేతులమీద ఆనుకొంటూ తల ఎత్తి కళ్లు చికిలించుకొని నిశితంగా చూశాడు. "ముఖం, ఏమీ చెక్కు చెదరలేదు. కాని ఒంటితీరు మాత్రం—ఫానీ నువ్వింకొంచెం ఒళ్లు బిగించి కట్టుకోవాలి. ఏమంటావ్! ఏమయితే నేం, లాగుర్నరీ నీ కంటే బాగా లావు ఖారిపోయాడులే. పోనీలే ఆ విధంగా తృప్తిపడవచ్చు నువ్వు!"

కవి నిరసనంగా పెదవులు బిగించాడు. సోఫా మీద బాసింపట్లు వేసుకొని కూర్చున్నాడు—అల్జీరియా వెళ్ళివచ్చినప్పటినుంచీ అల్లా కూర్చుంటేతప్ప తనకు బాగుండదని ఆయన చెప్పుకోటం మామూలై పోయింది. బాగా బొందపారిన దేహం. పెద్ద పొట్ట, ఒళ్ళంతా జిడ్డోడుతూ, ఎబ్బెరికపు రూపుతో మొగాన ఏ తెలివితేటలూ కనబడకుండా ఉన్నాడు. నుదురుమాత్రం, దుబ్బులా పెరిగిన తెల్లని వెంట్రుకల కిందినుంచి దృఢంగా కనబడుతూంది. కన్నులు కూలీలపై ధార్ష్ట్యం చేస్తూన్నవాడిలా క్రూరముగా కనబడుతున్నాయి. ఫాన్నిని తనదూరంలో ఉంచ చూచినట్లు, తెచ్చికోలు ముభావంతో వ్యవహరిస్తున్నాడు. దాదాపు కాడల్‌కు పాఠం నేర్పటానికి కూర్చున్నట్లు!

వాళ్ళతో పాటు ఇద్దరు ప్రకృతి చిత్రకారులు కూడా అక్కడ ఉన్నారు. ఆరుబయటి బ్రతుకులో దేహం, చామనచాయవర్ణం పొందినట్లున్నాయి వాళ్ళ రూపాలు.

"ఆ పిల్లడివిషయం ఇప్పుడే డెషిలెట్ మాతో చెప్తున్నాడు. మీరు చాలా మంచిపని చేశారు" అంటూ ఫానీని అభినందిస్తున్నారు వాళ్ళు.

"ఔను నిజం, ఆ పిల్లడిని పెంచుకోటం చాలా సహజమైన పని. అల్లాగే చెయ్యాలి" అని కాడల్ అందుకొని గాసిన్‌తో అన్నాడు.

ఈ అభినందనలు వింటూ తొట్రుపాటు పడుతోంది ఫాన్ని. సరిగ్గా అప్పుడే లోపల స్టూడియోలో ఎవళ్లో చీకట్లో తడుములాడుకొంటూ బల్లలు పడదోసుకున్న చప్పుడైంది. ఆ చీకటిలోనుంచి "అక్కడ ఎవరైనా ఉన్నారా" అంటూ కేక వినబడింది.

"ఎజానో వస్తున్నాడు" అన్నాడు డెషిలెట్.

జీన్, ఈ మనిషిని ఏనాడూ ప్రత్యక్షంగా చూడలేదు. కాని, ఈ స్వేచ్ఛాజీవికి, తల తిక్క మనిషికి, ఫానీ ప్రేమజీవితంలో ఉన్న సంబంధం, జీన్‌కు పూర్తిగా తెలుసును. ఆనాటి ఉత్తరాలలో వలపు లుబుకుతూ రసాభిరామంగా ఉన్న ఒక ఉత్తరాలకట్ట అతనికి జ్ఞాపకంవచ్చింది. ఈనాడు ఎజానో పెళ్ళి అయి జీవితంలో స్థిరపడి, ప్రభుత్వ చిత్రకళాశాలలో మహా మహోపాధ్యాయ స్థానంలో ఉన్నాడు.

ఒక పొట్టిమనిషి, లోపలికి వచ్చాడు. అతని దవడలు గుంటలుపడి ఉన్నాయి. దేహమంతా అర్చుకుపోయినట్లుంది. వణుకుతూ నిత్యం ఉపన్యాసాల అలవాటులో, జనంలో నుంచి తోసుకువస్తున్నట్లు చేతులు ముందుకు చాపి తేముల్చుకొంటూ, ఉద్యోగ హోదాలోనే కదిలి వస్తున్నట్లు, ముందుకువచ్చాడు. ఫానీని చూసి ఆశ్చర్యం ప్రకటించాడు. అసలు ఇంకా ఆమె అంత అందంగా ఉన్నందుకే ఆశ్చర్యపడుతున్న ట్లున్నాడు.

"అరే, ఎవరు శాఫోయే" అన్నాడు. అతని చెక్కులు క్షణికంగా ఎఱ్ఱవారాయి.

ఆ శాఫో పేరు, ఆమెపూర్వ ప్రేమికులందరి తోటీ కల ఆమె గాథ పరిచయాన్నంతా ఒకసారి తిరగతోడినట్టయి, అక్కడ కొంత తత్తరపాటు కలిగించింది.

"వీరు మాన్సీర్ అర్మాండీ గారు. ఆమెను వీరేవెంటబెట్టుకు వచ్చారు" అంటూ డెషిలెట్, గాసిన్‌ను ఎజానోకు పరిచయంచేశాడు. ఎజానో నమస్కారం చేశాడు. మళ్ళీ సంభాషణలు సాగాయి. తన ప్రేమికుడు వీరందరిముందూ చూపిస్తున్న గాంభీర్యాన్ని చూసి ఫానీ సంతోషిం

చింది. యీ కళాకారుల సమక్షంలో, ఆతని అందం, యౌవనం, ఇప్పుడు చూపిస్తున్న నిర్లాలితం అన్నీ తలచుకొని గర్వపడింది. ఆ సంతోషంలో అందరితో చలాకీగా, ఖులాసాగా కబుర్లు చెప్తూంది. ఇప్పటి ప్రేమజీవితంలో పూర్వప్రేమ కలాపాలన్నీ మరిచేపోయింది. కాని ఏళ్ళతరబడి సాగిన సాహచర్యజీవితాలలో పరస్పరం సంక్రమించే గుణదోషాలు, వ్యక్తిత్వ లక్షణాలు, ఒకరొకరిలో జీర్ణించిపోయి, ఆ ప్రేమ కలాపాలు అంత మయూర్యక కూడా మిగిలేఉంటాయి. అలా చివరికి, ఆమె సిగరెట్టు కాల్చే విధానంకూడా పరాసరి ఎజానోనుంచి సంక్రమించిందే. ఆ సిగరెట్లలో ఆమె కాల్చే బ్రాండులుకూడా, అతను ఇష్టంగా కాల్చే బ్రాండులే.

జీన్ ఆ విషయం గమనించాడు. కాని ఈ స్వల్పవిషయాలేవీ పూర్వంలాగా అతన్ని ఒళ్ళు మండించటంలేదు. తను ఇంత శాంతంగా ఉండ గల్గటం చూసుకొనేటప్పటికి, వైరీ సంకెళ్లను ఆకు రాతితో తెగగోసుకొని, ఎప్పుడుపడితే అప్పుడు పారిపోవచ్చునని గ్రహించినప్పుడు కలిగే సంతోష మంతా అతనికి కల్గింది.

కౌఉడల్, తక్కినవాళ్లను వేళాకోళంచేస్తూ ధీమాగా అంటున్నాడు "అరెరె, చూడు ఫాన్నీ! వీళ్ళంతా దిగజారిపోయారు. ఎల్లా ముసలాళ్ళయి పోయి, లావుబారారో చూడు! మనిద్దరమే కాస్త, జిగి మిగిలినవాళ్ళం."

ఫాన్ని పకపక నవ్వింది. "అబ్బెబ్బె కాదు, కర్నల్ (కౌఉడల్ మీసాలనుబట్టి ఒకొక్కప్పుడు అతన్ని పెట్టుడుపేరుతో పిలిచేవారు) కేవలం అల్లా అనేందుకు వీలులేదులే! నీకున్నన్ని ఏళ్ళ సర్వీసు నా లెక్కకుంది." అంటూ నవ్వుతూనే అన్నది.

"తనుకూడా ముసిలితరం వాళ్ళల్లో ఒకడనన్న విషయం కౌఉడల్ నిత్యం మర్చిపోతూనే ఉంటాడు" అన్నాడు లాగూర్నెరే. కౌఉడల్ మనస్సు ఏమంటే నొచ్చుకుంటుందో లాగుర్నెరీకి క్షుణ్ణంగా తెలుసును. కౌఉడల్లో ఏదో కదలిక కదుల్తాం దని గమనించి అదే ధోరణిలో ఇంకా గట్టిగా అన్నాడు. "1840 గోల్డు మెడలిస్టువు కాదటోయ్-దాంతోటే నీయాడు చెల్లిందిలే, ముసిలయ్యా!"

ఈ యిద్దరు పూర్వస్నేహితులమధ్యా, ఏదో ఘర్షణ, మూగ వైషమ్యం, అల్లాగే మిగిలిపోయింది. అది వాళ్లిద్దర్నీ వేరుచేయలేదు. కాని ప్రతి స్వల్ప విషయంలోనూ మాటలోనూ, చేతలోనూ, ముఖ కవళికలోనూ, ఇట్టే బైలుపడుతూనే ఉంటుంది. శిల్పి ప్రియురాలిని కవి అపహరించినవాడు మొదలు, ఇరవై ఏళ్లుగా వాళ్ళమధ్య ఈ పొరపు ఇల్లా ఉంటూనే వచ్చింది. ఫాన్ని విషయం ఇప్పుడంత ఇద్దరికీ పట్టనేలేదు. ఆ తర్వాత ఇతరత్రా ఎన్నో విధాల ఎవరిప్రేమల సుఖదుఃఖాలు వాళ్లే అనుభవించనే అనుభవించారు. కాని ఆనాటి పగమాత్రం అంత కంతకూ లోపల రాజుతూ అల్లాగే ఏళ్ల తరబడిగా గుండెల్లో మంటగా మిగిలిపోయేఉంది.

కౌఉడల్ నిటారుగా నిలబడి, ఛాతీవిరుచుకొని, దేహపు కండరాలన్నీ ఉబ్బించుకొంటూ, ఒక్క నెరిసిన వెంట్రుకైనా లేని నెత్తిమీది సింహపు జూలును జోరుగా వెనక్కి విదలిస్తూ అన్నాడు.

"ఒక్కసారి మా యిద్దరివంకా సరిగ్గా చూడండయ్యా! నేనే ముసిలితరానికి చెందుతానో అత గాడో! ఔను, 1840 గోల్డ్ మెడలిస్టునే! ఇంక మూడైలలలో ఏభై ఏనిమిది ఏళ్ళు వస్తాయి—అంత మాత్రాన్న ఏం తేలిందంట! వయస్సువల్లేనా, మనిషి ముసలాడయ్యేది! అరవై ఏళ్ళవాళ్ళు నడుంవంగి పోయి, వణుక్కుంటూ, కాళ్లుక్రుంగిపోతూ అన్ని అవకతవకలతోనూ తయారయేది ఒక్క నాటక రంగాల్లో మాత్రమే, తెలుసా! అది నీ గోలకూల, అరవైమొయ్య ఏట, మనిషి, ముప్ఫైయొయ్య ఈడువకంటే, నిటారుగా నిలుస్తాడు కదయ్యా! అప్పటికంటె స్వవిషయంలో ఎక్కువ జాగ్రత్తలో ఉండడూ! ఇంకమరి ఆడవాళ్ళంటావ్! నీలో మజా, మనసులో యౌవనం ఉండాలేగాని, ఆనాటికంటె ఈనాడే ఎక్కువ వెంట బడతారే!"

లాగూర్నెరీ నిరసనంగా ఇకిలిస్తూ ఫాన్నీ వంక చూస్తూ, "నువ్వూ నిజంగా అల్లాగే అనుకొం టున్నావా?" అని అడిగాడు.

డెషిలెట్ సానుకూల మందహాసంతో అడ్డు తగిలాడు. "మరి అల్లా అయితే నిత్యం యౌవనం లాంటిది వేరేదీ లేదంటావేం! ఎప్పుడూ మాతో అదేమాట చెప్తూంటావ్!"

"నాకొత్త మోడల్ లేదూ, ఉసినార్డ్, పద్దెనిమిదేళ్లపసుచు, బంతిలాగా, గుండ్రంగా,

ఒళ్ళంతా సుళ్లు తిరిగి ఉంటుంది—అదే నా మనసు మార్చేసింది. నిత్యం బలే కులాసాగా ఉంటుంది. అతి సామాన్యరాలు. దాని ఆ అలగా తనమే, అతి మనోహరంగా ఉంటుంది. అచ్చు కోళ్ళ గూడెంలోంచి వచ్చినట్టుంటుంది. దానితల్లి కోళ్ళమ్ముకొనే బ్రతుకుతుంది. దానిమాటలు ఎంత వెకిలిగా తెలివి తక్కువగా ఉంటాయో అంత ముద్దొస్తూనూ ఉంటాయి. ఆమాటలంటూంటే దాన్ని ఉన్నపళాన కౌగిలించుకో బుద్ధేస్తుంది. మొన్న ఒకరోజున నా స్టూడియోలో జోలాది, "తెరిసీ" అన్న నవల, దానికంట బడింది. ముద్దుగా మొగం చికిలించుకొంటూ పుస్తకం దూరంగా విసిరేసింది. "తెరిసీ ఏంటి—"పిచ్చిపిల్ల తెరిసీ"—అని పేరున్న నవలైతే రాత్రంతా మేలుకుండి సదివేదాన్ని". అంది. నా కదంటే వెఱ్ఱి వ్యామోహం సుమా!"

"ఔను. మరుక్షణంలో దాంతో కాపురం ప్రారంభిస్తావు. ఆరునెలల్లో, మళ్ళీ మొదలు. కాపురం ఫటేల్మని బ్రద్దలవుతుంది. తాటికాయలంతంత కన్నీళ్లు కారుస్తూ తయారవుతావు. పని చెయ్యటమంటేనే విసుగొస్తుంది. కనబడ్డవాడినల్లా కొరికి మింగేయాలన్న రాక్షసకోపంతో ఉంటావ్."

కావుడెల్ మొగం ముడుచుకుపోయింది. "ఆ మాట నిజమే. ఏదీ శాశ్వతం కాదు. ఎవరోఒకర్ని చేరదీస్తావు—మళ్ళీ వేరౌతారు."

"మరి అల్లాంటప్పుడు చేరదీయటం దేనికి, వేరౌటం దేనికి!"

"తమరి సంగతి ఏమిటి చెప్పరాదూ? ఈ ఫ్లెమిష్ పిల్లతో జీవితాంతం గడపగలననే అనుకుంటున్నావు లాగుందే?"

"ఆ! మాసంగతి వేరులే—మేం కాపురం పెట్టలేదే—ఏం, ఆలీస్, నిజం కాదూ?"

"ఖచ్చితంగా" అంటూ ఆ యువతి జవాబు చెప్పింది. ఆమె కంఠం అతి మృదువుగా, పరధ్యాన్నంగా చెప్తూన్నట్లుంది. ఒక కుర్చీమీద నిల్చుని, పూలవేస్లో అలంకరించటానికి అక్కడి తీగెనున్న పూవులు కోస్తోంది. డెషిలెట్ చెప్పుకుపోతున్నాడు.

"మా విషయంలో కాపురం బ్రద్దలయ్యే ఓఘాయిత్యాలేమీ ఉండవ్. అసలు సెలవు తీసుకోటాలు కూడా అవసరంలేదు. రెండునెలలే కలిసి జీవిద్దామనుకున్నాం. చివరిరోజు వచ్చేటప్పటికి, విషాదంగాని, విభ్రాంతిగాని ఏమీ లేకుండా ఎవరిత్రోవను వాళ్ళం వెళ్లిపోతాం. నేను ఇస్పహాన్ వెళ్ళిపోతాను. ఓడ టిక్కెట్టుకూడా అప్పుడే కొనేసి ఉంచాను. ఆలీస్, రూలాబ్రూయర్లో తన వసతిగదికి తను వెళ్లిపోతుంది. ఆగది తన క్రిందే అట్టే ఉంచింది కూడా."

"సూడ్లో అంతస్తుమీది గది. ఆ గది కిటికీలో నుంచి క్రింది రోడ్డుమీదికి ఉరకాలంటే బలే వీలు కూడా!"

ఆమాటంటూ, మొగం విప్పార్చుకొంటూంది. ఆ సంజ ఎరుపులో ఆమె మొగం వెలుగుతూన్నట్టుంది. చేతిలో పెద్దనీలపు పూవులకుత్తి పట్టుకుంది. కాని ఆమె మాట్లాడిన రీతిలో, ఆ స్వరంలో, ఏదో అగాధమైన లోతులున్నట్లయి అందరూ కిమ్మనకుండా ఊరుకున్నారు. గాలి కాస్త జోరుగా వీస్తూంది. ఎదుటి ఇల్లు మరీ ఎత్తుగా పెరిగినట్లు స్ఫురిస్తూంది.

"రండి, రండి, బల్లచుట్టూ చేర్దాం. అవాకులు చవాకులు అన్నీ వాగుకుందాం రండి" అన్నాడు కాఉడెల్.

"అదీ సంగతి—యౌవనం ఉండగానే ఆనందిద్దాం అంటావ్—కాదూ కాఉడెల్?" అంటూ లాగుర్నెరీ వికటంగా నవ్వాడు.

* * *

కొన్నాళ్ళ తర్వాత జీన్ రూడీలారోమ్ వీధికి వెళ్ళినప్పుడు దూస్తే స్టూడియోమూసేసి ఉంది. కిటికీలు, తలుపులు, అన్నీ తాళాలు వేసి ఉన్నట్లున్నాయి. ఇల్లు అంతటా క్రిందినుంచి పైదాకా అంతా నిశ్శబ్దంగా నిర్జనంగా ఉన్నట్లుంది. డెష్లెట్ వెళ్లాడన్నమాట. వాళ్లు అనుకొన్న కాలంవచ్చేసింది. సంబంధం ముగిసిపోయింది. "జీవితంలో కావలసింది చేసుకోగలగటం, మనస్సు, బుద్ధి అన్నీ స్వాధీనంలో ఉంచుకోగలగటం, ఎంత అదృష్టం! నేనేనాడైనా అల్లా చెయ్యగలనా!" అనుకొన్నాడు జీన్.

ఎవరో వెనుకనుంచి బుజం మీద చెయ్యివేశారు "ఏం, గాసీన్!" అన్న సంబోధనవిని వెనక్కి తిరిగాడు.

డెషిలెట్. చాలా అలసిపోయిన మనిషిలా ఉన్నాడు. ఒళ్ళు మునుపటికన్నా మరింత పచ్చబారింది. మొగంలో ముడుతలు ఎక్కువయ్యాయి. పారిస్లో పని ఉండి ఆగిపోయాననీ, ఇంకా కొన్నా

కృదాకా వెళ్ళటం లేదనీ వివరించాడు. గ్రాండ్ హోటల్‌లో బస చేస్తున్నాననీ, ఆ ఘోరం జరిగిన నాటినుంచీ స్టూడియో అంటే కంపరం పుట్టి పోయిందనీ—

"ఏ ఘోరం !"

"ఔను. అన్నట్టు నీకు తెలియదు. ఆలీస్ చచ్చిపోయ్యింది. ఆత్మ హత్య చేసుకొంది. ఒక్క నిమిషం ఆగు, ఉత్తరాలు ఏమైనా వచ్చాయేమో చూసుకొని వచ్చేస్తాను."

డెషి లెట్ వెంటనే తిరిగి వచ్చేశాడు. ప్రతి కలకట్ట చేత్తో పుచ్చుకొని, వణుకుతూ ప్యాకెజీ తాడు విప్పుతూ, గాసిన్ ప్రక్కనే నడుస్తూ నిద్రలో మాటాడుతున్నట్లు అతని వంకన్నా చూడకుండా చెప్పుకొని పోతున్నాడు.

"ఔను. ఆత్మహత్య చేసుకొంది. తనగది కిటికీలోంచి క్రిందికి ఉరికి చచ్చిపోయింది. ఆ సాయంత్రం నువ్వుండగా అన్నదే, అచ్చు అల్లాగే చేసింది ఏం చెప్పగలను? నాకు తెలిసిరా లేదు. అనుమానించనైనా అనుమానించలేక పోయాను. నేను దేశం వెళ్ళిపోతానని కొన్ననాడు, నాతో అతిదీనంగా చెప్పింది "డెషి లెట్! నన్నుకూడా నీతో తీసుకొని పో. నన్ను ఒంటరిగా వదలవద్దు. నువ్వు లేకుండా నేను బతికలేను" అంది. ఆ మొరకు దేశంలో ఆవిడాన్ని వెంటబెట్టుకొని ఉండగలవనైనా ఊహించగలవా! ఆ ఎడారిలో,—మన్య జ్వరాలమధ్య—రాత్రుళ్ళు ఆరుబయట గుడారాల బతుకులో—మళ్ళీ రాత్రి భోజనాలవేళ అదేమాట చెప్పింది; "నేను నీ పనికేమీ అడ్డురాను ఎంత మంచిగా ఉంటానో నువ్వే చూస్తావుగదా" అని, నాకు చిరాకెత్తుకున్నట్లు గ్రహించి ఇంక ఆ విషయం ఎత్తటం మానుకుంది. రాత్రి నాటకానికి వెళ్ళాం. ఆ ప్రోగ్రాం అంతా ముందు అనుకొన్నదే. నాటకం చూస్తున్నంతసేపూ అతి సంతోషంగా, హాయిగా కనబడింది. నా చేయి తన చేతిలో పెట్టుకొని "ఎంతో బాగుంది" అంటూనే ఉంది. ఆరాత్రి రైలుకు వెళ్లాలనుకొన్నాను. అందుకని ఆమె వసతి గృహందాకా బండిలో తీసుకెళ్ళి దిగబెట్టాను. ఆ యింటికి వచ్చేటప్పటికి తనతోకూడా ఒక్కసారి పైకి రమ్మంది. నాకు యిష్టం లేదు. తన గదితలుపుదాకా రమ్మని బ్రతిమాలింది. తలుపుదాకానే వెళ్లి వెనక్కి వచ్చేసేందుకు ఒప్పుకున్నాను. లోపలికి వెళ్ళలేదు. టికెట్టు కొనేసుకొని ఉన్నాను. సామాను సర్దడమయిపోయింది అసలు వెళ్ళటం ఖాయం చేసుకొని ఉన్నాను. కొంత కష్టంగానే ఉంది. అయినా మెట్లుదిగి వస్తూంటే లోపల్నుంచి నాతో ఏదో అంటూంది. "నీ కంటేముందే అక్కడుంటాను" అని అన్నది. కాని, క్రిందికి వీధిలోకి వచ్చేదాకా ఆమె మాట అర్థమేమిటో తెలియ లేదు—ఓ!"

చెప్తూ నేలకేసి చూస్తూ ఆగిపోయాడు. ఆ దృశ్యం అడుగడుగునా కన్నుల కట్టూంది. కదలిక లేకుండా బాధతో గోండ్రిస్తూ నల్లటి కుప్పగా కూలిపడిపోయిన దేహం.

"ఆ తర్వాత రెండుగంటలకు చచ్చిపోయింది. ఒక్క మాటా మాటాడలేదు. సన్నగా ఏడవనైనా ఏడవ లేదు. ఆ బంగారు కళ్లతో అల్లాగే నావంక సూటిగా చూస్తూ ఉండిపోయింది. బాధ పడుతోందా? నన్ను క్షమించిందా? అల్లా నిండుదుస్తుల్లో ఉన్నదాన్నే తీసుకుపోయి పరుపుమీద పడుకోబెట్టాం. తలమీద గాయం కప్పేందుకు పెద్ద లేసుగుడ్డ తలకు చుట్టి ఉంది. మనిషి చాలా పాలిపోయింది. ఒక కణతమీద కొద్దిగా నెత్తురు చిమ్ముతూంది. అప్పుడు కూడా ఆమె తన మామూలు ప్రశాంతతతో అతి రమణీయంగానే ఉంది. ఆకణతమీద నెత్తురు చుక్క మళ్ళీ మళ్ళీ కూడుకొంటూంటే తుడిచేద్దామని ముందుకు వాలాను. అప్పుడు మాత్రం ఆమె కళ్ళచూపు మారిపోయింది. ఉగ్ర కోపంతో, అతి భీకరంగా శపిస్తున్నట్లుంది. పాపం, ఆ అనద అల్లా మూగ శాపమిస్తోంది. కొన్నాళ్ళాగి ఆమెను కూడా వెంట తీసికెళ్తే, నాకు పోయిందేముంది? దేనికైనా సిద్ధమయిందే! ఏ విధంగానూ నన్నెప్పుడూ చిరాకు పెట్టదే! ఉహూ! గర్వం! నామాటకు తిరుగు లేదన్న మూర్ఖత్వం! అందుకే ఒప్పుకోలేదు. చచ్చిపోయింది. ఆమెను ప్రేమించాను కాని నామూలానే చచ్చి పోయింది."

అంతకంతకూ తన్ను తను నిమలబెట్టుకొంటున్నాడు. ఆ తీవ్రతలో గట్టిగా మాట్లాడుతున్నాడు. తమను మోచేతుల్తో తోసుకొంటూ పోతూ ఇల్లా మాట్లాడుకొంటున్న ఈ వ్యక్తిని జనం తెల్లబోయి తేరి పారచూస్తున్నారు. రూ డి ఆమ్‌స్టర్‌డామ్ వీధిలో పోతున్నారు. గాసిన్ తను మునుపున్న ఇంటికేసి, ఆ బాల్కనీ కేసి వరాండా కేసి చూస్తున్నాగా. మనస్సులో ఫానీన్, తమ కాపురమూ, మెదిలాయి. అకస్మాత్తుగా భయంతో వణికి పోయాడు.

“ఆవిడ దేహాన్ని మాంటెపర్నాసే తీసుకెళ్ళాను. ఆవిడ చుట్టాలు పక్కాలు స్నేహితులు ఎవరూ లేరు. ఆవిడ విషయం సర్వం ఒక్కడినే చూసుకొందా మనుకొన్నాను. అప్పటినించీ ఇల్లాగే ఉన్నాను. అస్తమానం ఒకటే ఆలోచన. మనస్సులో ఈ వేదన తొలగిపోయేదాకా ఎక్కడికి పోవటానికీ మనస్సు నిశ్చయించుకో లేకుండా ఉన్నాను. మాయింటికిపోలేను. రెండు నెల్లు ఆమెతో సుఖంగా గడిపిన ఆ యిల్లు చూడలేకుండా ఉన్నాను. బైటే బ్రతుకుతున్నాను. కాలుగాలినట్లు తిరుగుతున్నాను. ఏవిధంగానైనా మనస్సు కుల్లాసం కల్గించుకొందామని ప్రయత్నిస్తున్నాను. కాని ఆవిడ శపిస్తూన్న చూపు, కంఠంమీద కారుతున్న నెత్తురు నిత్యం కళ్ళముందు ఆడుతూనే ఉన్నాయి.”

అని, దుఃఖనిమగ్నుడై ఆగి, ముక్కుమీదనుంచీ జారుతున్న రెండు పెద్ద కన్నీటిబిందువులు తుడుచుకొంటూన్నాడు. బొద్దుగా ఉన్న ఆ చిన్ని ముక్కు జీవితం అంటే అతనికున్న అనురాగం; అతని అపార మిత్రస్వభావం తెలుపుతూంది. కళ్ళు తుడుచుకొంటూ అన్నాడు.

“చూడు, నీకు తెలుసుగదా, భాయీ, నేను నిజంగా అంత చెడ్డవాడినికాను—కాని ఈమాటు చేసినపని మాత్రం కొంత మితిమీరి వ్యవహరించటమే.”

జీన్ అతన్ని ఓదార్చేందుకు ప్రయత్నిస్తున్నాడు. అదంతా కర్మప్రభావం అనీ దురదృష్టమనీ ఉపశమనాలు చెప్తున్నాడు. కాని జెకిలెట్ తల త్రిప్పుతూ పళ్లు గిటకరించుకొని అంటున్నాడు. “కాదు. కాదు. నన్ను నేను ఎప్పటికీ క్షమించుకో లేను. తగినశిక్ష నాకు నేనే విధించుకోగల్గితే బాగుండును.”

ఈ ప్రాయశ్చిత్తదాహం అతన్ని వీడలేదు. స్నేహితులందరితోనూ చెప్పుకుంటున్నాడు. వాళ్లల్లో గాసిన్ ఒకడు. గాసిన్ ఆఫీసు అయిపోగానే జెకిలెట్ వచ్చి కలుసుకొనేవాడు. “నువ్వు ఎక్కడికైనా వెళ్ళాలి జెకిలెట్! దేశాటనం చెయ్యి! పని కల్పించుకో! అదే నీకు మనశ్శాంతి నిస్తుంది” అనే వాళ్ళు, కౌఉడెలూ తక్కిన స్నేహితులూ. అతనికి వెఱ్ఱిఒకటి పట్టిపోవటం, తను వస్తుతః చెడ్డవాడను కానని స్నేహితులచేత అనిపించి మనస్సుకు నచ్చచెప్పుకోవాలన్న నిత్యదాహం, ఇన్నీ చూస్తుంటే జెకిలెట్ విషయంలో వాళ్ళకు ఆందోళన కలుగసాగింది. చివరికి, ఊరు వదలిపోయేముందు స్టూడియో చూచిపోదామన్న వాంఛతోనో, లేక ఈ దుర్భర స్థితిని అంతమొనర్చుకోవాలన్న ఉద్వేగంతోనో, ఒకనాటిరాత్రి తన స్టూడియోకు వెళ్ళాడు. మర్నాడు ప్రొద్దున్నే పల్లెలనుంచి వస్తూన్న కార్మికులు ఇంటి ముందు పేవ్‌మెంటుమీద పడిఉన్న అతని దేహాన్ని చూశారు. తల పగిలిపోయిఉంది. ఆ స్త్రీనాదిరిగానే మృత్యువు నాహ్వానించుకొన్నాడు. ఆ ఆవేదనే, ఆ విస్ఫ్రహే! సరిగా అల్లాగే తలక్రిందులుగా పడి తల పగిలిన చావే!

స్టూడియో అంతటా జనం మూగారు. ఇన్నాళ్లూ అక్కడి వసంతోత్సవాల్లో పాల్గొన్న రసికులూ, స్త్రీలూ, కళాకారులూ, అందరూ ఉన్నారు. అంతా నిశ్శబ్దంగా గుసగుసలు పోతున్నారు. అతని దేహాన్ని లతామంటపంలోకి చేర్చి అక్కడి చలువరాతి చప్పరంమీద పడుకోపెట్టారు. తల గాయంచుట్టూ తలపాగా చుట్టిఉంది. తెల్లని చేతులు రెండూ సర్వమూ అర్పణమొనర్చుకొంటూన్నట్లు అంజలి పట్టిఉన్నాయి. సర్వాంగాలు స్థిమితం పొందినట్లు నిశ్చలంగా ఉన్నాయి. చుట్టూ లతల పుష్పగుచ్ఛాలు తీవలలో సన్నగా కదిలుతున్నాయి. వింగునాటిరాత్రి తొలిసారిగా గాసిన్ తన ప్రియురాలిని కలుసుకొన్నది ఈ పూలపొదవద్దనే!

## 10

అంటే ఒక్కొక్కప్పుడు ఈ ఎడబాటులవల్ల కూడా మనుష్యులు చచ్చిపోతారన్న మాట!...ఇప్పుడు తమ మధ్య ఏ కలహం వచ్చినా, జీన్ తను వెళ్ళిపోవటం గురించి మాట్లాడటంలేదు. మునుపటిలాగా ఒళ్లుమంట పట్టలేక “అదృష్టం కొద్దీ, ఇది ఎన్నాళ్ళో ఉండదులే.” అని అనటంలేదు. ఆవిడ ఊర్కే — “సరే వెళ్ళు — నేను ఆత్మహత్య చేసుకొంటాను. ఆవిడ చేసిన పనే చేస్తాను—” అని అనేస్తుందేమో! అంటే చాలు! ఆవిడ అంతకంతకూ విచారంగా ఉండటం, విషాదగీతాలు పాడటం, ఏదో మనాదితో నిశ్శబ్దంగా కలలో ఉన్నట్లుండటం, అన్నీ కలిపి అతనిలో భీతావహం పెంచేసి, అల్లా చెయ్యగలదన్న భయం విపరీతంగా కల్గించాయి.

ఏమైనా, కాన్సులర్ ఉద్యోగం అయేందుకు కావలసిన పోటీపరీక్షలో మాత్రం ప్యాసయాడు.

పరీక్షలో మొదటితరగతి లో కూడా వచ్చాడు. కాబట్టి విదేశాల కొన్సులేట్ లలో ఖాళీదొరకగానే అతనుకోరుకొన్న మొదటి ఉద్యోగమే అతనికి దొరుకుతుంది. అందుచేత ఆ ఎడబాటు, వారాలు కూడా కాక, రోజులలోకి, దగ్గరబడింది. వేసవికూడాగడిచి రోజులు ప్రొద్దు తగ్గిపోతూ శీతువు ప్రవేశిస్తోంది. మంచుతెరలు ప్రారంభమౌతున్నాయి.

ఒకటొకటే, పల్లెపట్టు వేసవి నిలయాలన్నీ మూసేస్తున్నారు. వర్సేల్స్ రోడ్డు పొడుగునా ఇళ్ళు ఖాళీచేసిన సామానులబళ్ళు పోతున్నాయి. చెట్ల ఆకులు గలగలరాలూ సుళ్ళు తిరిగి పరుగుతూన్నాయి. కోసేసిన పొలాల్లో ఎత్తుగా కుప్పలుపోసి ఉంచారు. ఆకాశం కూడా వాల్లనంటుకొంటూ క్రిందికి దిగి పోయినట్లుంది. రోడ్డితోట చెట్ల ఆకులన్నీ రాలి కుంచుకుపోయినట్లుంది. వెనుకగా ఖాళీ బంగాళాలు మూసేసి, నిద్దనంగా ఉన్నాయి. ఇంటిముందు గైలు రోడ్డు ఇటూ అటూ సర్వం ఒలిచేసినట్టు దిసరూపుతో అడివి అంచునే, బద్దలు కట్టుకు పోతూంది.

జీవప్రపంచమంతా నిర్జీవమై నిర్మానుష్యమై పోయినట్లున్న ఈ ఏకాంతంలో అతనిని ఒంటరిగా వదిలిపోవటంకన్నా ఘోరకృత్య మేముంటుంది! అతని మనస్సప్పుడే దానికొడుచొచ్చింది. "సెలవు" అని చెప్పగల సమర్థతే అతనిలో నశించిపోతోంది. అతనిలోని ఈ నీరసగుణంమీదే అవిసె కూడా ఆశలన్నీ పెట్టుకొనిఉందేమో, ఏమీ మాట్లాడకుండా ఇద్దరూ అనుకొన్న ప్రకారం వేరైపోవటానికి ఏ అడ్డంకులు చెప్పనన్నమాట నిలుపుకొంటున్నట్లు, శాంతంగా నిశ్శబ్దంగా ఉండిపోయింది. ఒకనాడింటికి వస్తూనే కబురు చెప్పాడు.

"నాకు ఉద్యోగం వచ్చింది!"

"అహా! ఎక్కడా?"

మాట, పలుకు, మామూలుగానే ఉంది. కాని పెదవులూ, కళ్ళూ కదిలిపోయాయి. మొగం బాధతో వికృతమైపోతోంది. ఆమె వల్లా అసందిగ్ధంలో ఉండటం భరించలేక అన్నాడు. "కాదు కాదు, అప్పుడే కాదు. హెడూయిన్ విశ్వమంటే నావంతు ఇంకోరికి వదిలేశాను. ఇంకో ఆరు నెల్ల దాకా మనం కలిసిఉండవచ్చు ఫరవాలేదు."

సంతోషం కట్టలుతెగి, కన్నీటి వరదలై వెల్లిగా ముద్దులు కురిపించేస్తూంది. మాటలు తడబడుతూ అంటూంది. "నీకు వెయ్యి దణ్ణాలోయ్! ఇంక మన జీవితం ఎంతబాగా ఉండేట్లు చేస్తానో చూడు—అసలు సంగతి ఆదే, చూశావు, నువ్వు వెళ్లి పోతావన్న దిగులే నన్నిల్లా గయ్యాళిగా తయారు చేసింది." ఇకనుంచీ సర్దుకొంటుంది. రాగల ఎడబాటుకు ఆ త్యాగానికి తన్ను తను నెమ్మదిగా తయారు చేసుకొంటుంది. ఆరునెలలలో వసంతం కూడా వస్తుంది. ఈ శీతల మృత్యు వాతావరణం కూడా అంతరిస్తుంది.

ఆమె మాట నిలబెట్టుకొంది. ఆ తర్వాత చిరాకులూ పరాకులూ, చిల్లర తగాదాలూ ఏమీ లేకుండానే రోజులు గడుస్తున్నాయి. పిల్లకి చికాకులు తగ్గించుకొనేందుకు కుఱ్ఱవాణ్ణికూడా వర్సేల్సులో అట్టే పెట్టటానికొక్కడా ఒప్పుకుంది. ఇప్పుడు ఆదివారాలు తప్ప బిడ్డడింటికి రావటం లేదు.

ఈనూతన జీవితానికి అలవాటు పడక పోయినా, పిల్లడు, అథవా మనస్సులో విషయం బైటపెట్టని కృత్రిమాన్ని నేర్చుకోసాగాడు. వాళ్ళజీవితం అతి ప్రశాంతంగా గడిచిపోతోంది. హోటేమాలతో విందులకెళ్ళినప్పుడు, మునుపటి దుమారాలు లేగటం లేదు. మూలపడ్డ పియానో మళ్ళీ బైటకివచ్చింది. ఇద్దరికీ ఇష్టమైన పాటలు మళ్ళీ జంత్ర గాత్రాలు మేళవించి పాడుకొంటున్నారు.

కాని హృదయ అంతరాంతరాల్లో మాత్రం జీన్ మరింత దిగులుపడుతున్నాడు. తన ఈనీరసగుణం తనను ఎంతవరకూ దిగలాక్కుపోతూందో తెలియక అంతకంతకు మరీ తికమక పడిపోతున్నాడు. చివరకు తనుకొన్సులేట్ ఉద్యోగంకూడా వదులుకొని ఆఫీసులోనే స్థిరపడిపోతానా అని విస్తుపోతున్నాడు. అంటే పారిస్ లోనే మరి: ఊలంపటపు బ్రతుకు అంతులేకుండా ఇల్లాగే పొడిగించబడుతుందన్నమాట: చిన్నవాడు గన్న కలలన్నీ భగ్నం చేసుకోవలసిందే! ఇంక, తనకుటుంబానికి కలిగించే వ్యథ చెప్పదరమా! తండ్రితో తప్పక వేరుపడిపోవాల్సివస్తుంది. తన భవిష్యజ్జీవితాన్ని ఇల్లా చేజార్చుకొంటే తండ్రిగ తన నెన్నడూ క్షమించడు. అందులో ఎందుకని వదులుకొంటున్నాడో తెలిస్తే అసలు క్షమించడు.

ఇంతా చేసి ఎవరికోసం! వాడిపోయి, ముసిలైపోతూన్న ఈ అల్పరాలికోసం! ఆమెను తను ఇప్పుడు ప్రేమించటం లేదు. ఆమె పూర్వప్రేమికులను కలుసుకొన్నప్పటినుంచి, ఆ విషయం

స్పష్టంగా తను గ్రహించుకో గలిగాడు. మరి ఇక ఏ మాయశక్తి తనను ఈమెతోటి ఈ జీవితానికి బంధించేస్తోందో ?

అక్టోబరు నెలాఖరు రోజులలో, ఒకనాడు ప్రొద్దున్న రైలులో పోతోంటే, ఒక ఆడపిల్ల చూపులు అతని చూపుల్తో కలిశాయి. చటుక్కన జ్ఞప్తికి వచ్చింది. ఆనాడు అడవిలో బండితోలుతూ ఆనందం ఉబుకులాడుతూ పోతూన్న పిల్లే. అప్పటి ఆ జ్ఞాపకమే తర్వాత నెలలతరబడి తనను వెంటాడింది. ఇవాళా ఆనాటిలాగే లేతరంగు దుస్తుల్ని ధరించింది. వాటిపైన పెద్ద ఓవర్ కోటు ఒకటిమాత్రం వేసుకొని ఉంది. ఆమె ప్రక్కనే పుస్తకాలూ, ప్రయాణపు సంచీ, సుత్తిగా కట్టిన పొడుగాటి పూలరెమ్మలూ ఉన్నాయి. వేసంగి పల్లెటెపట్టున గడిపి, మళ్ళీ పారిస్ కు తిరిగివస్తున్నట్లు అవన్నీ తెలుపుతున్నాయి. ఆమె అతన్ని గుర్తించింది. ఆమె కన్నులలో చిరునవ్వు, నూతిలో నిశ్చలంగాఉన్న నీటిపైన చిన్న అల లేచి అంతరించినట్లు, తళుక్కన మెరిసి మాయమైంది. ఒక్కక్షణం ఇద్దరిమధ్యా ఒకే అవ్యక్త భావం. ఇద్దరకూ సంపూర్ణంగా మనోగతివ్యాతూ, ఆ చూపుల్లో వెలసింది.

"మీ అమ్మగారి కెల్లా ఉందండీ, అర్మండీ గారూ" అంటూ వృద్ధుడు బూచరో అకస్మాత్తుగా అడిగాడు. ఆ పిల్లను చూడటంలోనే కళ్లు మిరుమిట్లు పడ్డాయేమో అంతవరకు జీన్ డాక్టర్ బూచరోను చూడలేదు. ఆయన ఒక మూలకునక్కి పాలిపోయిన మొగం ముందుకువంచి పేపరుచదువుకొంటున్నాడు.

ఆయనకు తనూ తన కుటుంబమూ జ్ఞాపకం ఉన్నందుకు జీన్ కు మనస్సులో చాలా సంతోషమూ ఆయనపట్ల అభిమానమూ కలిగాయి. తల్లి విషయంలో తెలిసిన సంగతులన్నీ చెప్పాడు. ఆ తర్వాత అపిల్ల, తన కవల చెల్లెళ్ళ క్షేమం అడిగింది. వాళ్లు తన బాబాయికి (డాక్టరుగారికి) తమ తల్లివిషయంలో తీసుకొన్న జాగ్రత్తకు కృతజ్ఞత తెలుపుతూ అతిముద్దుగా ఉత్తరం వ్రాశారట. ఆ అమ్మాయి తన చెల్లెళ్ళ క్షేమం అడగటంతో జీన్ కు మరింత గాఢంగా ఆమె మీద అభిమానం కల్గింది. అంటే ఆమె వాళ్ళ నెరుగునన్నమాట! అతనికి పట్టరానిసంతోషం కల్గింది. డాక్టరు బూచరో వైద్యశాలలలో పాఠాలు ప్రారంభించవలసి ఉంది. అందుకనే పారిస్ వెళ్తున్నారు. ఆ ఉత్సాహంలో ఆ మాట వినేటప్పటికి అతనికి కొంత నిరుత్సాహం కల్గింది. అంటే ఈమె ఇంక మళ్ళీ ఎప్పట్లో కలుసుకొనే అవకాశముండదు. రైలుకిటికీలోంచి వెనుకకు పరుగెత్తుతున్న పొలాలూ, ప్రకృతీ, క్షణం క్రింద దాకా కల కలలాడుతూ పచ్చ పచ్చగా కనబడ్డవన్నీ, నిరామయంగా మోడు బారిపోయినట్లయిపోయాయి! గ్రహణంపట్టినట్లు పగటివెలుగంతా జీబుచీకటిగా మారిపోయినట్లయింది.

రైలు పెద్దగా కూసింది. దాదాపు ప్రయాణం అయిపోయింది. వాళ్ళకి నమస్కరించి వీడ్కోలు తీసుకొన్నాడు. వాళ్లు జనంలో కలిసిపోయారు. కాని స్టేషను లోంచి బైటికి వస్తాంటే జన సమ్మర్దంలో మళ్ళీ కలుసుకొన్నారు. వచ్చే గురువారం తర్వాత తాము యింటిదగ్గరే ఉంటామనీ, అతనికి అభ్యంతరం లేకపోతే తమ యింటికి ఫలహారానికి రావలసిందనీ డాక్టరు బూచరో, జీన్ ను ఆహ్వానించాడు... ఆమె తన బాబాయి చేతిని తనచేతిలోకి తీసుకొంది. ఒక్కమాటైనా అడకుండానే, ఆమె తన నాహ్వానించినట్లనిపించింది జీన్ కు.

బూచరో ఇంటికి వెళ్లాలని చాలామాట్లు నిశ్చయించుకొన్నాడు. వెంటనే వెళ్ళకూడదని కూడా అన్నిమాట్లూ నిర్ధారణచేసుకొంటూ వచ్చాడు. వెళ్ళి లేనిపోని అడియాసలు కల్పించి లాభమేమిటి ?— చివరికొకనాడు, ఆఫీస్ లో విందు ఉన్నదనీ వెళ్ళాలనీ యింట్లో చెప్పాడు. ఫాన్ని, అతని దుస్తుల్లో మేలైనవితీసి ఉతికి బాగుచేసింది. తెల్లని నెక్ టైలు అన్నీ నీటుగా, ఇస్త్రీచేసి సిద్ధం చేసింది. తీరా గురువారం సాయంత్రం వచ్చేటప్పటికి అతనికి వెళ్ళటానికి ఏమాత్రమూ ఇష్టం లేకపోయింది. కానీ ఫాన్ని బలవంతపెట్టింది. సాంఘికంగా అతని ధర్మాలు అతను నిర్వర్తించాలనీ, అల్లాంటి విందులకు వెళ్లి తీరాలనీ ఉద్బోధించింది. అతన్ని ఎక్కడికీ కదలనీకుండా తనే ఇల్లా చేశానంటూ, తన స్వార్థపరత్వాన్నితిట్టుకొంది. అతని మనసు మార్చి, విందుకు ప్రయాణం చేసింది. నెక్ టై స్వయంగా తీర్చిదిద్దింది. క్రాపు దువ్వి, చెంపలు చేత్తో మన్నగా సరిచేసింది. మధ్యమధ్య సిగరెట్లు కాలుస్తూ, అతన్ని శృంగారించటానికి ఆ సిగరెట్లు మేజామీద పెడుతూ ఆ సిగరెట్లు వాసన అతనితో డాన్సుచేసే అమ్మాయిలు పసిపట్టి వెక్కిరిస్తారేమో అని చెప్పి నవ్వుతూంది. ఆమె సంతోషం చూస్తుంటే ఆమెతో అబద్ధం చెప్పవలసివచ్చినందుకు అతనికి పశ్చాత్తాపం కలుగసాగింది. దానితో ఆగిపోవాలనే అనుకొన్నాడు. కాని ఆమె బలవంతం

చేసి నెమ్మదిగా అతన్ని బైటికి కదలిస్తూ "నువ్వు వెళ్లాలంటున్నాను—వెళ్ళితీరాలి" అని బైటికి సాగనంపింది.

రాత్రి అతను ఇంటికి వచ్చేటప్పటికి చాలా ఆలస్యమయింది. ఆమె నిద్రపోతోంది. ఆదీపం వెల్గులో నిద్రపోతూన్న ఆ నీరసరూపం చూసేటప్పటికి, మూడేళ్ళక్రితం ఒకనాటిరాత్రి ఇల్లాగే ఇంటికి వచ్చినదృశ్యం మనస్సులో మెదిలింది. అబ్బ! అప్పుడే ఎన్నాళ్ళు గడిచిపోయాయి.—ఆ విపరీత వికృత విషయాలన్నీ తనకు తెలిసాకకూడా! తాను అప్పుడెంత పిరికివాడై పోయాడు! తన ఈశానిస గొలుసుల్ని పుటుక్కున త్రెంపవలసిన విషయాలే తనను మరింత గాఢంగా బందీని చేసేటట్టుగా ఎల్లా బిగించుకొన్నాడు? అతనిలో వికారం పుట్టుకొచ్చింది. కడుపులో దేవేస్తుంది. ఆగది, ఆమంచం, ఆపక్క, ఆస్త్రీ, అన్నీ తెగ అసహ్యం కల్గిస్తున్నాయి. దీపం చేత్తోపట్టుకొని నిశ్శబ్దంగా అవతలి గదిలోకి నడిచిపోయాడు. అతనిప్పుడు ఏకాంతం కోరుకొంటున్నాడు. ఈనాడు తనలో గలిగిన అనుభవాన్ని మననం చేసుకోదలుస్తున్నాడు. ఏం జరిగింది? ఏమీ జరిగినట్టే లేదు...

అతను ప్రేమిస్తున్నాడు.

మనం మామూలుగా వాడే మాటల్లోనే కొన్నిటిలో మంత్రకవాటాలుంటాయి. ఒక్కొక్కప్పుడు అవి చటాలున తెరచుకొని ఆ పదాల యదార్థ, అంతరార్థాలను అట్టడుగు లోతులదాకా చూపించుకొంటాయి. అంతటితో ఆ పదాలు మళ్లీ మూసుకుపోయి, మామూలుగా నిత్యవ్యవహారంలో దొర్లుకుపోతూ, అజ్ఞాతంగా అరిగిసురిగి పోతూంటాయి. అల్లాటి మాటలలో "ప్రేమ" ఒకటి. ఒక్కసారైనా, ఆ మంత్రలోకపు వెలుగుతో జాజ్వల్యంగా ఆ పదం భాసించినప్పుడు చూసినవాళ్లు మాత్రమే, జీన్ మనస్సులో గంటనించీ రాజుతూన్న మధుకీలను అవగతం చేసుకోగల్గుతారు. జీన్కూడా ముందు తనకు ఏమైందో తనే అర్థంచేసికోలేకపోయాడు.

డాక్టరుగారి యింటివద్ద, గంటలకొద్దీ మాట్లాడినంత సేపూ, ఒక చక్కని మధుర వాతావరణంలో హాయిగా ఉన్నట్లు మాత్రమే అనుకోగలిగాడు.

కాని ఆ యింటినుంచి బైట చీకటిలోకివచ్చి పందు మళ్ళేటప్పటికి అతనిలో ఏదో వెర్రి ఉత్సాహం గల్గింది. ఇంతలోనే మళ్ళీ మూర్ఛపోతూన్నంత నీరసం కల్గింది. "అరె భగవంతుడా! నాలో ఏం జరుగుతూందేమిటి?" అనుకొన్నాడు. ఈనాడు నడుస్తూన్న వీధులు—పారిసే కొత్తగా మారిపోయినట్లుంది. ఒక్కసారిగా విచ్చుకొని విస్తరిస్తూ, నందనవనమై పోయినట్లుంది.

నిజమే, ఘాతుకమృగాలు తిరిగే అర్ధరాత్రివేళ, మురికి కాల్వల మురికి, పచ్చని గ్యాస్ లైట్ దీపాలలో పాంసులెత్తి ప్రవహించేవేళ, శాఫో ప్రేమికుడు—కామశాస్త్ర కళా సర్వస్వములో పుత్రోవ, పొందిన ఈ వ్యక్తి—పారిస్ వీధుల్లో, కొత్తగా పారిస్ వచ్చి పండుగలలో పాల్గొని ఎగురుతూ గంతులు వేసుకొంటూ, ఒంటివగల కిణికిణీలాడించుకొంటూ, పాటలతో నక్షత్రాల నలరించుకొంటూ, ఆ వెన్నెల వెల్లువకు మొగ్గవిచ్చిన పువ్వులా ఆనందనృత్యం చేస్తూ, పోతూన్న పల్లెటి కన్నె పడుచులా-సాగిపోతున్నాడు గాసిన్. స్టెప్స్ మెట్లు ఎక్కుతూ, ఇక తనచీకటి ఇంటికి దాపౌతున్నా ననిపించే టప్పటికి అకస్మాత్తుగా తనలో తను గట్టిగా అనుకొంటున్నాడు. "ఆహా! ఆ అమ్మాయిని ప్రేమిస్తున్నాను! ఆ అమ్మాయిని ప్రేమిస్తున్నాను." అని. అప్పుడే అతనికి తెలిసివచ్చింది.

"ఎవరక్కడ నువ్వేనా జీన్! ఏంచేస్తున్నావ్?"

తన ప్రక్కలో జీన్ లేక పోయే టప్పటికి భయంతో అకస్మాత్తుగా మెలుకువ వచ్చి ఫానీ లేచి, అడుగుతూంది. అతను వెంటనే ఆమెదగ్గర కెళ్లి బుజ్జగించి, ముద్దులాడి, ఆఫీస్ విందు విషయం, అక్కడ తను నృత్యంచేసిన పిల్లలవిషయం అబద్ధాలు ఆడి ఉండవలసింది. కాని అదంతా తప్పించుకొనేందుకే, అక్కడే కూర్చున్నాడు. అంతకన్నా కూడా, ఈ నూతన ప్రేమానుభవంతో, ఫానీని కౌగిట చేరటానికే అతనికి కంపరం పుట్టుకొస్తోంది. హెట్టిమూలకు ప్లాను లేవో వేసి పెట్టాలని వంక పెట్టుకొని అల్లాగే కూర్చున్నాడు.

"నిప్పు ఆరిపోయింది. చలి వేస్తుంది!"

"ఏం వెయ్యదు."

"పోనీలే, తలుపు తెరిచిఉంచు. నీ దీపం కనబడ్తూ ఉంటుంది.

ప్లానులు వేస్తున్నానని వంకచెప్పినందుకు పూర్తిగా పనిచేస్తున్నట్టే నటించవలసివచ్చింది. బల్లనిండా డ్రాయింగ్ కాగితాలు పరికరాలూ అన్నీ అమర్చాడు. అక్కడినుంచి కూర్చుని ఊపిరి బిగ

బట్టుకొంటూ, ఆనాటి విషయాలన్నీ ఆలోచిస్తూ జ్ఞాపకం చేసుకొంటూ, కాసేపు అల్లాగే కూర్చుండి పోయాడు. ఆ కల అల్లాగే నిల్చిపోనే ఆవేదనతో వెంటనే సిజర్ బాబాయి పేరిట ఉత్తరంగా, అనుభవాన్నంతా వర్ణించుకొంటూ వ్రాస్తున్నాడు. చలి గాలి, ఆకులు లేని చెట్లకొమ్మల చిటపట గిరుచుకొంటూ, హోరెత్తుతూ, జోరుగా వీస్తూంది. ఉండి, ఉండి ఒక రైలు మోతలెత్తుకొంటూ పోతోంది. దీపం వెలుగుతో నిద్రపట్టక పంజరంలో చిలుక ఒక కమ్మీమీదనుంచి మరొక దానిమీదికి కదులుతూ రెక్కలు రెపరెపలాడించుకొంటూంది. మనస్సులో ఉన్నదంతా ఉత్తరంలో వ్రాసేస్తున్నాడు. మొదట అడవిలో ఆ అమ్మాయిని కలుసుకోవటం, తర్వాత రైలులో పరిచయం, వాళ్ళయింట్లో అడుగు పెట్టగానే తన మనస్సులో కలిగిన విచిత్రోత్సాహం—ఆయిల్లే మునుపు బాబాయిలో కలిసి వెళ్ళినప్పుడు దిగులు పుట్టిస్తూ గీరుగారుతున్నట్లనిపించింది. ఈ సాయంత్రం ఆ గదిలోనే ఆనందం తాండవమాడుతూ, గదులన్నీ దీపకాంతులతో వెలుగుతున్నాయి. ఆ ఉక్టరుగారు,—ఆ చూపు మొదట తను చూసినవాడు ఒత్తైన కనుబొమలక్రింద సన్నగా నిశితంగా కంగారు పెట్టేటట్టుండే—ఆ చూపు ఇప్పుడల్లా లేదు. దయఒలుకుతూ పితృవాత్సల్యంతో తొణికిసలాడుతూ తనయింట అతిథు లానందంగా గడుపుతున్నందుకు ఆనందంతో పెల్లివిరుస్తూ ఉంది.

"హఠాత్తుగా ఆమె నాదగ్గిరకు వచ్చింది. ఆ తర్వాత నేను మరేమీ గమనించలేకపోయాను. ఆమె పేరు ఐరీని. అందంగా ఉంది. మనిషిలో మంచి మార్దవముంది. ఆమెజుట్టు, ఇంగ్లీషు పడుచుల జుట్టువర్ణంలో, బంగారు గోధుమవర్ణంలో ఉంది. నోరు అచ్చు పసిపిల్ల నోరులాగా ఎప్పుడూ నవ్వబోతూన్నట్లే ఉంటుంది. నవ్వులంటే, కొందరు ఆడవాళ్లు నవ్వుతారే, వెకిలిగా, వింటే వెన్ను గగుర్పొడిచేటట్టుగా, అల్లాంటి నవ్వు కాదు. యౌవనానందా లుప్పొంగిపోతున్న, హాయైన నవ్వు."

ఆమె విషయమంతా వివరిస్తున్నాడు. లండనులో జన్మించింది. కాని తండ్రి ఫ్రెంచిదేశీయుడే. పిల్లలు చాలామందిఉన్న తమ్ముడికి, కొంత కుటుంబ భారం తగ్గించే ఉద్దేశంతో, బాబాయి ఆమెను పెంచుకొన్నాడు. ఆమె అంటే అతనికి అతివాత్సల్యం.

"నాతో అతి చనువుగా మాట్లాడింది. ఆమె మాట్లాడుతూన్నంతసేపూ ఆమె పలుకులు, నవ్వులూ వింటూ, ముగ్ధుణ్ణయిపోయి, జీవితంలో నాకు మహదానందం కూర్చగల పెన్నిధానం నా సమీపంలోనే ఉందనీ, నేను ఆమెను గ్రహించి, ఎక్కడికి కావలసివస్తే అక్కడికి నా వెంట పెట్టుకొని ఆమెను తీసుకెళ్ళ గలగటం నా చేతిలోనే ఉందనీ, హృదయ అంతరాలలో భావించుకొంటూ కూర్చున్నాను"

"ప్రియతమా, ఇంక వచ్చి పడుకోరాదా ?"

అదరిపడి, వ్రాస్తూన్న ఉత్తరం వ్రాయటం ఆపి, చటుక్కున దాచేశాడు. "క్షణంలో వస్తున్నా! నిద్రపో, నిద్రపో!"

ఆమాటలు కోపంగా అని, ఆమె మళ్ళ నిద్ర పోయినట్టు ఉచ్ఛ్వాస నిశ్వాసాలవల్ల తెలిసేదాకా, కుంచుకొని కూలబడిపోయాడు. ఇద్దరూ ఒకరికొకరు సమీపంలోనే ఉన్నారు. కాని ఎంతో దూరమయిపోయారు కూడా...

'ఏది ఏమైనా, ఆమెతో పరిచయమూ, ప్రేమా,—నన్ను రక్షించటానికి తరణోపాయాలు అవుతాయి. నేను గడుపుతూన్న జీవితం విషయం నీకూ తెలుసును. ఆ విషయం ఎప్పుడూ ఇద్దరమూ కలిసి మాట్లాడుకోకపోయినా, మునుపటి ధోరణిలోనే పడిపోయాననీ, తెగతెంపులు చేసుకోలేక పోయాననీ గ్రహించే ఉన్నావు. కాని నా ఉద్యోగాన్నీ, భవిష్యత్సర్వస్వాన్నీ కూడా నాటినాటికి అధోగతికి కూరుకుపోతేస్తున్న ఈకర్మలానికి బలియిచ్చేయటానికి సంసిద్ధమయ్యా. నన్నువిషయం మాత్రం నీకు తెలిసుండదు. ఇప్పుడు, నాలో తెగతెంపులు చేసుకోగల సామర్థ్యం వచ్చింది. నన్ను నేను ఉద్ధరించుకొనేందుకు ఇన్నాళ్ళు దొరకని ఆసరా ఒకటి ఈనాడు నాకు చిక్కింది. నాలో ఇంకే నీరసంగాని, లోటుగాని, మిగుల్చకో కూడదన్న ప్రయత్నంలో, సర్వస్వతంత్రుడనైతే గాని ఇక ఆ కన్య ఇంటికి వెళ్ళకూడదని నాలో నేను నిశ్చయించుకొన్నాను. రేపే, నేను ఈ బంధంలో నుంచి విముక్తుడ నవబోతున్నాను!"

* * *

మర్నాడు అతను విముక్తుడు కాలేదు. ఆ మర్నాడూ కాలేదు. ఏదో ఒక కారణం కోసం, "నేను వస్తున్నాను" అనగల అవకాశం వచ్చే తరుణపు లాటకోసం వెదుకుతున్నాడు. శాశ్వతంగా విడిచి

వెళ్ళిపోయేందుకు అది ఒక్కటే మార్గం! కాని వచ్చిన తిప్పలు — ఫాన్ని అతి సరళంగా, అతి అనువయంగా, ఆనందాతిరేకంతో, మొదటిరోజులలో కన్నా మంచిగా ప్రవర్తిస్తోంది.

వేరే కారణాలేమీ చెప్పక్కర లేకుండా, తమ సంబంధము తెగిపోయిందని ఫాన్నికి ఉత్తరం రాసిపోతే! కాని ఫానీలాంటి ఉద్రిక్త స్వభావ అంత తేలికగా వదిలి పెడుతుందా? తను ఏ హోటలులో ఉంటే అక్కడికీ, ఆఫీసుకూకూడా, వెంటాడి వస్తుంది. అబ్బే! అల్లా కుదరదు అంతకన్నా ఎదుట బడి, ఆమెకు విప్పి చెప్పి, ఇక తను కాపురం ఇల్లా సాగేందుకు వీలు లేదని సహేతుకంగా నిరూపించి, ఇది తుట్టతుది వీడ్కోలే అని కోపంగాని, జాలిగాని, లేకుండా, తొణకకుండా చెప్పేసేయాలి.

కాని ఆ విషయం ఆలోచించుకొంటూంటే ఆలిస్ డోర్ ఆత్మహత్య జ్ఞప్తికివచ్చి మళ్లీ ఒళ్లు కంపించసాగింది. ఇంటికి ఎదురుగుండానే రైలురోడ్డు కాంపౌండ్ గోడలో మధ్యగా చిన్న గేటొకటి ఉంది. రైలు అర్జంటుగా పోవలసినవాళ్ళు, ఆ గోడలోంచి లోపలికిపోయి రైలుపట్టాలవెంబడే కాలిబాటన స్టేషనుకుపోతూ ఉంటారు. ఆమెతో తెగతెంపులు చేసుకొన్నాడు, ఆ బాటవెంబడే ఫాన్ని రైలు పట్టాలందుకొని లెవల్ క్రాసింగ్ దగ్గిర తను వెళ్తున్న రైలు చక్రాలక్రింద అడ్డంగా పట్టాలమీదికి పడిపోతున్న దృశ్యం అతని కళ్ళముందర ఆడ ప్రారంభించింది. అంతటితో ఆ భయం మనస్సులో పెరిగి పెరిగి, ఎదురుగా ఆ గేటు కనబడటం చాలు, ఎప్పటికప్పుడు ఆమెను వదిలిపెట్టే ప్రయత్నం వాయిదా వేసుకో వలసి వచ్చేది.

ఆమె విషయం కాస్త కనిపెట్టి, ఆ వియోగ దుఃఖసమయంలో ఆమెను కాస్త ఓర్చేందుకు, పనికి వచ్చే, ఆప్తమిత్రుడెవడైనా అతనికున్నా, అతనిపని కాస్త తేలికై ఉండేది. కాని తామిద్దరూ, కేవలం గూడుచేరిన గువ్వపిట్టల్లాగా, లోకంలో ఇతర సంబంధం లేకుండా ఒంటరిగా గడుపుకొంటూ వచ్చారు. ఇప్పుడు ఎవర్నీ ఎరగరు. ఇక హొట్టేమాలు అంటేనో, కేవలం, స్వవిషయ వాంఛలతో సంతృప్తిపడి, ఆ లాలసజీవితంలో మున్కలయిపోయి సీతాకాలం రాకతో ఎప్పిక్క పోలలాగా తలుపులు బిడాయించుకొని బ్రతికే జంతువులు. అల్లాంటివాళ్లు ఆ విపత్సమయంలో ఫాన్నికి ఆసరాగా నిలవగలగటం కల్ల.

కానీ తెగతెంపులు చేసుకోక తప్పదు. అది గూడాత్వరలో చేసుకోవాలి! అంతవరకూ తాను డాక్టరుగారింటికెళ్ళనని మనస్సులో ఎంత శపథం పట్టినా, రెండుమూడు మార్లక్కడికి వెళ్ళివచ్చాడు. ప్రతిమాటు ఆ ప్రేమ మరింత ఇనుమడిస్తోంది. వృద్ధుడు లూచరోకూడా, అతన్ని ప్రత్యేకంగా ఆహ్వానిస్తూ, పైకి చెప్పక పోయినా, సంబంధం నిశ్చయం అయిపోయిందన్నట్లుగా వ్యవహరిస్తూ, కొంత మర్యాదతోనూ, చనువుతోనూ తనను చూస్తున్నాడు. ఇంక అక్కడ పరిస్థితులను అల్లాగే అట్టే ఉంచి కాలయాపనలు చెయ్యటం మర్యాదగా ఉండదు. అది కాకుండా అక్కడికి వెళ్లటానికి ఫానీతో చెప్పాల్సివస్తూన్న అబద్ధాలుకూడా చిరాకు కల్గిస్తున్నాయి. అంతకన్నా, శాఫోలాలస చుంబనాలనుంచి, సరాసరి ఆ అమాయిక కన్నె ముగ్ధప్రేమ కలాపంలో ప్రవేశించటం, ఏదో అపవిత్ర కార్యం చేస్తూన్నట్లుండేది.






# కళాపూర్ణోదయ ప్రశంస

★

శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య

ఎవరు అన్నారో, ఎలా వచ్చిందో మనకైతే తెలియదు. కాని ఒక అపప్రథమాత్రం కళాపూర్ణోదయాన్ని గురించి మొన్న మొన్నటి దాకాకూడా వుండేది. రామకృష్ణుడో, మరి యెవ్వడో కాని

'ఊహించి తెలియరాకుండ సూరపరాజు .

ప్రథమం గళాపూర్ణోదయము రచించె' అని తన చాటుపద్యంలో చాటిన నాటినుండీ కూడా కళాపూర్ణోదయానికి 'తెలియగరాని కబ్బము' అనే యీ అపప్రథ వున్నది.

ఈ అపప్రథ రావటానికి ప్రధాన కారణం యిందులోని యితివృత్తం అంటే తప్పులేదు. ప్రబంధ కవుల ప్రబంధధోరణికీ, ప్రబంధ కథానిర్మాణానికీ అలవాటుపడ్డ తెలుగు పాఠకలోకానికి పాతపుంత విడిచి కొత్తపుంత తొక్కిన సూరన్న కథానిర్మాణ వైచిత్రి అర్థం కాకపోవటం అబ్బురం యేమీ కాదు. ముందు వెనుకలుగా, కార్య కారణపద్ధతిని అద్భుతంగా, అనితరసాధారణంగా రచింపబడిన యిటువంటి కథాకల్పనానికి వారు అలవాటు పడలేదు. అందుచేతనే వారికి ఇది అర్థంకాని గ్రంథమైంది. అందుకే యీ అపప్రథ!

అయితే యే యితివృత్తమయితే యీ అపప్రథకు కారణమైందో ఆ యితివృత్తమే నేడు సూరన్నకు కవిలోక పట్టాభిషేకం కట్టబెడుతున్నది! సూరన్న కళాపూర్ణోదయంలోని యితివృత్తంగురించి ప్రస్తావించేటప్పుడు అందులోని యితివృత్తమూ, ఆ యితివృత్తాన్ని ప్రదర్శించడంలో అతడు అవలంబించిన పద్ధతీ యీ రెండూకూడా ప్రధానములే అవుతవి.

తెలుగులో కళాపూర్ణోదయానికి పూర్వం వెలసిన కావ్యాలలోని యితివృత్తం ప్రాయికంగా ప్రఖ్యాతం. నాటకాలలోలాగే కావ్యాలలోకూడా ప్రతిపాదింపబడేవస్తువు ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రము అని మూడువిధాలు. తెలుగులో సూరన్నకు ముందటి కవీశ్వరులందరూ కూడా ప్రఖ్యాతమైన యితివృత్తాన్ని తీసుకొని కావ్యాలూ, ప్రబంధాలూ రచించినవారేతప్ప వారిలో యెవ్వరూకూడా స్వకపోలకల్పితమైన 'ఉత్పాద్య' యితివృత్తంతో కావ్యం రాయాలని పూనుకోలేదు. ఆంధ్రమహాభారతం మొదలయిన కొన్ని ఆద్యగ్రంథాలు సంస్కృతేతిహాసాలకు అనువాదాలు. మనుచరిత్ర, వసుచరిత్ర మొదలయిన ప్రబంధాలలోని యితివృత్తాలుకూడా నవీనమైనవి కావు. ప్రాచీనగ్రంథాలలోనుండి తీసుకున్నవే. అందుచేతనే కళాపూర్ణోదయం ఆంధ్రసాహిత్యలోకంలో అపూర్వసృష్టి! అంతకుముందిట్టిది లేదు. తనంతటవిది ఒక క్రొత్తరకము! సంస్కృతభాషలోని కాదంబరి యిలాంటిదే కాని అది దీనికి మాతృక కాదు. దానికీ దీనికీ యేమీ సంబంధం లేదు. కాకపోతే సూరన్న కాదంబరిచూచే కళాపూర్ణోదయంలోని యితివృత్తంవంటి యితివృత్తంతో కావ్యం రాయాలని అనుకుని వుంటే అనుకొని వుండొచ్చు. అధికంగా కాదంబరి కళాపూర్ణోదయ రచనకు ప్రోత్సాహకారి అయితే అయివుండవచ్చు. మహాకవి భవభూతికి మల్లేనే యితడుకూడా వస్తుభేదాల్లో ఒక్కొక్కదానికి ఒక్కొక్కటిచొప్పున కావ్యాలు రచించినట్లు కనబడుతుంది. ప్రఖ్యాతేతివృత్తంతో రాఘవ పాండవీయమూ, ఉత్పాద్యేతివృత్తంతో కళాపూర్ణోదయమూ, మిశ్రేతివృత్తంతో ప్రభావతీ ప్రద్యుమ్నమూను. అందులో ఉత్పాద్యేతివృత్తంతో రచింపబడ్డ యీ కళాపూర్ణోదయం సూరన్న అద్భుతకళాసృష్టి!

ఇతివృత్తగ్రహణంలో క్రొత్తదనం చూపి పాతపుంతను పరిహరించిన సూరన్న ఆ యితివృత్తాన్ని ప్రదర్శించడంలోనూ ఒక క్రొత్త పద్ధతిని అవలంబించినాడు. ఆ పద్ధతి నవీనము. అది కార్యకారణ క్రమము.

కార్యకారణక్రమంలో కథను వర్ణిల్లజేసిన వారు ప్రాచీనాంధ్రకవులలో సూరన్న తప్ప యింకెవ్వరూ లేరు. ఈ మార్గసంచారమునకు మొదలిడినవాడే యితడు.

కథను వివరించేపద్ధతులు రెండు. ఒకటి కాల క్రమము. రెండవది కార్యకారణక్రమము. కథా విషయములను కాలక్రమానుసారంగా ముందు

జరిగినది ముందు, తరవాత జరిగినది తరవాతగా చెప్పడం మొదటి పద్ధతి. కాలక్రమాన్ని వదిలిపెట్టి కథామధ్యంలోని యేదైనా రసవత్తరమైనఘట్టంతో కావ్యం ప్రారంభించి వెనుక ముందరగా కథను పెంచి పూర్తి చేయడం రెండవ పద్ధతి. భారతం, రామాయణం మొదలైన గ్రంథాలు కాలక్రమానుసారంగా వ్రాయబడినవి. ఈ గ్రంథాలలో ఆయా నాయకుల వంశాభివర్ణనమూ, వారి జన్మమూ, వయసు పెరుగగా పెరుగగా సంభవించిన కష్టనష్టములూ యిత్యాదులు కాలోపగతమైన వరుస మేరకు చూపబడివుండడం చేత అవి కాలక్రమపద్ధతిని అనుసరించినవని చెప్పవచ్చును. కళాపూర్ణోదయంలో యీపద్ధతి కాక కార్యకారణక్రమము చే రెండవపద్ధతి అవలంబింపబడినది. శాస్త్రములందు విషయనివేదనమువందు వైశద్యం ప్రధానం కాబట్టి అట్టి శాస్త్రగ్రంథాలవిషయంలో కాలక్రమపద్ధతిని అనుసరించడమే మంచిది. కావ్యాలలో తిత్త్వగా, వైశద్యమూ కాదు ప్రధానమయినది. రసము ప్రధానము. రససిద్ధికి రెండవదైన కార్యకారణక్రమమే చాలా ఉపకరిస్తుంది. ఇతివృత్తం తీర్చడంలో యీ కార్యకారణక్రమాన్ని అవలంబించి సూరన్న అద్భుతమైన ఫలితాలను పొందగలిగినాడు. ఆశ్చర్యకరమయిన సంవిధానం కూర్చినాడు. మూడుజన్మలకు సంబంధించిన యితివృత్తంతో పాఠకులకు యేమాత్రమూ విసుగు అన్నది కలగకుండా కథాంత్యభాగంతో గ్రంథరచనం ఆరంభించి, మధ్యభాగపు కథను ముందు వెనుకలుగా చేసి, మొదటిభాగాన్ని కడపటచేర్చి ప్రధాన కథతో అత్యంతం సంబంధంవున్నా ఎక్కడికక్కడ తెలియకుండా వుండేటట్లు అవాంతరకథలు కల్పించి, కార్యములు ముందు చూపి కారణాలు తరవాతి చూపి— అద్భుతమయిన కథాకల్పనంతో కావ్యనిర్మాణం చేశాడు సూరన్న!

కాలక్రమాన్ని బట్టి చూస్తే కళాపూర్ణోదయం పంచమాశ్వాసంలోని సరస్వతీ చతుర్ముఖుల లీలాకేళికథలో తొలుత జరగిన సంభవం. సూరన్న కాక మరే యితరసామాన్య కవి అయినా యిదే కథతో కావ్యం రచించి వుంటే పంచమాశ్వాసంలోని సరస్వతీ చతుర్ముఖుల లీలాకేళితో గ్రంథారంభం చేసి వుండేవాడు. సూరన్న అలా కాక ప్రధాన కథామధ్యగతమైన కలభాషిణి డోలావిహారంతో గ్రంథారంభం చేసినాడు. సూరన్న కవితలో యిలాగు గ్రంథారంభం వేఱు – కథాప్రారంభం వేఱుగా – ఒకదానికొకటి సుదూరంగా–వుండినా అల్లిక యేమాత్రమూ కూడా చెదరకుండా యితివృత్తం లసువు బిగువులతో తీగ సాగినట్టుగా సాగడం చిత్రాలలోకల్లా చిత్రం! కథ చదవడానికి ఉపక్రమించిన పాఠకుడు పూర్తిగా కథను తెలుసుకోవాలంటే కావ్యంలోని అయిదాశ్వాసాలూ కూడా చదివి తీరవలసిందే! ఇక కథావిషయంలో కుతూహలంమాత్రం పాఠకుడికి ప్రథమాశ్వాసంలోనే కలుగుతుంది.

ఎవరిపని వారిదిగా ప్రవేశించిన కలభాషిణి, నారద మణికంధరులు, రంభా నలకూబరులు అనే అయిదు ప్రధాన పాత్రలకూ కథతో అత్యంత సంబంధం కలిపిన ప్రథమాశ్వాసంలోని డోలావిహారకల్పనం సూరన్న ఉపజ్ఞకు ఒక ప్రబలనిదర్శనం! ప్రధాన కథాబీజములు ఎన్నో యిందులో గూఢంగా నాటబడినవి. డోలావిహారానంతరం కలభాషిణి నారదుణ్ణి సందర్శించి అతడితో సంభాషణకు దిగింది. 'ఆ యేఁగినట్టి మహితాత్ములు రంభా నలకూబరులే' అని ప్రశ్నించి, నారదు డామె మనోభావాన్ని గుర్తించినాడు. రంభకు సవతి కాగలవు లెమ్మని యామె నుబ్బించినాడు. పరస్పరము భక్తివాత్సల్యములు వృద్ధినందినవి. నిన్నెక్కడనో చూచినట్లున్నదని ఆమెవల్ల విషయం తెలుసుకుని కలభాషిణీ మణికంధరుల ప్రణయానికి దోహదం కల్పించడంకోసమని మణికంధరుడి దండకాన్ని ఆమెచేత చెప్పించినాడు. కలభాషిణి నారదానుగ్రహానికి పాత్రురాలై అతడి వీణను మోచే అవకాశం పొందింది. రంభా నలకూబరుల సంభాషణంలోని పూర్వోత్తరాలను తెలుసుకోవాలనే కుతూహలం కలభాషిణికి కుత్తుకబంటి అయినది. నారదుడితో ప్రస్తావిద్దామంటే మణికంధరుడున్నాడని వినయభరంతో కొంకి నిలుచుండినది. మణికంధరుడు అది తెలిసి దూరంగా పోయినాడు. నిర్భీకరాలై కలభాషిణి తన హృదయపుటం విప్పి నారదుడిముందు వుంచినది.

'ఏను వృథాభ్రాంతి నింత నంతను దాని
    వెంబడిఁ జని పల్కు వింటి నొకటి
వినఁ డది యద్దేశితనయుఁ డోయబల! యి
    న్నారదుమాటలు నడుమ
పొడమె నేమయ్యె నల 'కళాపూర్ణుసుద్ది'
కడమ చెప్పుమన్న రంభ యప్పుడు తెలుపనె
నీకు మఱి చెప్పరాకుంట నీకథయును
నీకు నాతోడు సుమ్ము బ్బనీకుమనిరా'—

కళాపూర్ణుడి ప్రసంగానికి యిదే మొదలు. రంభ పలికిన యీ పలుకు ఔత్సుక్యాన్ని యెలా ప్రేరేచుతోందో చూడండి. రంభ తన ప్రాణప్రియుడికికూడా చెప్పకూడని ఆకథ యెలాంటిది? ఆమె తన ప్రియుడే అడిగినాకూడా చెప్పకుండా మానం

ధరించడానికి కారణం యేమి అని మనం అనుకునేటంతలో కలభాషిణి నారదుణ్ణి అడుగుతుంది. ఆ పలుకులు ఆమెవే కావు. మనవి కూడా. నారదుడు 'ఇది యంతయు నపూర్వంబు నాకునుం జెప్పరాదు' అనే సరికి మన ఉత్కంఠ అధికమై ఆపరానిదవుతుంది. రంభా నలకూబరులకు ఈ అపూర్వ వృత్తాంతాన్ని గూర్చి జరిగిన ప్రసంగాన్ని వివరిస్తూ రంభ నలకూబరుడితో యిలా అన్నదని—

సీ. ......ఓ పౌరుషాభరణ! తత్కథలు వ
 చ్చిన నేమి యంటేని వినుము తెలియ
నాకథ లీకేఁ జెప్పినట్టివారును విని
 నట్టివారును ధాత్రియందుఁ బుత్ర
పౌత్ర ప్రపౌత్రాది బహుసంతతియుఁ దన
 ర్చుచుఁ జిరకాలంబు ప్రచుర సంప
దభివృద్ధిశోభిత శుభ సౌఖ్యములఁ గాంతు
 రనుమాట యున్నది యాదియందె
యేను నీ కది చెప్పిన దీనికొఱకు
నవనిఁ బుట్టంగవలయునో యని వెఱచెదఁ
బ్రాణవల్లభ! యవి తలకొంగసంగ
సౌఖ్యమునఁ జేర్చువాడు నిష్టంబులగునె.
గీ. అదియు వింటివి గద యని యనియెదని
యేను వినినట్టి పిమ్మట నిట్టిమాటఁ
బలికె నొక్క యమోఘవాగ్విలసనుండు

గావున వచింప విన నీకేఁ గాదు నాకు" అని చెప్పినాడు. దీనితో మన యుత్కంఠ యింకా అధికమవుతుంది. ఉత్కంఠతోడు అద్భుతంకూడా మనలను ఆవరిస్తుంది. సాధారణంగా మన కావ్యాలలో కట్టకడపట యేదో సంప్రదాయం పాటించడం కోసమని చేర్చబడే ఫలశ్రుతినికూడా కథలో ప్రధానాంగంగా సూరన్న చిత్రించినాడని మనం ముక్కుమీద వేలు వేసుకుంటాం. ఒక కొందఱికి మేలుగా, మఱికొందఱికి కీడుగా అవతరించే యీ కథాపూర్వోదంతం భూలోకంలో వెలయడం ఎలాగని మనకు సందేహం కలగక పోదు. దేవలోకంలో పుట్టిన యీకథ దేవతలు తెలపకుండా మన కెలా తెలుస్తుంది? భూలోకంలో పుట్టవలసివస్తుందని తెలిసి తెలిసి ఆ కథ తెలిసినవారుమాత్రం ఎలా దాన్ని బహిరంగపరుస్తారు? అయితే యీకథ భూలోకంలో, వెలయడం ఎలాగ? ఇవన్నీ మన సందేహాలు. నారదుడు

'అతివ! విను రంభకును గల యట్టిభయము
నాకుఁ గల్గుటఁ దత్కథ నీకుఁ జెప్పఁ
గూడ దట్లయ్యు నిక్కలి కువలయమున
వెలయఁగల దది వెలయు ప్రోవలును గలుగు'

అంటున్నాడు. ఆ వెలయుప్రోవ లేవి అని తెలుసుకోవడానికి మనం గ్రంథం పొంతిం చదవవలసిందే. పాఠకులను తన కథతో కూడా లాగుకొనిపోతున్నాడు సూరన్న. ఈ గుణం ఒక్క సూరన్న కవిత్వంలో తప్ప మఱే మన కెక్కడా కనిపించదు.

ద్వారకలో యీ ఘట్టంలోని నారదుడిమాటలన్నీ తత్కాలోచితాలు గానూ, సహజంగానూ పయికి ప్రతిభాసిస్తున్నా అవి అన్నీ కూడా ముందు కథ సాగడానికి మూలప్రాయాలుగా వుండి మణికంధరుడి తపోవనంలోని రంభా ప్రతిరంభల జగడానికీ, నలకూబర ప్రతినలకూబరుల జగడానికీ బీజభూతాలయినవి. కాని యిది యిలా జరగాలనే సంకల్పంతో నారదు డామాట లన్నట్టుగా పాఠకుడు కానీ, ఈ వుద్దేశంతో నారదు డీమాట లంటున్నాడని అతడితో వుండే యితరపాత్రలు గానీ ముందు అనుకోవడానికి అవకాశమే లేనట్టుగా, మెలచి నట్టుగా కథ సాగింది.

ప్రధానకథనుమాత్రమే కాదు. ప్రధానకథకు అంగభూతాలయిన చిల్లరవిషయాలనుగూడ సూరన్న కాలక్రమానుసారంగా చెప్పడు. రంభా నలకూబరులాడుకొన్న కళాపూర్ణుడి ప్రసంగం తొలుత వారిగువురి సంభాషణలో కాక అటుతరవాత నడచిన కలభాషిణీ నారద సంభాషణంలో తెలియవస్తుంది. నారదుడు గానవిద్యాభ్యాసంకోసమని ద్వారకకు రాకపోకలు చేస్తుండినట్లుగా మనకు ప్రథమ ద్వితీయాశ్వాసాల్లో నివేదింపబడ్డది. అయితే దీనికి కారణం తరవాత యెప్పుడో కలభాషిణీ మణిస్తంభుల సంభాషణలో తెలుపబడింది. ఆ సందర్భంలో మణిస్తంభుడు నారదుడే మణికంధరుడితో తెలిపినట్లుగా గానమాత్సర్యకథను వివరించి కలభాషిణికి తెలుపుతాడు. అప్పుడుగాని మనకు తెలియదు నారదుడి సంగీతాభ్యాసానికి ప్రధానమయిన హేతువు. మణికంధరుడి తపోవనంలో జరిగిన రంభా ప్రతిరంభల జగడాన్ని, నలకూబర ప్రతి నలకూబరుల జగడాన్ని కూడా సూరన్న కాలక్రమానుసారంగా అభివర్ణించలేదు. కథను తానై చెప్పక పాత్రములనోటితోనే చెప్పిస్తూ కావ్యం అల్లడంలోనే వున్నది సూరన్న కల్పనా ప్రతిభ! నలకూబరుడు తన కత్తి యెక్కడైనా పెట్టి మరుస్తాడేమో తీసుకుందామని రంభా నలకూబరుల వెంటనే చాటుగాపోయి అక్కడ జరిగిన విషయం సర్వమూ కూడా సాక్షాత్తూ చూచి వచ్చిన మణిస్తంభుడు మృగేంద్రవాహనాలయం చేరుకుని అక్కడికే యెవరికి వారుగా చేరుకున్న కలభాషిణీ మణికంధరులకూ, అక్కడే దేవీవరప్రసాదంవల్ల యౌవనప్రాప్తి పొందిన సుముఖాసత్తికీ తాను చూచిన

విషయం అంతా పూస గుచ్చినట్టు తెలుపుతాడు. కలభాషిణి వెంటనే అందుకుని తన కడగండ్లు చెప్పుకుని తనతో మొదట వుండిన ఆ కపటనలకూబరుడు యెవడో అంటుంది. అక్కడే వున్న మణికంధరుడు 'ఆ కపటనలకూబరుణ్ణి నేనే' అని తన కథ తెలుపుతాడు. ఇలా యెవరికి వారు చెప్పుకొన్నట్లుగా నే కథను నడిపించినాడు. తానేమీ చెప్పక పాత్రల నోటితోనే కథంతా చెప్పించినాడు సూరన్న. సుగాత్రీ శాలీనుల కథకూడా యిలాంటిదే.

మృగేంద్రవాహనాలయంలో కలభాషిణి నలకూబరుడిమీది తనముక్క బయటపడిందనీ, యిప్పుడు మణికంధరుడిపై తొలుతనుండీకూడా ప్రేమ వుండేదని చెప్పినా భోగముదానిమాటలని యెవ్వరూ నమ్మరనీ చెప్పి విచారంతో మొగం వాల్చేటప్పటికి మణికంధరుడు కరిగిపోయి ఆమె విచారాన్ని పోగొట్టడంకోసమని — నలకూబరుడి రూపం చూచిన నీకంటికి యింకోరూపంకూడా నచ్చకపోవడం ఆశ్చర్యం కాదని అందుకు దృష్టాంతంగా వేదపురుడిదగ్గర అతడిశిష్యుడు చదివి వినిపించగా తాను విన్న సుగాత్రీశాలీనులకథను చెప్పి పూరించడానికి ప్రయత్నిస్తాడు. ప్రాసంగికంగా వచ్చిన యీ సుగాత్రీశాలీనులకథ అక్కడే వుండి మణికంధరుడు చెబుతుండగా వింటున్న సుముఖాసత్తి మణిస్తంభులదే కథ వింటూ సుముఖాసత్తి, మణిస్తంభు లిద్దరూకూడా అది తమకు సంబంధించినకథే అని ఒక్కొక్కరూ తమతమ మనస్సుల్లో అనుకున్నా ఒకరినొకరు గుర్తించుకోలేక యెదుట వున్న సుముఖాసత్తి తనభార్య అయిన సుగాత్రి అని మణిస్తంభుడు కానీ, మణిస్తంభుడు తన మగడైన శాలీనుడని సుముఖాసత్తి కానీ భావించలేకపోయినారు. ఇక్కడ యీ ఘట్టంలో సూరన్న చూపిన ప్రతిభ అపూర్వం. ఇద్దరూ తమతమ విషయాలు చెప్పుకున్నతరవాత మణిస్తంభుడే తనభర్త అయిన శాలీనుడని ఋజువు చేసుకోవడానికని సుముఖాసత్తి ముందుగా తాను తన విషయం చెబితే దూరశ్రవణశక్తివల్ల మణిస్తంభు డది విని ఆదేవిషయం చెబితే అందులో ప్రయోజనం లేదని అంచేత మణిస్తంభుడే ముందుగా మణికంధరుడితో అతడివిషయం చెప్పేట్టు, ఆ తరవాత ప్రత్యేకంగా మణికంధరుడితో తానా విషయం చెప్పేట్టు యేర్పాటు చేసుకుని, అవి రెండూ ఒకటే అయితే అతడే తన భర్త అని ఒప్పుకుంటానంటుంది. సుముఖాసత్తి, మణిస్తంభుల అవస్థాంతరానికి చెంది, జరుగుతున్న కథకు చాలాకాలం పూర్వం జరగిన సుగాత్రీశాలీనులకథను తెలపడంలో కూడా సూరన్న కాలక్రమరచనాపద్ధతిని అనుసరించలేదు. మరి కార్యకారణపద్ధతిని అనుసరించి మణికంధరుడినోట ఆ కథను కలభాషిణి విచారం పోగొట్టడంకోసమని చెప్పించినాడు.

కళాపూర్ణోదయంలోని యితివృత్తకల్పనలో మనకు కనిపించే కళాగుణవిశేషాలు ప్రధానంగా మూడు. ఒకటి కార్యకారణపద్ధతి. రెండవది నాటకాలకు మల్లే సంభాషణాదులచేతనే కథావృత్తాన్ని ప్రకటించడం. మూడవదీ యెట్టి సంబంధమూ, యెట్టి సామీప్యమూ లేని దేశకాలపాత్రలకు సాధారణ కవుల కందరాని ఆంతరసంబంధం కల్పించి దేవ మానవ దానవ తిర్యగాది నానావిధపాత్రములతో చిన్నచిన్నకథలల్లి ఆ కథలన్నీకూడా ప్రధానకథకు అంగభూతాలుగా వుండేటట్లు అతుకు కలపటం. ఈ లక్షణాన్నే ఐక్యగుణం అని అనవచ్చు. మన ప్రబంధాలు సాధారణంగా కొలుకులు ఒకదానివెంట యింకొకటి అతికించటంచేత యేర్పడిన గొలుసులలాంటివి. వాటిలో ఐక్యం అనే గుణం మందుకైనా కనిపించదు. ఆయా ప్రబంధాలలో యేవైనా మనకు తోచిన వర్ణనలనూ, విషయాలనూ తీసేయవచ్చు. కొత్తవాటి నెక్కడైనా కొత్తగా చేర్చనూవచ్చు. అలా తీసెయ్యడంవల్లగాని, చేర్చడంవల్లగాని మన ప్రాచీన ప్రబంధాలలోని కథాగమనానికి యేవిధమయిన అడ్డూ రాదు. ఇదే ఐక్యం అనే లక్షణం లేకపోవడానికి గురుతు. ఇక కళాపూర్ణోదయంలో అంతామా అందులో యేదీ అనవసరం కాదు. ఏ భాగానికా భాగం, ఏవర్ణన కావర్ణన, ఏమాట కామాట కథానిర్వహణానికి అత్యంతోపకారిగా వుండి అది తీసేస్తే కొంప మునిగిపొయ్యేట్టుగా వుంటుంది. ఏదైనా విషయాన్ని తీసెయ్యడం యెంత అసాధ్యమో, ఆ కథలో కొత్తవిషయం యేదైనా చేర్చడంకూడా అంతే కష్టం. వర్ణనపద్యాల్లో యేదైనా చేరిస్తే చేర్చవచ్చుతప్ప ప్రధానకథలో కాని, ప్రధాన కథకూ అవాంతరకథలకూ అతుకు కలుపుతున్నఘట్టాలలో కాని యెటువంటి మార్పు చేయడానికి వీలులేకుండా తన యితివృత్తం యెలాంటి చేర్పు మార్పులకు లోనుకాకుండా అఖండంగా, అద్వితీయంగా వుండేటట్లు తీర్చి దిద్దినాడు సూరన్న. సూరన్న కళాప్రతిభకు అతని యీ యితివృత్తకల్పనం ఒక మహోదాహృతి. అనితరసాధ్యమైన కల్పనకు సూరన్న పెట్టినది పేరు. అతని కావ్యం కళామూర్తికి ఒక మధుర నీరాజనం!

# ప్రాచీన భారతములో పట్టుపరిశ్రమ



శ్రీ బి. ఎన్. శర్మ

పట్టుపరిశ్రమ పుట్టుక 'పరిశోధనా' నంతరము కూపర్ తన 'పట్టు—ఉత్పత్తి—పరిశ్రమ' యనే. గ్రంథములో యీ విధముగ నిర్ణయించుచున్నాడు :—

(1) పట్టు పురుగులకు చీనా దేశము మాతృస్థానము. ఆ దేశ నామములు—చీనా, సిరిస్, త్సిన్, సినాం, సెరిపా మొదలగు—సహితము 'పట్టుదేశము' నే సూచించుచున్నవి.

(2) క్రీస్తుకు 2600 సంవత్సరముల పూర్వము దేశమును పాలించిన హ్వాంగ్ చక్రవర్తి భార్య పట్టు పురుగుల పెంపుదల, పట్టు నేతను దేశమునందు ప్రవేశపెట్టెను.

(3) సుమారు 3000 ల సంవత్సరముల వరకు పట్టుపరిశ్రమల రహస్యమును చాకచక్యము కలిగిన చీనా ప్రజలు గోప్యముగ నుంచుచు వచ్చిరి. క్రీస్తు తర్వాత 300 ల సంవత్సరములకే రహస్యము జపాను, భారత దేశములకు విదితమయ్యెను.

భారత దేశమునం దీ పరిశ్రమ ప్రవేశమును దీర్ఘముగ చర్చించుచు కూపర్ తన గ్రంథపీఠికలో విదిత పరచిన విషయములు గమనార్హములు.

'......సుమారా సమయముననే (జపానులో మాదిరి) అనగా క్రీ. 300 సంవత్సర కాలమున నొక భారతీయ రాకుమారిత చీనా దేశము సందర్శించెను; లేదా చీనా రాకుమారిత యొక భారతీయ రాకుమారుని నుద్వాహమాడియుండుట నిశ్చయము. ఆ సందర్భముననే పట్టుపురుగుల గ్రుడ్లామె తన శిరోవేష్టనమునందు దాచి భారతదేశమునకు గొనిపోయెను. ఆమె యీ పురుగుల పెంపుదల వివరములను భారతీయుల కెరింగించెను. పట్టుపరిశ్రమ, నేతయం దసమాన ప్రఖ్యాతి గడించిన చీనా మాదిరి వస్త్రపరిశ్రమ యందద్వితీయముగా వినుతి కెక్కిన భారతదేశమునందీ పట్టు పరిశ్రమ పోటీగా పరిణమించ ప్రారంభించెను...'

ఇది కూపర్ నిర్ణయము. క్రీస్తునాల్గవ శతాబ్దమునందు పట్టుపరిశ్రమ భారతదేశములో ప్రారంభమైనటుల నాతని యభిమతము. ఇంతే గాదు; 'యీ పరిశ్రమ భారత దేశమున కపరిచితము; చీనా రాకుమారితవలన భారతీయులకిది విదితము'ను నిర్వచనము నాశ్చర్యకరము.

భారత దేశమున కీ పట్టు పరిశ్రమ పరిచయము మరి రెండు శతాబ్దాలా నంతరము జరిగినటుల వేరొక పరిశోధన వేత్త నిర్ణయము. ఎం. అల్ఫ్రెసెట్ అభిమతానుసారము చీనా దేశీయులు పట్టుపరిశ్రమ రహస్యమును నతిజాగ్రతతో క్రీస్తు 5 వ శతాబ్దమువరకు గోప్యముగ నుంచిరి.

క్రీ. శ 419 సంవత్సరమున నొక చీనారా కూతురు ఖోటన్ రాజును పెండ్లాడెను. ప్రాణాపాయస్థితియందామె తనయత్తవారింటికేగుచు తనతో కొన్ని పట్టుపురుగు గ్రుడ్లు, కొన్ని (*Mulbary*) విత్తనముల వెంటనిడుకొని యీ దేశీయులకు పట్టుపురుగుల పెంపుదల, వాని నేత సవిస్తరముగ నేర్పెను. ఈరాకుమారిత త్రవ్వించిన 370 వ శిలాశాసనాను సారమామె బౌద్ధమత మవలంబించినటుల స్పష్టమగుచున్నది.

'పట్టుపురుగుల హత్య నిషేధించుచున్నాను. పురుగులన్నీ వెడలిన పిదప (*Cocoons*) ను విప్ప వలయును. దీని నుల్లంఘించిన వారు దైవసహాయము నుండి వంచితులగుదురు......'

ఆ తర్వాత కొన్ని సంవత్సరములకు అనగా క్రీ. శ 462 లో పట్టు పరిశ్రమ క్రమముగ జపాను దేశమునందు ప్రవేశపెట్టబడెను. ఆ దేశమునందు సహితము (*Transmission*) విధానమే యనుకరింపబడెను. ఖోటన్ నుండియే యీ పరిశ్రమ పర్షియా, భారతదేశములకు ప్రసరితమయ్యెను.

ఈ నాడఖిల ప్రపంచమునం దాధార గ్రంథ రాజముగ గణింపబడుచున్న ఎన్సైక్లోపీడియా

బ్రిటానికాలో సహితము చీనాలోని పట్టుపరిశ్రమ చరిత్రనుసరించి కూపర్ యభిమతములనే నిదమిద్ధముగ నుల్లేఖించుచు యీపరిశ్రమ జపాను, భారతదేశము లలో క్రీ. శ. 300 సంవత్సర ప్రాంతమునందు ప్రారంభమైనటుల విదితపరచబడియున్నది.

ఈ నిర్దిష్టాధారములపై కొందరు చరిత్రకారులు భారతదేశమునందు పట్టుపురుగుల పెంపకము, పట్టు పరిశ్రమ క్రీ. శ. 300 నుండి 509 వరకు జరిగినటుల స్పష్టపరచిరి.

కాని యీ నిర్వచనములు, నిర్దిష్టోల్లేఖనము లన్నియు సత్యదూరములు. ఎన్‌సైక్లోపీడియా— విజ్ఞాన సర్వస్వము—వంటి గ్రంథరాజమునం దుల్లేఖింపబడకుండిన గమనార్హములు ముమ్మాటికి గాకుండెడివి. భారతదేశమునం దీ పరిశ్రమ యేనాడు ప్రారంభింపబడినది; ఎటుల వృద్ధిగాంచినది గమనించిన నైజము బట్టబైలగుట నిశ్చయము.

(1) సంస్కృత శబ్దములు మహా గంభీరములు; మహార్థ పూరితములు, అవి యన్నియు యౌగికములు. 'కౌశేయ', 'క్షౌమ', 'కౌశిక', 'కౌశాంబర' 'కటమిత్రి' యను యీ రైదుశబ్దముల ధాతువులు పట్టుశబ్ద మూలాధార సూచకములు. (a)

'పట్ట', 'క్షౌమ', 'దుకూల'(b) శబ్దములు పట్టు సూచకములుగ ప్రయోగింపబడినవి. కాని యీ శబ్దములు తరుచుగ లినన్ లేక *Eric* పట్టు సూచించుట సహజము.

కాని కాళిదాసుని 'రఘువంశము'—10-8— పరాశర సూత్రములం—7-30—దుపయోగింపబడిన క్షౌమ శబ్దములు పట్టునే సూచించుచున్నవి గాని లినన్‌ను మాత్రము గాదనుట నిశ్చయము. పట్టులో 'క్షౌమ', 'దుకూల' యనునవి రెండువిధములని 'అమరకోశము'నందు విస్పష్టపరచబడియున్నవి.

---

(a) 'కౌశేయం కృమిజం సువర్ణ ముపలాద్ దూర్వాపి గోరోమతః'—పంచతంత్రం 1-54

'కౌశేయం కృమికోశోద్భవమ్'—అమరము.

(b) క్షుమాయాః—వికార ఇతి క్షౌమం

—క్షీరస్వామి అమరవ్యాఖ్యానము.

'దుకూల' దుష్టం (చేష్ట) కూలతి (కప్పేది)

'దు' (వెచ్చచేయుట) + ఉలచ్ + కుఙ్ = దుకూల (చేయబడిన పట్టు లేక పట్టువస్త్రము)

—ఆప్టే నిఘంటువు.

(2) 'కోశకార', 'పట్టకీటమ్', 'తంతుకీటమ్' 'తంతుక్రిమి', 'కోశస్థ' మొదలగు శబ్దము లన్నియు పట్టుపురుగు నామవాచకములు. ఇవియన్నియు యౌగికములు— *Descriptive* —'పట్టు నుత్పత్తిచేయు పురుగులు' వీని యర్థము.

(3) 'కోశకార', 'కోశస్థ' యను శబ్దములందు వ్యత్యాసము గలదనుట సంస్కృతభాషాభిజ్ఞులకు విదితము. మొదటి శబ్దమున కర్థము *Chrysalis* అనగా ప్రారంభస్థితి; రెండవదాని భావము పరిపూర్ణాభివృద్ధి స్థితిలోని కీటకము.

పట్టు, పట్టుపురుగు, పట్టుపరిశ్రమ సూచించు శబ్దములు యూరపీయ భాషలవానికన్న సంస్కృతి భాషాపదములు మహోన్నతములను రహస్యము గమనార్హముగ నుండు టత్యవసరము.

'సిల్క్', 'సెరీకల్చర్', 'సెరికాన్', 'సెరికం' మొదలగు పట్టు సూచక యూరపీయ శబ్దములకు, గ్రీకులు చీనాదేశీయుల కేర్పరచిన 'సిలిసే' శబ్దమే మూలాధారము. కాని భారతదేశమునందు 'పట్టు', 'పట్టుపురుగు', 'పట్టుపరిశ్రమ'కుగల పదములన్నియు విశుద్ధ సంస్కృతి శబ్దములు; చీనాభాష పదముల యపభ్రంశములు ముమ్మాటికి గాజాలవు.

కాబట్టి యీ పట్టుపరిశ్రమ భారతదేశమునం దనాదినుండి వృద్ధిచెందుచున్నదనుట, చీనా, భారత దేశములందు దీని వ్యవసాయము స్వతంత్రముగ సాగుచుండెనని పై ఆధారములే విదితపరచుట లేదా?

క్రీ. పూ. 5వ శతాబ్దమునం దంటకట్టబడిన మను, యాజ్ఞవల్క్య స్మృతులందు, విష్ణు, గౌతమ ధర్మసూత్రములందు మతిక పట్టువస్త్రముల పరిశుభ్ర నియమములు, వాని విక్రయ స్వత్వముల వివరములు సంపూర్తిగా గలవు. వీనివలన భారతదేశములో పట్టు పరిశ్ర మనాదినుండి సర్వసామాన్యముగ ప్రచారము నందుండుటచేతనే క్రీ. పూ. 500 నుండి క్రీ. శ. 400 సంవత్సరముల కాలములో అనగా సుమారు 1000 సంవత్సరముల వ్యవధిలో అర డజను స్మృతి కారులు, ధర్మశాస్త్రప్రవీణులీ పట్టువస్త్రముల పరిశుభ్రత, విక్రయముగురించి వివిధ నిబంధన లేర్పరచి నటుల విస్పష్టమగుచున్నది.

1. పట్టుపురుగుల దారమునుండి సిద్ధపరచబడు వస్త్రములు, ఉన్నీ వస్త్రములు వాడుట కుపయోగార్హము లౌటకు గాను వానిని క్షారములనుండి శుభ్ర పరచవలయునని మనువు నిర్ణయము గలదు.

—మనుస్మృతి 5-120

2. వెదురునార, ఫ్లాక్సు, గోను, నారము లేక పట్టు—క్షౌమ-వస్త్రములు కేవలము నీటిలో ముంచుటచే పరిశుభ్రమగునని పరాశరుడు—7-30-తన స్మృతి వలన విదితపరచెను.

3. ఈ నియమమును విష్ణువు తన సూత్రము—23-17-19—లో బలపరచెను.

4. బ్రాహ్మణులు, క్షత్రియులు అన్యజంతు పదార్థములతో బాటు పట్టువస్త్రముల విక్రయించవలదని నిషేధించెను. —3-85-39

5. వశిష్ఠుని నిషేధసూత్రము నిర్దిష్టముగ గలదు. వర్తక, వ్యాపారములతో జీవితముల గడుపు బ్రాహ్మణులు, క్షత్రియులు రాళ్ళను, లవణమును, కౌశేయములను—పట్టుబట్టలు—, క్షౌమములను—లినన్ అనగ నారపట్టుబట్ట—చర్మములను, అద్దుడు బట్టలను, భోజ్యాహారము మొదలగువానిని విక్రయించ వీల్లేదని నిర్ణయించెను—2—29. ఈతడు గౌతముని కన్న రొంత యెడుగుముందిడెను. చూడుడు :

...షాణ, క్షౌమ చీరకృతపాం సర్వేషాం
కార్పా సంచా విక్రృతమ్' —1-7

'తిసాన్యోపణాయం గన్ధరస కృతాన్న తిలషాణ
క్షౌమాజినాని' —7-2

భారతదేశములో పట్టు పరిశ్రమ యతి ప్రాచీనమనుటకు పై నిర్దిష్టములే ప్రబలాధారములు. సూత్రకారుడగు గౌతముని కాలముగూర్చి బుహులర్ యిటుల నిర్ణయించెను :—

'—ఈనాడు దృగ్గోచరమగుచున్న పవిత్రవంతమగు న్యాయశాస్త్రములలో గౌతమధర్మశాస్త్రమతి ప్రాచీనమనుట కీవిషయములే, యీ సత్యములే ప్రబలనిదర్శనములు' —భూమిక 59

ఇంత సంకుచితమైన యంచనానుబట్టి కూడ గౌతముని సూత్రముల నిర్ణయకాలము క్రీస్తుకు పూర్వము 9 వ శతాబ్దమని తేలుచున్నది. వ్యాసుని కాలమునందు సహితము పట్టువస్త్రములు వైవాహిక కార్యములందు తిరుచుగ వాడబడుచుండినటుల నాతని స్మృతి దెలుపుచున్నది. ఆ స్మృతియందలి రెండవ అధ్యాయపు 4 వ శ్లోకమునందొక వధువుపట్టు వస్త్ర భూషితయైనటుల వర్ణితమై యున్నది. ఈ అధ్యాయమందలి 44 వ శ్లోకము ముఖ్యముగ గమనించదగినది.

భారతదేశమున కనాదినుండి పట్టుపరిశ్రమ సుపరిచితమనుట నిశ్చయము. అవసరమగు పట్టు చీనాదేశమునుండి దిగుమతియైయుండుట సంభవమనిపించుకో వీలులేదు. ఈ దేశమునందు ప్రజలు సహజముగ ప్రతినిత్యము, పండుగ పబ్బములందు ముఖ్యముగ పట్టుబట్టలవాడు చుండిరనుట కనేక ప్రబల నిదర్శనములు గలవు.

దేశమునందిటుల వత్యవసరముగ నుండిన పట్టుబట్ట, రాకపోకల సాధనములు ప్రమాదపూరితములై, అయాసకరములుగ నుండిన ఆకాలమునందింత విశాల దేశమునకు చీనానుండియే దిగుమతియగు చుండెనను కొనుట సబబనిపించుకో జాలదు.

చీనా ముతకపట్టు, పట్టుపోగు, పట్టుబట్ట బాక్ట్రియా ద్వారా బారిగజా—బ్రోచ్—వరకు కాలి నడకతో తేబడవలసియుండెను. గంగానది ద్వారా యివి అమెరికాకు ఎగుమతి చేయబడెడివి. ఈవిధమున అతిప్రయాసముతో బహుదూరములో దించబడు సరకు స్వల్పముగను, చాలా విలువపై విక్రయింపబడుట సహజము. తిరుచుగ పట్టుబట్టల వాడు జన సామాన్యమింత వెలగల సరకును కొనలసినంత కొనకుండుట సహితము సహజమే.

ముతకపట్టు, పట్టుబట్టలు భారతదేశమునకు చీనానుండి చాలా ప్రాచీనకాలమునుండి తేబడుట వాస్తవమైనను వానిని శ్రీమంతులు మాత్రమే వాడుచుండెడివారనుట నిస్సందేహము. ఈ సరకులో కొంత, పెరిప్లస్ మతానుసారము సింధు, గుజరాతు, తిరువాన్కూరు, బెంగాలు రేవులనుండి యూరపు, అన్య ఆసియా దేశములకు ఎగుమతి యయ్యెడివి.

భారతదేశమునందు, చీనా దిగుమతితో బాటు, క్రీస్తుకు అనేక శతాబ్దముల పూర్వమునుండే పట్టుపరిశ్రమ, పట్టుబట్టల నేత సమానాభివృద్ధి స్థితితో సాగుచుండెననుట నిర్వివాదాంశము.

క్రీస్తుకు పూర్వము నాల్గవ శతాబ్దమునందు భారతదేశములో పట్టుపరిశ్రమత్యున్నత స్థితియందుండెననుటకు కౌటిల్యుని అర్థశాస్త్ర నియమములే ప్రబలనిదర్శనములు. చూడుడు :

1. నేతనియమములు : నారలేకపట్టు బట్ట నేతలో—క్షౌమ, కౌశేయా నామ్—ఒకటినుండి నొకటిన్నరవరకు తూకములో హెచ్చును.

—ఇంగ్ల ప్రతి. పు. 254

2. పట్టుసరకులపై సాయిరి : నారవస్త్రముల, పత్తివస్త్రముల, పట్టుబట్టల మొదలగువానిపై రాజు 1/10 లేక 1/15 భాగము సుంకము వసూలు చేయును.

(3) పట్టు నేతగాండ్రకు ప్రోత్సాహము: నారబట్టల, పట్టుబట్టల, పూసీసరకుల, నూలువస్త్రముల నేత నేయువారలకు రాజ్యమునుండి సుగంధద్రవ్యములు, పూలమాలికలు మొదలగునవి నైపుణ్యత బట్టి పారితోషికము లొసగబడును.

—ఆంగ్లప్రతిపుట. 141

(4) దేశ, విదేశీ పట్టు: దేశమునందు స్థిరమగు పట్టువస్త్రములు 'కౌశేయము'లనీ, చీనా దేశమునందు తయారైన వానిని 'చీనాపట్టు' యనీ విభజింపబడినది.

—ఆం. ప్ర. పు 94

అర్థశాస్త్రమునందు చీనాసరకు 'చీనపట్టు'గా వ్యవహరింపబడినటుల యీ పట్టువస్త్రములను కాళిదాసు, భారవి మొదలగు కవిశ్రేష్ఠులు 'చీనాంశుక'ముగ నుపయోగించిరి.

దేశమునందు పట్టుపరిశ్రమ స్థిరరూపము బడసి లాభదాయకముగ నుండుటచేతనే వానిపై సుంకము-విక్రయము వెలపై ఆరవభాగము—విధింపబడియుండెను. పట్టు సహిత మాకాలమునందొక విధమైన వనోత్పత్తి విషయముగ నుండుటచేతనే, అన్యసామాన్యవిషయముల మాదిరి దీనికి ప్రత్యేకమైన సదుపాయములు గాని, సౌకర్యములు గాని, ప్రోత్సాహము గాని అవసరము లేకుండ యుండెడిది. ప్రతి దేశమునందు క్రొత్త పరిశ్రమ పెంపుదలకు, అభివృద్ధికి రాజ్యము నుండి ప్రత్యేకమైన సంరక్షణ, సహాయము కలిగించు నాచారము నేడు సహితము కానవచ్చును. పట్టు పరిశ్రమ, పట్టు నేత సంస్థాపనార్థము ఫరాసు, యింగ్లాండు దేశములందీ పద్ధతులే నవలంబింపబడినవి. వీనివలననే యీ పరిశ్రమచ్చట నభివృద్ధి గాంచగలిగెను. క్రీస్తు పూర్వము నాల్గవ శతాబ్దమునందు భారతదేశములో పట్టుపరిశ్రమ విషయమై ఇట్టి సౌకర్యము లేవియు కలిగింపబడనందున యీ పరిశ్రమ బహుకాల పూర్వమునుండియే యభివృద్ధి గాంచి లాభదాయకముగ యుండెననుట నిశ్చయము.

పట్టు నేత పరిశ్రమ యట్టి పరివ్యాప్తము లోపము కలిగియుండలేదు. దేశమునందు తయారు చేయబడిన పట్టుసరకులపై రాజ్యము సుమారు 6 నుండి 7 ప్రతిశతి సుంకము విధించియుండెను. చీనానుండి భారతదేశమునకు దిగుమతి చేయబడిన పట్టుసరకులపై 23 నుండి 26 ప్రతిశతి వరకు కాయారీ పన్ను విధింపబడుచున్నను పట్టు పారిశ్రామికులు చీనావారిపోటీకి ఇసుమంతైనను జంకక, ఆ కాలమునందు పట్టుపరిశ్రమత్యున్నత దశయందుండుటచే సరకుల విలువపై నాల్గవభాగము సుంకముగ చెల్లించుచుండిరి.

క్రీస్తుకు పూర్వము ౬వ శతాబ్దమునాటి దేశపు ఆర్థిక స్థితి చర్చించుచు వర్తమానకాలపు బౌద్ధపండితుడైన ర్హీస్ డేవిడ్ యీవిధముగా నేతవిషయమై నుల్లేఖించిరి:—

'సాలీలు కేవలము ప్రజ లుపయోగించు వస్త్రముల—ధోవతులు, కండువాలు మొదలగునవి—నే నేయక విదేశముల కెగుమతి చేయబడు నుత్తమ నాణ్యమైన మల్లులను, విలువకల పట్టుబట్టలను, పూనితో రగ్గులు, కంబళీలు, బ్లాంకెట్లు, దుప్పట్లు, తివాసులు నేయుచుండిరి.'

మరియు

'పట్టువస్త్రములు, మల్లులు, నాణ్యమైన, సుకుమారమైన బట్టలు, గాజు సరకులు, ఆయుధముల రక్షణలు, అంచులు, రగ్గులు, సుగంధద్రవ్యములు, ఔషధములు, దంతములు, దంతపు సరకులు, ఆభరణములు, బంగారు నగలు—దేశమందలి వర్తకులు వీని వ్యాపారము బాహాటముగ సాగించుచుండిరి.'

బౌద్ధభారతము. పు. 90, 98, 100

భారతదేశమునందు పట్టు పరిశ్రమ ప్రారంభమును నిర్ణయించిన అర్బుత్నాట్ కాలమునకు వేయి సంవత్సరముల పూర్వమే భారతీయులు పట్టుపరిశ్రమయందు, పట్టుగుడ్డల నేతయందపూర్వ నైపుణ్యము బడసియుండుటచే దేశమునందు తయారుచేయబడిన నాణ్యమైన పట్టుసరకును గ్రీసుదేశమున కెగుమతి చేయుచుండిరి. భారతీయుల నైపుణ్యము గ్రీకు ప్రజల కపరిచితము గాదని, యందుకే, డెన్కర్ స్పష్ట పరచెను. క్రీ. పూర్వము ౮వ శతాబ్దమువరకే భారతీయ వస్త్రములు, పట్టుదుస్తులు—వీనిని సంకోన్ లేక టిరియన్ యనుచుండిరి — ఫొహినేషియన్ వర్తకుల వ్యాపారముద్వారా హెల్లాస్ కందుచుండెను.

—భారతచరిత్ర. పు. 436

క్రీస్తుకు పూర్వము ౮వ శతాబ్దమువరకే భారతీయ సాలీల నైపుణ్యము ప్రపంచ వ్యాపమై వారు నేసిన సొగసు వస్త్రములు విదేశములకు తరుచుగ నెగుమతి యగుచుండుటచే యాకళ-అనగ, పట్టుపరిశ్రమ-అతఃపూర్వము కొన్ని శతాబ్దములనుండియైన దేశమునందేర్పడి ప్రాశస్త్యము గడించియుండుటచారిత్రికాంశము. అన్యులకల్పితాధారములపై దేశము నందీపరిశ్రమ యముక కాలమునందేర్పడినదని నిశ్చయించుటకు మారు అతి ప్రాచీనసమయమునందే యీకళ భారతీయుల హస్తమునందు సౌభాగ్యము గడించియుండెనని బుజువుయగుట నిజముగ గణనీయాంశము.

 

'పట్టుపురుగు తనవలతో తాను చిక్కుకొని యుండుననుపమానము లనేకములు సాంఖ్య, న్యాయదర్శనములందు కానవచ్చును.'

—సాంఖ్య 3—73

శ్రీమద్రామాయణమునందు పట్టు సరకుల నుల్లేఖనము లనేకములు గలవు. తూర్పుబెంగాలు ప్రాంతము పట్టుకు పుట్టినిల్లుగ వర్ణితమైయున్నది. అది నిజముగ గమనీయాంశము. సీతాన్వేషణ సమయమునందు మగధుల, మహాగ్రాముల, పుండ్రుల, అంగప్రాంతముల, పట్టుపురుగుల ప్రదేశముల, వెండి గనుల దేశముల సందర్శన మొనరించిన వివరములు 'కిష్కింధకాండ'—40.23—లో కాననగును.

లక్షలకొలది కంబళుల, అందమైన, సొగసైన పట్టుబట్టల వర్ణనలు 'బాలకాండ'—74.4—యందు గలవు.

దేశమునందు పట్టు పరిశ్రమ, పట్టుబట్టల నేత మహోన్నత దశయందుండినటుల 'మహాభారతము' నందు గలదు. పురుగులవలన తయారైన పట్టు వస్త్రములు కీటజములుగ, పట్టతో — బహుశః చీనా పట్టైయుండును — నేయబడినవానిని 'పట్టజము'లుగ సభాపర్వము—51-25-26—నందు పట్టు విభజనము గలదు. ఈ విభజనమున కాధారము 'అర్థశాస్త్రము' మృచ్ఛకటిక'మనుట నిశ్చయము.

కొందరు దేవతలు, దేవకన్యలు, అప్సరసలు శ్వేతాంబరధారులు— తెల్లని పట్టుదుస్తులు ధరించిన— శ్రీహరికౌశేయ వాసమైయుండినటుల వనపర్వము—159-18—నందు గలదు.

వేదవ్యాసునకు పట్టుపురుగులు పరిచితమనుటకు 'శాంతిపర్వము'—330-28-29—ప్రబలాధారము.

'పట్టుపురుగు తన వలతో తాను కప్పబడినటుల, పొరపాటులవలన మీరు నిర్మించుకొనిన వలలోనే మీరు నిరంతరము బంధితులగుచున్నారు. మీరు మీ పరిస్థితినైజమును తెలుసుకొని ప్రవర్తించిన నెంత బాగుండెడిది. భౌతిక విషయాసులందు దప్రమత్తులై, వ్యామోహితులై నుండుట భావ్య మనిపించుకొనదు. దీనివలన కీడుసంభవించుట సిద్ధము. పట్టుపురుగు తన చుట్టు నేర్పరచుకొను జాలములో, తన కృత్యములతో నంతమొందుచున్నది.'

వశిష్ఠసూత్రము లతి ప్రాచీనములు. వాని రచనా విధానము బౌద్ధాయన సూత్రముల బోలియుండును. వానియందు గద్య, పద్యరూపములు గలవు. వైదిక గ్రంథముల నుల్లేఖనము లనేకములు వానియందు గలవు.

'విజ్ఞాయతే హీనస్త్రి శీర్షాణాం త్వష్ట్రిం హత్వా' —5-8.

యనుసూత్రము యీనాటి న్యాయశాస్త్రమునం దతి ప్రాచీనమని బుజువుపరచుచున్నది.

ఈనాడు దృగ్గోచరమగుచున్న వ్యాస సూత్రములు ప్రాచీనములే. కాని ఆది గ్రంథము సూత్రరూపమున నుండిన నిదర్శనములు గలవు. బౌద్ధాయను డీ ప్రాచీన ధర్మసూత్ర కర్తను—2-168.

ఓం వ్యాసంతర్పయామి'

అనగా 'ఓం. వ్యాసుని పూజించుచున్నాన'ని నమస్కరించెను.

ఈ ఉభయుల— బౌద్ధాయనుని, వ్యాసుని — నిశ్చితకాల మిదమిద్ధముగ తెలనందున ప్రాచీనులనుట నిశ్చయము.

ఈ విషయమునందు వరరుచి సాక్ష్యము మహోత్తరము. సంస్కృత శబ్దమగు 'దుకూల'మును ప్రాకృతమునందు మార్పు విధానము—1-35-వాక్యమునందు చూపియున్నాడు. సంస్కృత శబ్దమందలి 'ఉ'కారము అకారముగ మారునపుడు 'ల'కార మటులే నిలిచియుండునని దాని భావము. 'దు అల్లం, దు ఊలం' యను మార్పును చూడుడు.

ఈతని కాలము వివాదాస్పదము గాదు. బుద్ధుని నిర్వాణానంతరము 300 సంవత్సరముల అనగా క్రీ. పూ. 543 సంవత్సరము వాడని హుయాన్ త్సాంగ్ నిశ్చయించెను. కాబట్టి వరరుచి క్రీస్తుకు పూర్వము మూడవశతాబ్దమునందు తన విజ్ఞానజ్యోతితో ప్రపంచమును ప్రకాశవంత మొనరించి యుండుట నిశ్చయము. ఇక కోవెల్ మతానుసారముగ నతడు క్రీస్తుకు పూర్వము మొదటిశతాబ్దము నందుండబడెను.

ఈ విషయములో 'మృచ్ఛకటిక' వర్ణనలు గమనార్హములు, ఆ నాటకమునందు—5 అం. 3 రం— 'విద్యుద్గుణాకౌశేయాః' అనగ 'విద్యుద్రూపమున మేఘములు పట్టుపీతాంబరములు ధరించినటుల దృగ్గోచరమయ్యెన'ని గలదు. మరియు నాల్గవ అంకమునందు విదూషకుడు వసంతసేన రాజభవనమునందు ప్రవేశించి బటులప్రశ్నించెను :—

'భోది, కో ఏసో పట్టపావార అదా'

అనగ పట్టుకండువా కప్పుకొన్న వారెవరని? దీని భావము.

ఈ 'మృచ్ఛకటిక' నాటకము క్రీ. పూర్వము మొదటి శతాబ్దమునందు రచింపబడిన విషయము సర్వ పండితాభిప్రాయము.

పాణిని, శాకటాయనులలో పాణిని కాలము క్రీ. పూ. 10 వ శతాబ్దమనుట సర్వజనాంగీకారము. ఈ ఉభయులు 'కౌశేయ—పట్టు—' శబ్దము యుత్పత్తి, ధాతువు గురించి సూత్రముల విశదపరచిరి. అమరకోశమునందు విస్పష్టపరచబడినటుల పట్టుపురుగుల వలనుండి యుత్పత్తియగునని నీ యుభయులు తెలిపియున్నారు. పాణిని సూత్రానుసారము 'కౌశేయ' శబ్దమునకుగల అర్థములన్నియు తేటపరచియున్నారు.

'కోశే సంభూతం కౌశేయం వస్త్రం' అనగ పట్టువస్త్రములు.

కౌశేయం కృమికోశోత్థం' —అమరకోశం'

'కోశ' శబ్దమున కర్థము 'పట్టుదార ముండు కాయ'—*Cocoon*. 'కౌశేయ' మనగ 'కోశ' మనుకరించునది. పట్టుసంబంధమని భావార్థము.

ఆకాలపు అనగ క్రీస్తుకు వేయి సంవత్సరముల పూర్వము, 'బౌద్ధాయన ధర్మసూత్రము' లీ విషయమును బలపరచుచున్నవి. పట్టువస్త్రముల పరిశుద్ధి విధానము—1-8-39, 42—చక్కగా గలదు. ఈ ధర్మశాస్త్రము క్రీ. పూ. 8 నుండి 10 వ శతాబ్దమునందు రచింపబడినటుల పండితుల అభిమతము.

ఇంత ప్రాచీన గ్రంథరాజమగు 'సుశ్రుతసంహిత'లో పట్టువస్త్రముల నుపయోగము వివరముగ వర్ణింపబడియున్నది. చూడుడు :

'అర్ధవస్త్రం మహాభాగం, కుమారంసా ప్రసూయతే,
దుకూలపట్టకౌశేయ భూషణారిషు దోహృదాత్'

కలకత్తా విశ్వవిద్యాలయమువారు ప్రచురించిన 'హిందువుల శాస్త్రపరికరములు—*Surgical Instruments of Hindus*'—అను గ్రంథపు పీఠికలో సుశ్రుతుని కాలము చక్కగ చర్చింపబడినది. గ్రంథకర్త చారిత్రకాధారములపై చర్చించుచు నతడు క్రీ. పూ. 1000 సంవత్సరముల వాడుండెనని ఖచ్చితముగ నిశ్చయించెను. శ్రీ కె. యల్. భిష గ్రత్న గారి 'సుశ్రుత సంహిత'—సం. 1 పు 78—యందు సహిత నీకాలమే బలపరచబడినది.

ఆయతిప్రాచీన కాలములో సహితము హిందువులు 'దుకూల', 'పట్టు', 'కౌశేయ'—పట్టుపురుగులతో లభించుపట్టు—వస్త్రములతో సుపరిచితులనుట నిర్వివాదాంశము.

'బౌద్ధాయన ధర్మసూత్రములు,' 'పాణినివ్యాకరణము', 'సుశ్రుత సంహిత' నిర్వచనములవలన పట్టుపరిశ్రమ, పట్టువస్త్రములచేత భారతదేశమునందు క్రీ. పూ. 1000 సంవత్సరముల నాడున్నతస్థితి గాంచియుండెనని స్పష్టమగుచున్నది. ఆకాలమునందా పరిశ్రమ యెంత యభివృద్ధి దశగడించియుండినది యానాటి జనసామాన్యపు వాడుకయే వేనోళ్ళ చాటుచున్నది.

'పట్ట'శబ్దము కేవలము చీనాదేశపు పట్టువస్త్రముల కుపయోగింపబడినటుల నిశ్చయించుకొనిన, సుశ్రుత సంహితయాధారముపై యీనాటివరకు అనగ క్రీ. శ. 1000 సం. వరకే చీనాపట్టుబట్టలు దేశమునకు దిగుమతియగుచుండెనని యంగీకరించకతప్పదు. భారతదేశములో పట్టు పరిశ్రమ క్రీ. పూ. 1000 సంవత్సరముల నాడుండినటుల యంగీకరించిన, అన్య ఆధారములపై యీ పరిశ్రమ యంతకు పూర్వమే యౌన్నత్యము గడించినటుల స్వీకరించవలసియుండును. చూడుడు:—

బౌద్ధాయన ధర్మసూత్రములందు 'వైఖానస ధర్మప్రశ్న'—3-3—15,22—నుల్లేఖనము గలదు. వైఖానసుడు బౌద్ధాయనికన్న పూర్వమువాడు. ఆతని 'ధర్మప్రశ్న'లో 'పట్టు, ఉన్ని నరకులు క్షారములతో లేక సౌడులలో పరిశుద్ధి మొనర్పబడవలయును. 'అంశుపట్ట'—నారపట్టు (*Linen*)—శిర్పలనుతో పరిశుద్ధి మొనర్పవలయున'ను సూత్రముగలదు. కొద్ది మార్పుతో యీ శబ్దములు 'మనుస్మృతి'—అ5-120 యందు కానవగును. దీనివలన వైఖానసుడీ శబ్దములను ప్రాచీనమైన 'మనుధర్మసూత్రము'లనుండి గ్రహించియుండుట నిశ్చయము.

'పట్టుకు' 'కౌశేయ' శబ్ద మపయోగింపబడుటయే దీని ప్రాముఖ్యత. ఆనాటి 'మానవధర్మసూత్రము' నందీశబ్దమే వాడబడియుండుట సంభవము. ఈ నాటి సూత్రము—మనుస్మృతి—నందు సహితమీశబ్దమే కానబడుచున్నది. దీనివలన యానాటిప్రజలకు పట్టు వస్త్రములు సుపరిచితమే గాక యీ పట్టుపరిశ్రమ యతిమహోన్నత దశలో దేశమునందుండినటుల సహితము తేటమగుచున్నది.

పురాణములందలి రాజవంశావళు లీ విషయములో కొంతసాయపడుచున్నవి. ప్రతిపాలకుని పరి

పాలన కాలము సామాన్యగ 30 సంవత్సరములుగా భావించినచో, ఇక్ష్వాకుల మూలపురుషుడు, సూర్యవంశ సంస్థాపకుడగు మనువు కాలము క్రీ. పూ. 3600 నుండి 4000 సంవత్సరముల కాలమగుచుండును.

ఇక్ష్వాకునుండి శ్రీరామచంద్ర ప్రభువు వరకు నయోధ్యరాజ్యమును 30 రాజులు ప్రజానుకూలముగ నేలినట్లుల పురాణములు విదితపరచుచున్నవి. అనగ సూర్యవంశ సంస్థాపకుని కాలమునుండి 1000 సంవత్సరముల యనంతరము శ్రీరామచంద్రుడు పాలించినట్లుల తేలును.

సూర్యవంశమునకు చెందిన శ్రీరామచంద్రుని నుండి యుధిష్ఠిర చక్రవర్తి మధ్యగల రాజవంశావళి 'విష్ణుపురాణము'నందు గలదు. యుధిష్ఠిరునకు పూర్వమా వంశమునకు చెందిన 39 రు రాజులు సామ్రాజ్యమేలిరి. మహాభారతయుద్ధము క్రీ. పూ. 14 వ శతాబ్దమునందు జరిగినట్లుల నంగీకరించుపక్షమున శ్రీరామచంద్రప్రభువు కాలము క్రీ. పూ. 25 వ శతాబ్దమగుచున్నది. ప్రతిపాలకుని సామాన్యపరిపాలన కాలమును 26 సంవత్సరములుగానె లెక్కించిన—1400 + 39 × 26 = 2414—క్రీ. పూ. శ్రీరాముని కాలము 2414 యగుచుండును.

భారతీయ విద్వాంసు లనేకు లభిప్రాయపడినట్లుల యుధిష్ఠిరుని కాలము క్రీ. పూ. 3100 సంవత్సరములైన శ్రీరామచంద్రుని కాలము క్రీ. పూ. 4100 సంవత్సరములు, ఇక్ష్వాకు సమయము క్రీ. పూ. 5100 సం. యగుటచే ధర్మశాస్త్రకర్తయైన మనువు సమయము క్రీ. పూ. 36 వ లేక 52 వ శతాబ్దమై తీరును.

శ్రీమద్రామాయణము, పురాణమునందలి రాజవంశావళులను సత్యసమ్మతములుగా స్వీకరించిన, ఆవిధముగ కారను కారణము లేవియు లేకుండుటచే మనువు కాలము క్రీ. పూ. 4000 సంవత్సరము లనుట నిశ్చయము. వైఖానస, గౌతమ, బౌధాయన—క్రీ. పూ. 10 వ శతాబ్దమువారు—ధర్మశాస్త్రజ్ఞు లనుకరించిన సామాన్య ధర్మసూత్రమును నాధారమునుకొనిన కోశకార లేక పట్టుపురుగునుండి తీయబడు పట్టువస్త్రము — కౌశేయ — దేశమందలి పట్టు రి[illegible]మను దేశీయులు ప్రోత్సహించుచు పట్టువస్త్రముల నుపయోగించు విధానము ప్రజ లెరింగియుండుట తథ్యము.

భారతదేశమునందు పట్టుపరిశ్రమ, పట్టు చేత క్రీస్తు పూర్వము 40 లేక 50 శతాబ్దములందే స్వతంత్రముగా మహోన్నత స్థితి బడసియుండెడి దనుట యంగీకరించక తప్పదు.

చీనా దేశమునందీ పట్టుపరిశ్రమ యీ కాలమునందో లేక తర్వాతనో ప్రారంభమై అభివృద్ధిగాంచియుండుట సంభవము. పట్టుపురుగుల పెంపుదల, పట్టు పరిశ్రమ, పట్టు నేత మొదలగు నీకళయందు భారతీయులు నిపుణమతులైనను చీనాప్రజలకు ఋణగ్రస్తులు కారనుట నిర్వివాదాంశము.

పట్టుపరిశ్రమగూర్చి విదితమైన యీ ప్రాచీనత యూరపీయులకు నాశ్చర్యకరము. పైన విస్పష్టపరచబడిన చారిత్రకాధారములపై యీవిషయమును పరిశీలించిన —

1. భారతదేశమునందు పట్టు నేత, పట్టు పరిశ్రమ స్వతంత్రముగ నభివృద్ధి గాంచినది.

2. క్రీ. పూ. 40 శతాబ్దములనాడే దేశమునందీ కళ కౌన్నత్య మేర్పడినది.

3. పట్టుపరిశ్రమ విషయములో దృగ్గోచరమయ్యే యాధారములను సందేహాస్పదములుగానె భావించిన యీ పరిశ్రమ దేశమునందు క్రీ. పూ. 1000 సంవత్సరములనాడే నైపుణ్యము గడించినదనుట నిర్వివాదాంశము.

అను ముఖ్యాంశములు చారిత్రకాధారముపై ఋజువగుచున్నవి. ఇన్ని ప్రబలాధారము లుండుచుండ భారతదేశమునందు పట్టుపరిశ్రమ క్రీస్తు మూడు లేక నాల్గవ శతాబ్దమునందు ప్రవేశపెట్టబడిన దను పాశ్చాత్యపండితుల పక్షపాత నిర్ణయము లేవిధముగ గమనార్హములగును?

ఇకనైనా విజ్ఞానాభివృద్ధికి పాశ్చాత్య పండితులు, ముఖ్యముగ ఎన్సైక్లోపిడియావంటి యాధార గ్రంథ[illegible] చారిత్రకాంశముల దృష్ట్యా [illegible] బూను[illegible]

# గ్రంథవిమర్శనము




## నాటకోపన్యాసములు

[విమర్శనము]

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ. త్రివేణీ పబ్లిషర్స్, మచిలీపట్టణము. వెల: 1-4-0.

ఈ గ్రంథశీర్షిక నాటకోపన్యాసాలని ఉన్నా, ఈ ఉపన్యాసాలు ధర్మవరం కృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసరావుగారల నాటకాలను గురించిన విమర్శకోపన్యాసాలు. ఈ గ్రంథంలో కొంత వరకు సామాన్యంగా రూపకసమస్యలకు సంబంధించిన చర్చకూడా ఉన్నది.

ఇటీవల కొంతమంది రూపకవిమర్శకులు రూపకాల్లో సంగీతంగాని, పద్యాలుగాని నృత్యాదులుగాని ఉండకూడదని అనడం ఒక పరిపాటి అయింది. ఇలాంటి మాటలన్నీ—ఏదో ఒక తరహా రూపకాలు మనస్సులో పెట్టుకుని ఇక మిగిలినవన్నీ ఆ దారిలోనే నడవాలనే అభినివేశంతో అన్నవేగాని రూపకతత్త్వంలోతుల్లోకంటా పరిశీలించిన మాటలు కావు. శ్రీ అనంతకృష్ణశర్మగారీ ఉపన్యాసాలలో ఇలాంటి దుర్విమర్శలన్నీ నిశితంగా ఖండించి ఆయా వాదాల్లోగల దౌర్బల్యం ఎత్తిచూపించారు.

అయితే ఈ ఉపన్యాసాలలో వేరొకచోట వీరు స్త్రీలే స్త్రీ పాత్రలు ధరించాలనడం సముచితం కాదనీ, అది అవినీతికి దారి తీయగలదనీ, పురుషులలో కూడా స్త్రీ పాత్రలు చక్కగా అభినయించి, ఒప్పించిన సమర్థనటులనేకులు ఉన్నారనీ వ్రాశారు.

రూపకాల్లో ప్రతీదీ వాస్తవజీవితానికి అతి సన్నిహితంగా తీసుకురావాలనే వాదం చాలా అనర్థాలకు దారి తీస్తుందని శ్రీ అనంతకృష్ణశర్మగారు సహేతుకంగా నిర్ధారణ చేశారు. అల్లాగే ప్రతీ చిన్న విషయము ప్రేక్షకులభావనా పటిమకువదిలివెయ్యడం కూడా ఇలాంటి అసందర్భాలకే దారితీస్తుంది. ఎవరో ప్రతిభావంతులైన నటులు స్త్రీ పాత్రలు సామర్థ్యంతో నిర్వహించారన్నంత మాత్రాన ఇక స్త్రీ పాత్రలన్నీ పురుషులే నిర్వహించాలంటే ఇది నటసామాన్యానికి సాధ్యమయ్యే పనిగాదు. నటులకు మొట్టమొదట స్త్రీ స్వభావానుకరణమే అతి కష్టసాధ్యమైతే, ఆ పైన ఆయా పాత్రల స్వభావాభినయం మరింత క్లిష్టమైపోతుంది. ఇంత క్లిష్టపరిస్థితిలో పురుషులే స్త్రీల వేషాలు వెయ్యాలనడంకంటె సమర్థులైన నటీవర్గానికే ఆయా పాత్రాభినయం విడిచిపెట్టడం న్యాయ్యము. ఇక స్త్రీలు నాటకరంగంలోకి ప్రవేశిస్తే అది అవినీతికి దారి తీస్తుందనడం స్త్రీలను కేవలం అనుమాన దృష్టితో చూసేవారి ధోరణిలా కనబడుతున్నది. ఈ దృష్టితో చూస్తే అసలు స్త్రీ పురుషులు పరస్పర సాహాయ్యంతో కళాభ్యాసంగం చెయ్యడమే దుర్లభమై కళాభ్యాసానికే ఒక పెద్ద విఘాతం ఏర్పడుతుంది. కళకు, నీతికీ అవినాభావ సంబంధం ఉన్నదని అందరంగీకరిస్తారు గాని, కేవలం ఇల్లాంటి సంకుచిత నియమాలే ఆదర్శసిద్ధికి అంతగా సాహాయ్యకారులు కావు.

ఈ విషయం ఒక్కటీ విడిచి వేస్తే రూపకాల విషయంలోను, నాటక కర్తల రచనావిధానం మీదను వీరు వ్రాసినవి నిశితమైన వీరి విమర్శకదృష్టికి తార్కాణంగా ఉన్నాయి.

వీరిది ప్రత్యేకంగా ప్రశంసించతగిన గ్రాంథిక వచనరచన.

ఇంత ఉత్తమ గ్రంథం తిరిగి ముద్రించి ప్రకటించిన త్రివేణీ ప్రకాశకులభినందనీయులు.

---

## జనకరాగ కృతిమంజరి

మంగళంపల్లి బాలమురళీకృష్ణ. ప్రతులకు: గ్రంథకర్త, సత్యనారాయణపురం, విజయవాడ-2. వెల: నాలుగురూపాయలు.

గ్రంథకర్త దీనిలో మేళకర్తలైన 72 జనక రాగాలకు కృతులు రచించారు. ఈ కృతులలో కొన్ని గీర్వాణకృతులుకూడా ఉన్నాయి.

కృతిరచన కవిమాత్రులకు అసాధ్యమైన కార్యం. ఇటు కవితలోను, అటు సంగీతంలోను, పారంగతులైన వారుగాని దీనిలో కృతకృత్యులు కాలేరు.

కృతకృత్యులయిన త్యాగరాజాదుల కృతులలో కూడా కవిత చాలాచోట్ల లుప్తప్రాయమై సంగీతానికి ఆచ్ఛాదన ప్రాయంగా నిలిచిపోయిన ఘట్టాలనేకం ఉన్నాయి. ఇంకా కొన్నిచోట్ల కొన్ని కృతులు సంగీత సాహాయ్యంవల్లనే రసస్ఫూర్తి కలిగిస్తాయి గాని, సంగీత సహాయం లేకుండా పఠించినప్పుడవి చాలా పేలవంగా వినిపిస్తాయి. కవిత సంగీతం ఒకదానినొకటి ఆచ్ఛాదించకుండా పరస్పర సౌందర్యం ఇనుమడింపజేసిన ఘట్టాలు త్యాగరాజ కృతులలోగూడా చాలా స్వల్పమే.

ప్రస్తుత కృతులలో త్యాగరాజకృతి ఛాయలు చాలాచోట్ల కనిపిస్తున్నాయి. ఆయా దేవతలను ఉద్దేశించిన కృతులలో వారివారికి సంబంధించిన స్తుతి నామాల సమూహమే ఎక్కువగా కనిపిస్తున్నది గాని ఈనామ సమ్మేళనంలో కవితఛాయ మాత్రమే.

సంస్కృతాంధ్ర కృతులలో రచయిత వ్రాసిన భావమాత్రం కృతి రచనాసంప్రదాయ మార్గం అతిక్రమించకుండా శిష్టంగాను, స్వాదువుగాను వినిపిస్తున్నది. అయితే ఈ కృతులలో అంతటా సామాన్యంగా మొదటి చరణంలో ప్రార్థనాపరమైన ఒక వాక్యం ఉంటుంది. మిగతా చరణాలన్నీ ఆ వాక్యాంతర్భూతమైన కర్మవిశేషణాలుగానే కనిపిస్తున్నాయి. ఈ క్రింది కృతినిబట్టి వీరి కృతిరచనాధోరణి గ్రహింపవచ్చును.

షడ్విధమార్గిణి – రూపకం

ప. హైమవతీం భజమానస

అ. చాముండేశ్వరీం చారువదనీం
శరచాప గదా శూలపాణిం

చ. శుంభ ముఖ మహిషాసుర
నిశుంభా ద్యసురదమనీం
శోకాది నివారిణీం శోభిత
మురళీరవ సుధా స్వాదినీం.

ప్రాచీన కాలంనించీ కృతి రచయితలందరు, కేవలం ఆయా దేవతాపరమైన భక్తి ఒకటే ప్రధాన భావంగా తీసుకుని కృతులు రచిస్తున్నారు. ఇది ఒకటే కాక దేశభక్తి మొదలైన ఇతర విషయాలను కూడా తీసుకుని కృతులు రచించే అవకాశం ఉన్నది. దీనివల్ల కృతులలో విషయవైవిధ్యం ఏర్పడి అవి శ్రోతలకింకా మనోరంజకంగా ఉండవచ్చును. కృతికర్త లీ విధమైన విషయవైవిధ్యంకల రచనలవల్ల కృతిరచనలో ఒక నూతన పద్ధతులు ప్రవేశపెట్టవచ్చును.

గ్రంథకర్త 72 మేళకర్తలలోను కృతులు రచించడంవల్ల సంగీతాధ్యేతలకు అప్రసిద్ధంగా ఉండిపోయిన మారుమూల రాగాల స్వరూప స్వభావాలు చక్కగా విశదపరిచారు. ఈ విధంగా ఈ గ్రంథం సంగీత విద్యార్థులకు బాగా ఉపకరిస్తుంది.

---

## మధుబాల

[కవిత]

బోయి భీమన్న. దేశకవితా మండలి. విజయవాడ 2. వెల: రూపాయిన్నర.

ఇది మంజరీ ద్విపదకు సన్నిహితమైన గేయచ్ఛందస్సులో రచించిన ఆరాశ్వాసాల ఖండకావ్యము.

ఇందులో నాయికానాయకులు మధుబాలా గౌతములు. వీరిద్దరు అరణ్యంలో విరహాతురులై తిరుగుతూ మానవసేవార్థం తిరిగి ప్రపంచంలో ప్రవేశిస్తారు. స్వరాజ్య సాధనకోసం ప్రతిజ్ఞా స్వీకారం చేస్తారు. వారి ప్రవేశం భారతాభ్యుదయసూచకంగా పరిణమిస్తుంది. సంగ్రహంగా ఇది ఈ కావ్యంలోని ఇతివృత్తం.

ఇది ఎక్కువగా వర్ణనపరమైన కావ్యం. ఇందులో కథా శరీరం చాలా స్వల్పం. ఉన్న కథ అయినా రచయిత అంతగా ఆకర్షకంగా చెప్పినట్లు కనబడదు.

అక్కడక్కడ ఆయా కథాఘట్టాలలో కవి చేసిన ప్రకృతి వర్ణనము, భావ వ్యక్తీకరణము హృద్యంగా ఉన్నాయి. అంతేకాక కొన్ని కొన్ని కథాఘట్టాలీ కవి చక్కగా అభివర్ణించారు. ప్రస్థానంలోని ఈ ప్రారంభ పద్యాలు దీనికి తార్కాణంగా ఉన్నాయి.

"వర వసంత లతాంత కర చామరముల
వలిగాలు లల్లన వనలక్ష్మి వీవ
సుఖముగా నిద్రించుచున్న లతా కు
టీరముల్ గాంచిరి గారాబ మొలుక
భూమాత ప్రక్కలోఁ బుడిటి మంచమున
సోకొట్టుచున్న దా యుద్యానవనము;
మంచంపుఁ బందిటి మల్లెపువ్వులన
చెదజిమ్ము గాంతులు విరిసితారకలు
పైకి పువ్వులు పూచి పరమమోదమ్ము
చేకూర్చు; లోపల-చిట్టి చీకటిగ"

ఈ క్రిందది వీరి భావవ్యక్తి చాతుర్యానికి తార్కాణమైన రచన.

"భద్రాచ లాటవీ ప్రాంత గోదావ
రీ తీరు లరయు సీతారామభద్రు
లేనాడు గన్పింపఁ దెందుఁ బోగలరు?
దాటిఁగా చెడి రామదా సొక్కడున్న?"

రచయిత పీఠికలో వ్రాసినట్లు ఈ కావ్యంలో అక్కడక్కడ కొన్ని శబ్దస్ఖాలిత్యాలు దొర్లాయి. స్వాదు కవితాశక్తి స్ఫోరకమైన ఇటువంటి రచనలో ఇల్లాంటి దోషములు పానకంలో పుడకల్లాగ తగులుతున్నాయి. రచయిత ద్వితీయ ముద్రణంలోనైనా ఇవి సవరించుకోగలరని ఆశిస్తున్నాను.

---

## శబరి

[రూపకము]

ఇది అయిదంకాల గద్య నాటిక. ఇందులో అక్కడక్కడ సకృత్తుగా పాటలుకూడా ఉన్నాయి. శబరి భక్తిసాధన దీనిలోని ప్రధాన కథావస్తువు.

ఈ శబరిభక్తి అమాయికమైనది. ఈ రూపకంలో అది అతిసున్నితంగా పరిణతి పొందినది.

ఈ పరిణతి ప్రదర్శనంలో రచయిత చూపించిన నైపుణి ప్రత్యేక ప్రశంసాపాత్రమైనది.

ఈ రూపకంలో రచయిత ఇద్రిని ప్రకృతి పెంచిన అల్లారు ముద్దుబిడ్డగా చిత్రించారు. దీనిలో మిగిలిన వ్యక్తులలాగే ఈమెకూడా శబరిభక్తి పరిణతికే దోహదం కల్పిస్తుంది.

అంతకంటె ప్రత్యేకత మిగిలిన పాత్రలలో గాని ఈమెలో గాని లేదు.

ఇది భావప్రధానమైన (*Lyrical*) రూపకాల వర్గీకరణంలోనికి వస్తుంది. నిజానికిది కవితా రూపంలో రచించవలసిన నాటకం. అయితే రచయిత తన వచన రచన ద్వారానే లక్ష్యం అందుకున్నారు.

విపులమైన రంగవర్ణనలు, పరిసర వర్ణనలు, రచయిత లక్ష్యసిద్ధికి చాలా సహకరించాయి.

ఇది భావప్రధానమైన రూపకం కనకనే దీనిలో రూపకస్వభావం చాలా తక్కువే. అయితే రంగ వర్ణనాదులద్వారా రచయిత భావం పాఠకుల మనస్సులలో సూటిగా నాటుకుంటుంది.

ఈ విధమైన రూపకాలు తెలుగులో చాలా తక్కువ. మెటర్‌లింక్ మొదలైన పాశ్చాత్య రచయితలీరకం రూపకాలు చాలా రచించారు. శ్రీ చింతా దీక్షితులు గారావరవడిలో నడిచి తెలుగు సంప్రదాయానికి చెందిన శబరి కథ తీసుకుని చక్కని రూపకం రచించి తెలుగు నాటక రచనలో కొత్త తెన్ను చూపించారు.

త్రివేణీ ప్రకాశకులు ప్రచురించిన ఈ నాటకం ద్వితీయ ముద్రణం అన్ని విధాలా ఆకర్షణీయంగా ఉన్నది.

---

## వెలుగునీడలు

[కవిత]

పోడూరి భోగరాజు బి. యె. పట్టాభిరామా ప్రెస్, ఏలూరు. వెల రూపాయిన్నర.

ఇది రచయిత అప్పుడప్పుడు రచించిన ఖండకావ్యాల సంపుటి. ఇందులో కొన్ని గేయాలుకూడా ఉన్నాయి.

ఈ గేయాలు, పద్యాలు చాలా వరకు నేటి కాలంలో ఆధునికుల ధోరణిలోనే నడిచిపోయాయి.

ఈ రచయిత వ్రాసిన గేయాలనుగురించి అంతగా వ్రాయవలసిన దేమిలేదుగాని ఈ రచయిత వ్రాసిన గీతికలు వృత్తాలు మొదలైన సాంప్రదాయిక ఛందస్సులలో కవితలో కొంత పాటవం కనిపిస్తున్నది. ఈ క్రింది సీసపద్యం వీరి రచనాశక్తికి తార్కాణం కాగలదు.

"క్రొంగ్రొత్త వయసున కులుకుతో విలసిల్లి
　　తరుణీ బుగ్గల నీవు చిరుతసిగ్గు
మధుర రాగంబున మత్తిల్లి హాయిగా
　　వరవిచ్చు కళిక్రోయి కెరలు సొగసు
మొలక నవ్వుల పొంచి యలలుగా దిరుగుచు
　　వెలుగులై హృదయాల వలచు జిలుగు
నెలవంక పొదులలో నిసుపాము కిరణమై
　　తలపుల స్పందించి కలము పొలుపు
నిన్ను గన్న క్షణంబులో నిన్ని స్మృతులు
హృదయసీమను గిలిగింత లిడుచు జలకు
లలితకళవా! నీవు! మరి గులాబిపూవు!"

..............................

---

## పద్మపురాణము

[ఆదిమ ఖండాంధ్ర వచనము]

అనువాదకులు: శ్రీ మరువాడ శంభన్న శాస్త్రి. ప్రకాశకులు: సాధన గ్రంథమండలి, తెనాలి. వెల: రూపాయిన్నర.

పద్మపురాణం అష్టాదశపురాణాలలోను ప్రథమంగా పేర్కొనబడిగిన మహాపురాణము. ఇది ౫౫ వేల శ్లోకాల గ్రంథము.

దీనికి ప్రాచీన కవి మడికి సింగన్న వ్రాసిన పద్యాంధ్రీకరణం ఆంధ్రవాఙ్మయ పరిశీలకులకు సుపరిచితమే. అయితే అది సంపూర్ణమైన యథామూలాంధ్రీకరణం కాదు. ఇటీవల పిసుపాటి చిదంబర శాస్త్రిగారొకరు దీనికి యథామూలంగా సంపూర్ణమైన పద్యాంధ్రీకృతి రచించారు. అయితే అది అప్రకటితంగానే ఉండిపోయింది.

ఇప్పుడు శ్రీ మరువాడ శంభన్న శాస్త్రిగారు రచించినది యథామూలమైన గద్యానువాదము. ప్రస్తుత గ్రంథంలో ఆదిమఖండమాత్రమే ఉన్నది.

మన పురాణాలు భారతీయసంస్కృతికి రత్నపేటికలు. ఈ సంస్కృతి ప్రజాసామాన్యానికి అందించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

అందుచేత వచనానువాదపద్ధతి సముచితమైనదే. కాని ఈ అనువాదం బాగా సంస్కృతపద జటిలమై సామాన్య వచన పాఠకులకు క్లిష్టంగా ఉన్నది. అనువాదకు లికముందు ఖండాలలోనైనా ఇంతకంటె సరళానువాద పద్ధతి అవలంబించగల రని ఆశిస్తున్నాము.

---

# గ్రంథస్వీకృతి

## స్వేచ్ఛాపథము

[అనువాదము]

హావర్డ్ ఫాస్ట్

అనువాదం: అశ్వినీ కుమారదత్తు. ప్రకాశకులు: ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ.

ఇది అమెరికాలో జీవిత కష్టనిష్ఠూరాలకు సంబంధించిన నవల. వారి జీవిత పరిస్థితులన్నీ మూల రచయిత వాస్తవికంగా కళ్లకు కట్టేటట్లు చిత్రించాడు.

అనువాదంలో తగు లాలిత్యము తక్కువగా ఉన్నా భాషలో జవసత్త్వాలు తొణికిసలాడుతున్నాయి. ఈ భాషాపాటవంవల్ల నవల ప్రారంభిస్తే కొసదాకా చదివించి వేస్తుంది.

---

టాల్‌స్టాయి కథలు. అనువాదం: మహీధర జగన్మోహన్. విశ్వసాహిత్యమాల. రాజమహేంద్రవరం. వెల: రూపాయిన్నర.

ఈ సంపుటిలో పదికథ లున్నాయి. ఇవి టాల్‌స్టాయి వ్రాసిన కథలలో కొన్నింటికి అనువాదాలు.

ఇవి అన్నీ టాల్‌స్టాయి వ్రాసిన వాటిలో బాగా ప్రసిద్ధికెక్కిన కథలు. రచయిత వ్రాసిన అనువాదం హాయిగా నడిచిపోతూ ముందుముందింకా చదవాలని కుతూహలం కలిగిస్తున్నది.

---

## లెనిన్ జీవిత కథలు

రచన: జగన్మోహన్. విశ్వసాహిత్యమాల. రాజమహేంద్రవరం. వెల: ఒకరూపాయి.

ఇది చిన్నపిల్లలకోసం వ్రాసిన పుస్తకం. రచయిత లెనిన్ జీవిత వృత్తాంతం తీసికొని అది చిన్న చిన్న కథలుగా విభజించారు. ఇవి అన్నీ చిన్న పిల్లల కనువైన భాషలో వ్రాసిన కథలు.

ప్రకాశకు లీ పుస్తకం పిల్లల కనువైన పెద్దపెద్ద అక్షరాలలో ముద్రించారు. చిత్రాలు కేవలం ఫొటోలే కాకుండా చిన్న పిల్లల మనఃప్రవృత్తి కనుకూలమయిన వర్ణ చిత్రాలయితే ఈ ప్రచురణ పిల్లల కింకా ఆకర్షణీయంగా ఉండేది.

---

Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.